శ్రీమతే రామానుజాయనమః.

# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## పూర్వభాగము (ముప్పది గుచ్ఛములు)


గ్రంథకర్త:

అనంతపురంజిల్లా తాడిపత్రి పురవాసి,

శ్రీమాన్ బుక్కపట్టణం నరసింహాచార్యులు.





మొదటికూర్పు 500 ప్రతులు.

తాడిపత్రి భద్రావతి ముద్రాక్షరశాలయందు

ముద్రితము—1947




వెల రు 4-0-0

(తపాలాఛార్జి ప్రత్యేకము.)

శ్రీమతే రామానుజాయనమః.

# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## పూర్వభాగము (ముప్పది గుచ్ఛములు)


గ్రంథకర్త:

అనంతపురంజిల్లా తాడిపత్రి పురవాసి,

శ్రీమాన్ బుక్కపట్టణాం నరసింహాచార్యులు.





మొదటికూర్పు 500 ప్రతులు.

తాడిపత్రి భద్రావతి ముద్రాక్షరశాలయందు

ముద్రితము—1947





వెల రు 4-0-0

(తపాలాఖర్చు ప్రత్యేకము.)

శ్రీమతే రామానుజాయనమః.

అస్మద్గురుభ్యోనమః.

# పీఠిక.

భగవద్భాగవతాచార్య విశేష కటాక్ష ప్రసాదమువను, పరమవైదిక సిద్ధాంతావలంబకులగు భక్తులలో కొందఱి ప్రోత్సాహమువను "శ్రీ రామానుజ ప్రభావకల్పక" మను నీ గ్రంథమును యథాశక్తి రచించి ముముక్షువులగు పాఠకమహాశయుల కర్పించు భాగ్యము నేటికబ్బినది.

చ॥ "అలసులు, మందబుద్ధిబలు, లల్పతరాయువులుగ్రరోగ సంకలితులు మందభాగ్యలు సుకర్మము లెవ్వియుజేయ జాలరీ కలియుగమందు మానవులు" అని శౌనకాది మహర్షుల యభిప్రాయమును దెల్పు శ్రీమదాంధ్ర భాగవతరత్న ప్రకాశము, యిందు కాదర్శప్రాయులలో నన్నుగూడ నొకనిగ దెలుపుచుండుట నెఱుంగుదును. అయినను నీ లోకమున జన్మించినందుకు శ్రీ రామానుజ ముఖోల్లాసముగ నుడుతభక్తిచే కైంకర్యలేశమైన నొనర్పకున్న భగవన్నిగ్రహమునకే గురియగుదుననుభీతిచే నఱువదియైదు గుచ్ఛములు గల నీ గ్రంథమును రచించితిని. పరమభాగవతులచే రచింపబడిన గ్రంథములమధ్య నీ గ్రంథమంతగ ప్రకాశింపదనుటకు సందియములేదుగాని నూటయిరువది సంవత్సరములీ కలియుగమున వెలసి పరమవైదిక సిద్ధాంత రహస్యము లెన్నియో నుపనిషత్పయఃపారావారమునుండి యెత్తి యజ్ఞానాంధకార నిమగ్నులగు జీవులకొసంగి యుజ్జీవింపజేసిన పవిత్ర విఖ్యాత పురుషులగు శ్రీమద్రామానుజ యతీంద్రుల జీవితచరిత్రను సాంధ్రదేశమున నాబాల వృద్ధులు చదివి ధన్యులగునటుల నవలపద్ధతిని రచించి యథోచితముగనైన

శ్రీమతే రామానుజాయనమః.

అస్మద్గురుభ్యోనమః

# పీఠిక.

భగవద్భాగవతాచార్య విశేష కటాక్ష ప్రసరణమువలనను, పరమవైదిక సిద్ధాంతావలంబకులగు భక్తులలో కొందఱి ప్రోత్సాహమువలను "శ్రీ రామానుజ ప్రభావకల్పక" మను నీ గ్రంథమును యథాశక్తి రచించి ముముక్షువులగు పాఠకమహాశయుల కర్పించు భాగ్యము నేటికబ్బినది.

చ॥ "అలసులు, మందబుద్ధిబలు, లల్పతరాయువులుగ్రరోగ సంకలితులు మందభాగ్యలు సుకర్మము లెవ్వియుజేయ జాలరీ కలియుగమందు మానవులు" అని శౌనకాది మహర్షుల యభిప్రాయమును దెల్పు శ్రీమదాంధ్ర భాగవతరత్న ప్రకాశము, యిందు కాదర్శప్రాయులలో నన్నుగూడ నొకనిగ దెలుపుచుండుట నెఱుంగుదును. అయినను నీ లోకమున జన్మించినందుకు శ్రీ రామానుజ ముఖోల్లాసముగ నుడుతభక్తిచే కైంకర్యలేశమైన నొనర్పకున్న భగవన్నిగ్రహమునకే గుఱియగుదునను భీతిచే నఱువదియైదు గుచ్ఛములు గల నీ గ్రంథమును రచించితిని. పరమభాగవతులచే రచింపబడిన గ్రంథములమధ్య నీ గ్రంథమంతగ ప్రకాశింపదనుటకు సందియములేదుగాని నూటయిరువది సంవత్సరములీ కలియుగమున వెలసి పరమవైదిక సిద్ధాంత రహస్యము లెన్నియో నుపనిషత్పయఃపారావారమునుండి యెత్తి యజ్ఞానాంధకార నిమగ్నులగు జీవులకొసంగి యుజ్జీవింపజేసిన పవిత్ర విఖ్యాత పురుషులగు శ్రీమద్రామానుజ యతీంద్రుల జీవితచరిత్రము నాంధ్రదేశమున నాబాల వృద్ధులు చదివి ధన్యులగునటుల నవలపద్ధతిని రచించి యథోచితముగనైన

శ్రీమతే రామానుజాయనమః.

# ఉపోద్ఘాతము.

శ్రీ భగవద్రామానుజాచార్యులు మనదేశమందు వేదమార్గమునకై మహాదర్శనములను స్థాపించిన అగ్రగణ్య మహాపురుషులలో నొక్కరు. ఉపనిషత్తులు, గీత, బ్రహ్మసూత్రములు అను ప్రస్థానత్రయమునకు వారు చేసిన వ్యాఖ్య ప్రదేశములలో పలువురు మహామహుల యంగీకార ప్రశంసలను బడసినవి. సర్వశేషియైన శ్రీ పరమాత్మునికి శేషభూతులగు నిత్యసూరులలో పరమైకాంతికుడగు ఆదిశేషుని యవతారముగా శ్రీవైష్ణవులా మహానుభావుని భావించి పూజించుచున్నారు. తుదకు భగవన్నామముకూడ స్మరింప నక్కరలేదని, 'రామానుజ' అను చతురక్షరి యొకటే ముక్తిసాధనము చాలునని, భావించి యాచరించువారుకూడ శ్రీవైష్ణవులలో లేకపోలేదు.

అట్టివారి చరిత్రకు తగినంత వ్యాప్తి తెలుగు దేశములో కలుగలేదు. కారణము స్పష్టమే. వారు తమ జీవితమంతయు ఇంచుమించు ద్రవిడ దేశమునందే గడపినవారు. అద్వైతమతము సంప్రదాయులందును, శైవమతము సామ్రాజ్యములందును, ఎక్కువ ప్రబలముగా శ్రీరామానుజుల కాలమందును తరువాత చాలకాలమున తెలుగుదేశములో వ్యాప్తిలో నుండినవి. సుమారు పదునాలుగవ శతాబ్ది తరువాతనే విజయనగర రాజుల యాశ్రయము చేత విశిష్టాద్వైత దర్శనమునకు ఆంధ్రదేశములో కొంత కాలూనెను. అది గూడ అంతదృఢమైనది కాలేదు. ఆంధ్రదేశమున నెలకొన్న శ్రీవైష్ణవ

బ్రాహ్మణులలో; అనేకులు ఆచార్యపురుష నిర్వహణమునకై వచ్చిన అరవ వారు. మతప్రచారముకంటె మడిమాన్యములమీద ఎక్కువ దృష్టిగలవారు. తెలుగుభాషయందు వారికి శక్తి రక్తి రెండును సున్న. ఇక శ్రీ రామానుజ చరిత్రమునకు సంబంధించిన విషయములన్నియు సంస్కృతభాషలోను అంతకంటె ఎక్కువగా తమిళభాషలోను కలవు కాన ఇతరులకవి అంతగా అందుబాటులో లేవు. కాబట్టియే శ్రీ రామానుజుల చరిత్రమున తెలుగు వారి పరిచయము మితమైనది.

ఇంకొకటి: ఎవరిదైనను చరిత్రమని వ్రాసినచో అందు జనసామాన్యమున కౌతుకములగు విచిత్రవిషయము లెక్కువగా లేకుండెనేని చరిత్ర కారునికి వేగముగిట్టదు. శ్రీ రామానుజ జీవితమందు అట్టి వింతలు చాల తక్కువ. ఇతరమతముల 'పవాడపురుషుల'తో పోల్చిచూచితిమేని వీరి జీవితమున ఆశ్చర్యపడవలసిన విశేషసన్నివేశాలు ఏవియు లేవనే చెప్పవచ్చును. ఇక్కడ మనకు కానవచ్చునదెల్ల శ్రీ రామానుజుల అసాధారణ భగవద్భక్తి, స్వాచార్యప్రతిపత్తి, శిష్యవాత్సల్యము, లోకకల్యాణ కాంక్ష ఇత్యాదులే. కాన చరిత్రను కథగా చదివి సంతోషింపదలచెడు వారికి విచాలవు.

ఇట్టి శ్రీ చరిత్రమునకు ఇప్పుడు ఎక్కువ ప్రచారముచేయ బ్రయత్నించినారీ గ్రంథకర్తగారు. వీరు శ్రీ రామానుజుల మేనమామగారగు శ్రీ పెద్దతిరుమల నంబిగారి వంశపరంపరలోనివారు. అనూచానముగా వచ్చిన అచార్యపుంస్త్వము ననుభవించుచున్నవారు. సంస్కృతాంధ్ర సాహిత్యములందు మంచిపరిచయముగలవారు. జ్యోతిశ్శాస్త్రమందు నిష్ణాతులు. ఆంగ్లవిద్యాసంస్కారము చక్కగా గలవారు. ముఖ్యముగా శ్రీ రామానుజ సిద్ధాంతమును సంప్రదాయమును ప్రచారము చేయుటయందు ఎక్కువ శ్రద్ధావ్యవసాయములు గలవారు; ఆర్ద్రహృదయముతో తామనుభవించువారు. వీరీ గ్రంథమువ్రాయ దొరకొనుట చాల శ్లాఘాగ్రమైన విషయము.

దీనిని వీరు చరిత్రదృష్టితో పరిశోధించి వ్రాయలేదు. మఱిచదువరులకు రుచిగా భోగ్యముగా నుండవలెనను తలంపుతో కావ్యధారలో రచించినారు. గ్రంథమాద్యంతమును ఒకకథవలె చదివి యనుభవింప వచ్చును. మహాపురుషుల జీవితమును చూడవలసిన దృష్టి ముఖ్యముగా ఇదే. ఎట్టి మహాపరాయణమునకై వారు జీవించిరో, ఎన్నికష్టము లెదుర్కొని దానిని సాధించిరో, ఎట్లు ప్రచారమునకు తెచ్చిరో తెలిసికొని, మననముచేసి, మన విజీతమందు దాని నాచరణలో యథాశక్తిగా పెట్టుకొనుటకు దారిచూపుట ఇట్టి గ్రంథముల ముఖ్యఫలము. కనుక (౧) యాదవ ప్రకాశులవద్ద శిష్యవృత్తి చేయునపుడు గోవిందుఁడును రామానుజునివలె గృహస్థుగా నుండెనా లేక బ్రహ్మచారియా? (౨) రామానుజుల కాశీయాత్రకు పూర్వమా తరువాతనా బ్రహ్మరాక్షసుని విడిపించినకథ? (౩) తిరుమలనంబి కాళహస్తిలో గోవిందునిముందు తాటాకులో వ్రాసి పడవేసినశ్లోకము 'స్వాభావికానవధికాతిశయేశితృత్వం' అనునదియా, లేక 'కః శ్రీః శ్రియః' అనునదియూ? (౪) తిరుక్కచ్చినంబి వైశ్యుడా లేకచతుర్థవర్ణుఁడా?—ఇత్యాది చారిత్రిక శంకలు ఈగ్రంథము చదువువారలు వేసికొనరాదు. ఆ వ్యాసంగరీతి వేఱు. ఆదృష్టితో పరిశోధకులితరు లెవరైనను చేయవలసినపని శ్రీ రామానుజ చరిత్రలో అగాధముగాఁ గలదు.

ఇప్పటికి శ్రీ రామానుజుల విషయమున చదువరులకు హార్దమైన భక్తి గౌరవములును వారి సిద్ధాంతమున ప్రతిపత్తియుఁ గలిగించుటకు ఈగ్రంథము చాలనుపకారమనుటకు సందేహము లేదు.

ఈ గ్రంథకర్తగారితో నాకుఁగల సన్నిహిత బంధుత్వము, అంత కన్న ఎక్కువగామైత్రి, దానిని మించి విషయమందును రచనాశైలియందును

నేననుభవించిన సంతోషము— వీనికి చిలుకొనుక ఈ తొలిపలుకు దీనిని ఇంతకన్న పెంచఁబనిలేదుగదా!

ఇట్లు,

మైసూరు
సర్వజిత్తు కార్తిక శుక్ల పంచమి

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ.



శ్రీమతే రామానుజాయనమః

# పండితాభిప్రాయము.

నేను గద్వాలపురమునుండి ఒకానొక శుభకార్యార్థమై బయలుదేరి భగవత్ప్రేరితుడనై తాడిపత్రి గ్రామమునదిగి శ్రీమాన్ బుక్కపట్టణం నరసింహాచార్యులవారిని చూచితిని. వారు తాము రచించిన శ్రీ రామానుజ ప్రభావకల్పక మను గ్రంథమున కొన్ని గుచ్ఛములు నాకు వినిపించిరి వాటిని నేను వినునపుడు అందలి పదలాలిత్యము, శబ్దసౌష్ఠవము, భావగాంభీర్యమునకు తోడు తత్కథా సన్నివేశమంతయు నాభావనలో నచ్చొత్తినట్లు గానవచ్చి అత్యంతానందము గావించినది. భగవద్రామానుజ ప్రభావమును చాటుగ్రంథములలో ఆంధ్రవాఙ్మయమున అరువది అయిదు గుచ్ఛములు గల ఇంత గొప్ప గ్రంథము ఇదివరకు వెలువడినట్లు నాయనుభవమున లేదు. నవల వ్రాయుపద్ధతిలో ఆధునిక పాఠకమహాశయులకు రుచించునట్లు ఆధ్యాత్మిక చరిత్రవ్రాసి ముముక్షువుల కర్పించిన నా మిత్రులగు వీరిని మరికొన్ని ఇట్టిగ్రంథములువ్రాసి లోకము నుజ్జీవింపజేయ శ్రియఃపతి ప్రేరేపించుగాక.

ఇట్లు,

**పుల్లగుమ్మి శ్రీనివాసాచార్యులు.**

ఆస్థానవిద్వాన్ గద్వాల సంస్థానము.

22-12-46

# విషయసూచిక.

—o—

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## మొదటిగుచ్ఛము.

శ్లో॥ జయతు జయతు దేవోదేవకీ నందనోయం।
జయతు జయతు కృష్ణోవృష్ణి వంశప్రదీపః।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో।
జయతు జయతు పృధ్వీభారనాశో ముకుందః॥
హే గోపాలక హే కృపాజలనిధే హేసింధుకన్యాపతే।
హే కంసాంతక హే గజేంద్రకరుణాపారీణ హేమాధవ।
హే రామానుజ హే జయత్రయగురో హేపుండరీకాక్షమాం।
హే గోపీజనవాథ పాలయపరం జానామి నత్వాంవినా॥

క॥ పలికెడిది భాగవతమట।
పలికించెడివాడు రామభద్రుండట।
తాపలికిన భవహరమగునట।
పలికెద వేరొండుగాథ పలుకగనేలా॥

పాఠకమహాశయులారా! పరమపవిత్రమగు శ్రీ ఆకాశ గంగాదివ్యతోయమును శ్రీ శ్రీనివాస తిరుమంజన తిరువారాధనాది నిత్యకైంకర్యములకై గొనివచ్చుచుండెడి యా వృద్ధవైష్ణవ శిఖామణిని మనోభావమున దర్శించి కృతార్థులుగండు. "నహ్యమ్మయానితీర్థాని నదేవాశ్శిలామృణ్మయానిచ। తే పునంత్యు రుకాలేన

దర్శనా దేవసాధవః॥" (నాచే నిర్మింపబడిన పుణ్యతీర్థములును, మృచ్ఛిలామయ నిగ్రహములును నేనందు అంతర్యామినై యుండుటచే భక్తులునమ్మి పూజించినను, సేవించినను బహు కాలమునకు కృతార్థులగునట్లు చేయఁగలవు. సాధుదర్శన మన్నచో తోడ్తో కృతార్థులంచేయగలదు.) అను భావముగల శ్రీసూక్తి గలదు. గాన మహాభాగవత దర్శనలాభము బడయుటకు ఇంతకన్నను తరుణము మరల లభించునో లభింపదో తెలియదు గాన ఇప్పుడే మనసార సేవింపుడు. వీరు దాదాపు ఎనుబది సంవత్సరముల వయస్సుగలవారయ్యు ఇరువది సంవత్సరముల యువకునివలె నతిత్వరితముగ నా పర్వత సోపానము లెట్లు దిగివచ్చుచున్నారో గనుడు. పసినిమ్మపండువంటి వీరిదేహ చ్ఛాయకు వీరు ధరించిన ద్వాదశోర్ధ్వపుండ్ర తులసీనళినాక్షమా లలు మరింత వన్నెబెట్టు చున్నవిగదా! హృద్గత సాత్వికతాస్తిక తాదులు వెలికి ప్రకాశింపఁజేయు వీరి సుప్రసన్నానన మత్యంత వర్ణనీయముగదా! వీరి శిరమున ఆకాశగంగా పూరిత రజిత కలశము బాలార్కుని దివ్యకిరణములచే నెట్లు విరాజిల్లుచున్నదో చూడుఁడు. ఆ కలశములోని తీర్థ మించుకైనను ఈ ప్రపన్న శిఖామణి శీఘ్రగమనముచే చలింపకుండు టాశ్చర్యముగదా! తీర్థము చలింపకుండునట్లు మంత్రముచే నిరోధించుచున్నారో యనునట్లు వీరెద్దియో స్తోత్రము పఠించుచు తిరుమంజన కాల మతిక్రమించునేమోయను శంకచే శీఘ్రముగ నడక సాగించు చున్నారు. "కంజాక్షలీలలు కాంతారముల నైన భక్తియుక్తంబుగ

పాదవలయు"నను నియమము వీరియెడ మిక్కిలి సార్థకమగు చున్నది. కాని వీరు పఠించు యా స్తోత్రమెందులోనిది? ఎందులో నిదియుఁగాదు. శ్రీ ఆళవందారను బిరుదు నామముగల వీరి యాచార్యులగు శ్రీ యామునాచార్యులవారి దివ్యహృదయ పేటి కలోనిదే. సర్వచేతనో జ్జీవనార్థము స్వాచార్యులచే రచింపఁబడిన స్తోత్రములను తదీయులు పఠించుట స్వరూపానురూపమేగదా. వీరీకైంకర్య నిర్వహణ సమయమున నత్యంత శ్రద్ధాభక్తులతో నీ స్తోత్రము ననుదినమును పఠించు వాఁడుక. అశేషప్రపన్నులు ననుదినంబును పఠించి ధన్యులుగాఁదగిన విశేషాంశము లీ స్తోత్ర మునం దిమిడియుండుటచేతనే నిది స్తోత్రరత్నమని శిష్టులచే కొనియాడఁబడుచున్నది. వీరీతరుణమున "స్వాభావికానవధికాతి శయేశి తృత్వం నారాయణత్వయి నమృష్యతివైదికః కః। బ్రహ్మ శివశ్శత మఖఃపర మస్వరాడిత్యేతే పియస్యమహిమార్ణవ విప్రు షస్తే॥" అను శ్లోకమును పఠించుచున్నారు. వీరు దీనిని ద్విరుక్తిగ పఠింపనేల? ద్విరుక్తిగ పఠించుటకు అనిర్వచనీయానందావహమగు విశేషభావములు ఇందిమిడియున్నందుననే. చేతనాచేతన విశిష్ట సమస్త ప్రపంచమున కాధారాధేయ భూతుడవగునో స్వామీ! శ్రీ నారాయణానువాక ప్రతిపాద్యమైన నీయందు స్వభావసిద్ధమై యపరిచ్ఛేద్యమై సర్వాధికమైన సర్వేశ్వరత్వమును నేవైదికుఁడు సహింపఁడు? బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలగు త్రిగుణాత్మక మిశ్రసత్త్వ ప్రకృతిలోని వారును ముక్తులు నిత్యులు మున్నగు త్రిగుణాతీత శుద్ధసత్త్వ ప్రకృతి

లోని వారును నీ మహిమార్ణవమున బిందువులే, అని దీని భావము. ఆస్తిక జనహృత్క్షేత్రమున సుస్థిరముగ వరిపరిథమ మున నాటఁదగిన దీపరత్వ బీజమేగదా. శ్రీ భాగవతమున శ్రీ బ్రహ్మనారద సంవాదముననేమి, శ్రీ విష్ణుపురాణమున శ్రీ పరా శర మైత్రేయ సంవాదముననేమి, శ్రీమద్రామాయణమున శ్రీ నారదవాల్మీకి సంవాదముననేమి, శ్రీ మహాభారతమున శ్రీ భీష్మ యుధిష్ఠిర సంవాదముననేమి ఈ పరత్త్వ బీజమేగదా యా యా మహర్షులు తమతమ శిష్యహృక్షేత్రముల నాటియున్నారు. ఇట్టి వాసుదేవ పరత్వజ్ఞానము ఈ కలియుగమున నానాఁటికి క్షీణించు చున్నదిగదా. సర్వలోకహితైషులగు మహర్షులవలెనె వాసుదేవ పరత్వమును వెల్లిడిపరచి లోకమునుద్ధరింపఁగల మహాపురుషుడీ కలియుగముననను అవతరించిన నెంత యానందదాయకమో యను విమలాశయమే వీరి నీశ్లోకమును ద్విరుక్తిగ పఠింపఁజేసినది యని మనము మున్ముందు గ్రహింపఁగలము. వీరిట్లు పఠించుచు ఆ నగరాజము దిగివచ్చునప్పటి కొక గజరాజము సర్వాలంకార శోభితమై యూర్ధ్వ పుండ్రాంకిత ఫాలభాగమై వీరి నెదుర్కొనెను. గజరాజము ముందును, వెనుకను, ఇరుపార్శ్వములను జనులు క్రిక్కిరిసి నడచుచుండిరి. పురోభాగమున శంఖకాహళభేరీ మృదంగాది మంగళవాద్యముల యొక్కయు, దివ్యప్రబంధ పారాయణముల యొక్కయు. వెనుకభాగమున చతుర్వేద స్తోత్ర పారాయణముల యొక్కయు ధ్వని మిన్నుముట్టుచుండెను. అటులాభద్ర గజము తీర్థము గొనివచ్చుచుండు మన ప్రపన్న

శిఖామణిని సమీపించి మావటి సంజ్ఞచే పరిణామ సూచకముగ తొండము పైకెత్తి యరచి కూర్చుండెను. చుట్టు మూగియుండు జనులు శ్రీ ఉభయవేదాంత ప్రవర్తక పితామహేత్యాది శ్రీ శ్రీనివాసోక్త సుప్రసిద్ధ బిరుదాంకిత శ్రీ శ్రీ తిరుమలనంబిగారికి జైయని వీరి పరిభావమును చాటుచు పరిణామముల నర్పించిరి. మంగళసూచకముగ శంఖకాహళము లూదబడెను. తిరుమల నంబిగారును గజమునకు ప్రదక్షిణ మొనర్చి తీర్థకలశమును గజమస్తకమున కుదురుగా నునిచి యొక ప్రసూనదామమును కలశమునకుఁజుట్టి యఖిల భాగవతులముందు అంజలి బద్ధులై నిలచుండిరి. కూర్చుండి యుండిన భద్రగజము మావటి సంజ్ఞచే నిలిచి గమ్యస్థానమున కభిముఖమయ్యెను. పరిచారకులలో నొక రా కుంభికుంభస్థల నిహిత తీర్థకలశమునకు సమంత్రిక ముగ హారతి సమర్పించిన వెనుక భేరీమృదంగాది వాద్యముల తోను, అఖిలభాగవతస్తోత్ర పాఠములతోను ఆ మత్తమాతంగము గంభీరముగ నడక సాగించుచుండెను. పాఠకమహాశయులారా! సర్వాలంకార శోభితమై నడచుచుండు ఆ గజరాజమువంక తదేక దృష్టిచే నెందరో యాశ్చర్యానంద నిమగ్నచిత్తులై చూచుచుం డుటను గమనించితిరా? అహా, ఇభరాజా! ఈ శుక్రవారమున శ్రీ శ్రీనివాస తిరుమంజ నార్థమై నిజమస్తకన్య స్తాకాశగంగా పవిత్ర జలపూరిత రజత కలశమును ధరించు కైంకర్య భాగ్యమును లభించి యెంత ధన్యుడవైతివి! నాలవమనుకాలమున నీజాతిలో జనించిన గజరాజు తాను భగవత్సాయుజ్యము

నొందుటయేగాక భగవత్కైంకర్యమగు నీ జన్మస్వత్వము పారం పర్యముగ ననుభవింప అశ్రియఃపతి విశేషానుగ్రహము మీకు సంపాదించి యిచ్చెకాఁబోలు. పరోపకార పారీణతకు జాతిమత భేదము లెక్కడివి? "పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్ర యాః। తేనైవతే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్॥" పశువుగాని పక్షిగాని మనుజుఁడుగాని భగవద్భాశ్రయణ సంబంధ మాత్రముననే విష్ణుదివ్యపదమును లభించునను భావముగల ఈ శ్రీసూక్తి నీయెడ సఫలమయ్యెకదా! ఇందుకొరకే శ్రీకులశేఖ రాళ్వార్లు భగత్సాన్నిధ్యముగల తిర్యగ్జంతువుల జన్మమైనను చాలుననిరి. శ్రీఆళవందారులు భగవద్దాస్యము ననుభవించు వారిండ్లలో కీటకజన్మము లభించినను తరింపవచ్చునుగాని ఇతర స్థలముల చతుర్ముఖపదవి లభించినను నేనొల్లననిరి. ఇట్లా యిభరాజమునకు లభించిన కైంకర్య భాగ్యమును ప్రశంసించు చుండువారును ధన్యులే. ఆ భద్రగజము లోకోత్తర వైభవముతో శ్రీ శ్రీనివాసక్షేత్రమును సమీపించి తిరువీధులగుండ ప్రదక్షిణ మొనరింపసాగెను. ఏనుగువెంట యాత్రికులు, క్షేత్రవాసులు, పీరు వారననేల ఆ బాలగోపాలము క్రిక్కిరసి నడుచుచుండిరి. ఇభరాజము సన్నిధి మహాద్వారమునొద్ద నిలిచి మావటి సంజ్ఞచే తొండముసాచి నమస్కరించి కూర్చుండెను. పరిచారకు లలో నొకరు తీర్థకలశమునకు హారతి సమర్పించి శ్రీ శ్రీ తిరుమల నంబిగారి నుచితరీతిని సత్కరించిరి. శ్రీ శ్రీ తిరుమల నంబి గారును తీర్థకలశమునెత్తి శిరమున ధరించుకొని భాగవతగోష్ఠి

తోడను, మంగళవాద్యములతోడను మంత్రరత్నాను సంధాన పూర్వకముగ శ్రీ ఆనందనిలయ దివ్యవిమానమునకు ప్రదక్షిణ మొనర్చి సన్నిధి గర్భాలయములోనికి విచ్చేసి కలశము నుచిత స్థలమున నునిచి శ్రీ శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహ మును అంజలి బద్ధులై ఆ పాదమస్తకము సేవించుకొనుచుండిరి. జీయంగార్లు, భాగవతులు, ఆచార్యపురుషులు, మహంతు భక్తులు తక్కుంగల కోవెల యధికారులు తిరుమంజన మహోత్సవము సేవించుటకై భగవత్సన్నిధిలో చేరిరి. లోకోత్తర వైభవముతో తిరుమంజనోత్సవము జరిగినది. అనంతరము శ్రీ శ్రీ తిరుమల నంబి మున్నగు భాగవతోత్తములకును కోవెల అధికారులకును తక్కిన భక్తులకును తీర్థశఠగోప ప్రసాదాద్యుచిత సత్కారములు జరిగినవి. అపుడు శ్రీ శ్రియఃపతి యర్చకముఖముగ శ్రీ శ్రీ తిరుమల నంబిగారితో "పితామహా! నీవు నాకు నేడుదయమున శ్రీ ఆకాశగంగాతోయము కొని వచ్చుతరి స్తోత్రరత్నములోని యొక శ్లోకమును ద్విరుక్తిగా ననుసంధించుచు నా పరత్వమును చాటు మహాపురుషుని యవతారమునకై యాశపడితివిగదా. ఇట్టి నీ విమలాశయము సఫలముచేయ నేనిదివరకే సంకల్పించుకొని యుండి నీ పెద్ద తోడబుట్టువగు కాంతిమతీదేవి గర్భమున ప్రకృష్ట విజ్ఞాన బలైకధాముడని సుప్రసిద్ధిగాంచిన నా యర్ధాంశమగు అనంతుని భూతపురిని జనింప నాజ్ఞనొసంగితిని. నిన్ననే యార్ద్రా నక్షత్ర కటకలగ్నమున నతఁడు భూతపురి నవతరించెను. నీవు నేఁడే భూతపురి కరుగుము. పురిటిదినములు గడచి పుణ్యాహము

ముగియగనే ఆ బాలునకు శ్రీపాదరేణువు మేననలది రామానుఁజుడని దాస్యనామమునుంచి చెవిని మంత్రరత్నముపదేశించి మున్ముందు శ్రీ బోధాయన మతోద్ధారకుఁడగునట్లు మంగళాశాసనము చేసిరమ్మ" అని యాజ్ఞాపించిరి. తమ పెద్దతోఁబుట్టువు గర్భవతియై నవమాసములు నిండవచ్చినదని యిదివరకే విని యుండినందున శ్రీ తిరుమలనంబిగారు శ్రీ శ్రీనివాస శ్రీసూక్తులు కర్ణానందముఁగొల్ప "దయానిధే సర్వాంతర్యామియును, సత్య సంకల్పుఁడవు నగు నీయాజ్ఞ శిరసావహించెదను. సనాతన భాగవత సంప్రదాయము నానాఁటికి క్షీణదశ నొందునట్లు చేయుట కలియుగ స్వభావముగదా! బౌద్ధచార్వాక మాయావాద శైవ శాక్తేయాది బాహ్యకుదృష్టి లీలామతములు ఆసేతు శీతాచలము వ్యాపించి జనుల నజ్ఞానాన్యథా జ్ఞానవిపరీతజ్ఞాన భూయిష్ఠులనుగా జేయుచున్నవి. వీరీమతము లవలంబించి యతినిందిత కర్మము లాచరించి నీనిగ్రహమునకు పాత్రులై తుదకు నిరయంబునం బడుచుండు టేమి యాశ్చర్యము? కాని యాశ్రితా నాశ్రిత విమర్శను పాటింపక కృపాజలధివగు నీవిదివరకే నిత్యసూరుల నిందవతరింపఁజేసి వేదమువలె త్రైవర్ణికులు మాత్రమే పఠింప నర్హమగునట్లుగాక సర్వవర్ణములవారును పఠింపనధికారముతో ద్రావిడ వేదమును వారిగుండ నెలకొల్పితివి. శ్రద్ధాభక్తులతో సాంతముగ పఠించువారికి తక్షణమే ముక్తికరతలామలకమగునటులు ఆ ద్రావిడ వేదమునకొక యపూర్వాత్యద్భుత మాహాత్మ్యమును గల్పించితివి. దేహాత్మభ్రమగల సంసారులకు పరలోక సుఖము

లిఁతకన్నను నెంతయో యధికమైనవని నమ్మికపుట్ట చెప్పినను ఈ పాకృత దేహము విడువవలెనన్న ప్రాణసంకటముగదా. ఆ కారణముననే ద్రావిడ ప్రబంధ తాళపత్రములను తామస రాజసులు శ్రీ తామ్రపర్ణీ ప్రవాహము లోఁబడవైచి ధన్యమ్మన్యులైరి. శ్రీనివాసా! యుగాంతరముల వేనవేలు దివ్యవర్షంబులు తపంబొనర్చినను లభింపని నీ దివ్యసాన్నిధ్యము ఈ కలి యుగమున నిరాయాసముగ నతి శీఘ్రముగ జాతిమత వయో వృత్తిభేదము లించుకైనలేక సర్వులు లభింప నీవు సంకల్పించి యుండ నీ యాజ్ఞాతిక్రమణం బొనరించి తా మొల్లకున్నమానె ముక్తి నపేక్షించు వారికైనను అది లభింపకుండ ఇట్టి అసహ్యాపచారము గావించిన వీరిని "పద్మకోటిశతేనాపి నక్షమామి వసుంధరే" యను నీ శ్రీసూక్తి సార్థకపరుప శిక్షింతువుగదా! ఇట్లుఖిలమైన ద్రావిడ వేదమును సకల నైగమిక తత్త్వము హస్తామలకమువలె నుండు పరమాచార్యులగు శ్రీ నాథమునుల మూలమున పునరుద్ధారణ మొనర్చుటచే తనివినొందక యీ పరమ వైదికసిద్ధాంతము ఆసేతుశీతాచలపర్యంతము వ్యాపింప చేయఁగల నిత్యసూరి నిర్వాహకుడగు శ్రీ మదనంతమూర్తిని శ్రీ భూతపురి నవతరింప నాజ్ఞాపించితి నంటివి. ప్రభూ! నీ నితాంతాపార భూతదయ నింతింతయని కొనియాడ నేరి తరము" అని యిట్లు మృదు మధురాలాపముల శ్రియఃపతిని కొనియాడుచు "కదాపునశ్శంఖ రథాంగ కల్పక ధ్వజారవిందాంకుశ వజ్రలాంఛనమ్। త్రివిక్రమ త్వచ్చరణాంబుజ ద్వయం మదీయ మూర్ధానమలంకరిష్యతి"

అనగా (వసిష్ఠ చండాల విభాగములేక అందరి శిరములందు శంఖచక్రకల్ప కధ్వజార విందాది లాంఛనయుతమగు మీపా దారవింద యుగళము నుంచిన నో త్రివిక్రమా! ఇట్టి దివ్య లాంఛనయుత శ్రీ పాదయుగళముచే నురల నింక నెన్నడు దాసుని శిరమలంకరింపఁబడి కృతార్థుడనగు భాగ్యమెప్పుడో) అని పునః పునః ప్రణామము లర్పించుచు శ్రీ శ్రీనివాస సస్మిత ముఖచంద్రి కల నాస్వాదించుచు తమ దృక్చకోరములను మరలించిరి. శ్రీ శ్రీ తిరుమల నంబిగారు సన్నిధినుండి వేంచేసిన వెనుక నింతవరకు జరిగిన సంభాషణ వీనులార వినుచుండిన వారందరు శ్రియఃపతి వాత్సల్య సౌశీల్యకారుణ్యాది కల్యాణగుణ సమృద్ధికిని, కలిదోష నివారణకై యవతరించిన శ్రీ మదనంతమూర్తి యీలోకమున గూడ లభింపనున్న కైంకర్య సమృద్ధికిని, అట్టి యవతారమూర్తి జన్మస్థలమగు భూతపురినిగల భాగవతుల నింతింతయనఁజాలని యదృష్టసమృద్ధికిని అమందానంద మానసులై మున్ముందు రానున్న శుభవార్తలకై యువ్విళ్ళూరుచుండిరి. ఆనాటి సాయం కాలమునకే శ్రీ శ్రీనివాస సన్నిధానమున జరిగిన దివ్యసంభాష ణాంశములన్నియు దిగువ తిరుపతి, చిరుతానూరు మున్నగు సమీప గ్రామములకుప్రాకి అత్యంతా మోదము గావించెను.

శ్లో॥ పితామహస్యాపి పితామహాయ ప్రాచేతసాదేశ ఫలప్రదాయ।
శ్రీభాష్యకారోత్తమ దేశికాయ శ్రీశైల పూర్ణాయ నమోనమస్తాత్॥

మొదటి గుచ్ఛము సమాప్తము.

---

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## రెండవ గుచ్ఛము.

---

శ్లో॥ కల్యబ్దే దివ్యకుంభే బుధజనవిదితే వత్సరే పింగళాఖ్యే చైత్రేమాసే
గతేవత్రియుగ దశదినే దీప్యమానే హిమాంశౌ। పంచమ్యామార్ద్రాసమేతే
మరగురుదివసేకర్కటాఖ్యేచలగ్నే శ్రీమాన్ రామానుజార్యస్సమజని
నిగమాంతార్థ సంరక్షణార్థమ్॥

శ్లో॥ యథావతారాన్మధురా మురారేః రామస్యసాకేతపురీచయద్వత్।
తథాయతీంద్రస్య కృపాశ్రయస్య పుణ్యోత్తరా భూతపురీబభూవ॥

శ్రీకృష్ణావతారమున మధురానగరమును, శ్రీరామావతారమున నయోధ్యానగరమును పుణ్యతమక్షేత్రములై విరాజిల్లిన చందమున కలియుగమున శ్రీ పింగళనామ సంవత్సరమున చైత్ర శుద్ధ పంచమీ గురువాసరయుత ఆర్ద్రానక్షత్రమున కర్కాటక లగ్నమున (1017) నవతరించిన శ్రీ మదనంతమూర్తి మహిమాతిశయముచే శ్రీ భూతపురియు నభూతపూర్వ సుప్రసిద్ధిగల పుణ్యతమక్షేత్రమై విరాజిల్లెను. ఈ భూతపురికే శ్రీ పెరుంబూదూరను నామాంతరము. ఇదివరకే భగవంతుని సుదర్శనాంశతో

సర్వచేతనో. జ్జీవనార్థ మవతరించి మహాదేవునిచే భక్తిసారులని బిరుదనామముగాంచిన శ్రీ తిరుమణిశయాళ్వార్ల యవతారముచే ప్రసిద్ధినొందిన మహీసారక్షేత్రములోనిదీ భూతపురి. శ్రీ శ్రీ వీరరాఘవ క్షేత్రమగు తిరువళ్లూరునకు రమారమి పదునైదుమైళ్ల దూరమున నీ క్షేత్రమున్నది. ధూమశకట మార్గముగాకున్నను యాత్రికుల ప్రయాణమునకు వలసినన్ని మార్గవసతులీ కాలమున నున్నవి. ఈ గ్రామమున నిదివరకే శ్రీ శ్రీ ఆదికేశవస్వామివారి యాలయము మొకటియుండుటచే శ్రీ శ్రీ వీరరాఘవదర్శన కాంక్షులై వచ్చిన యాత్రికులలో పలువు రీక్షేత్రమును దర్శించువాదుక. పరమకారుణ్యమూర్తియైన శ్రీ అనంతమూర్తి కవతారస్థానమగు నీ పుణ్యక్షేత్రముయొక్క ప్రాశస్త్యమును, ఆయన ఇందే అవతరించుటకు హేతువునుతెల్పుట యుక్తముగదా.

శ్రీ కైలాసాధిపతియగు శంకరు డొకనాడు దిగంబరుడై నాట్యంబు జేయుచుండుటనుగని ఆయన నాశ్రయించుకొనియున్న భూతగణంబులు లోలోన పరిహాస మొనర్చుకొనుచుండ రుద్రుం డదిగని వారిపై కినుకబూని మీరికనా సన్నిధినుండ నర్హులుగారు. మీ రధోలోకంబున బడియుండుడని శపించి నట్లును భూతములపుడు శ్రీ శంకర శాపంబునకు వెరచి శ్రీ చతుర్ముఖుని పాలి కరిగి మ్రొక్కి దైన్యమున వృత్తాంతమంతయు విన్నవించుకొని యెటులనైన శాపవిమోచనోపాయంబు దెల్ప ప్రార్థించినట్లును శ్రీ విరించియు ఇంచుక యోచించి వారియెడ జాలిగొని "మీరు భూలోకంబున నరుణారణ్యమున శ్రీ శ్రీ యఃపతినిగూర్చి తపం

బొనర్చిన మీకు శీఘ్రముగ శాపవిమోచనంబగునని పలికినట్లును, వారును శ్రీ విరించి వాక్యముల ప్రోత్సాహముగొల్ప యాయనకు నమస్కరించి యాజ్ఞకొని నరుణారణ్యంబున నొక పవిత్రస్థలం బున శ్రీ శ్రీమన్నారాయణుని గూర్చి తపంబుసల్ప ఆ దయా మయుడు బ్రహ్మేంద్ర గంగాధరాది దేవతలు పరివేష్టింప గరుడ వాహనరూఢుడై వారికి దర్శనంబొసంగి వారివలన పలువిధంబుల స్తుతింపబడి వలయు వరంబువేడుమన శ్రీ శంకరునియెడ తాము గావించిన యపచారంబును అందుకాయన నిగ్రహమున తాము శాపగ్రస్థులగుటయుదెల్పి శాపవిమోచనంబును యెప్పటియటుల శ్రీ శంకర సాన్నిధ్యంబు లభింప ననుగ్రహింపుమని వేడినట్లును, శ్రీ శ్రియఃపతి శ్రీ శంకరునిగని "భూతగణంబులు ప్రమాద వశంబున గావించిన స్వల్పాపచారంబును సరకుగొనక సైరించి నీ కొలువున జేర్చుకొమ్మని బల్కిన శ్రీ శంకరుడు భగవదాజ్ఞ సిరసావహించి భూతముల నెప్పటియటుల తనకొలువున జేర్చు కొనుట కంగీకరించినట్లును, ఆపుడ శ్రీ శ్రియఃపతి శ్రీ యనంతుని గని నేడు నీ భూతగణంబులకు నేను ప్రత్యక్షంబై ప్రసన్నుడనై శాపవిమోచనంబొనర్చిన నిచ్చోటు కలకాల మెల్లరు స్మరించి తరింప నిర్మల జలపూరిత సరోవరంబొకటి నిర్మింప నాజ్ఞయొ సంగి, భూతగణంబునుగని ఇచ్చట మీరొక పురవరంబును, అందు నా యాలయంబును నిర్మింపుడని యాజ్ఞాపించి, శ్రీ శంక రునిగని భక్తరక్షణార్థము భూతగణంబులచే నిర్మింపబడు నాల యమున నే నర్చామూర్తినై యుండుదు ప్రతి వత్సరమునను

నియమిత కాలమున భక్తులు జరుపబోవు నుత్సవంబునకు నీపి భూతగణంబుతో విచ్చేసి నన్ను దర్శించుచుండుమని యాజ్ఞాపించి యంతర్ధానంబు నొందినట్లును భగవదాజ్ఞమేరకు శ్రీ అనంతునిచే నిర్మింపబడిన నిర్మల రమ్యసరోవరమునకు అనంత పుష్కరిణి యనియు, భూతగణంబుచే నిర్మితమగు పురంబునకు భూతపురి యనియు నాటినుండి నామంబేర్పడినట్లును శ్రీ యగస్త్యమహర్షికి శ్రీ కుమారస్వామి యొకానొక సందర్భమున వాక్రుచ్చినటుల ప్రాచీన పురాణకథలవలన నీ క్షేత్ర తీర్థ మహాత్మ్యములు తెలియ వచ్చుచున్నవి. ఈ యనంత పుష్కరిణి మహాత్మ్య మింకను వినవలయునని యగస్త్యులువేడ శ్రీ కుమారస్వామి మరికొన్ని యమూల్యాంశములు దెల్పి నటుల దెలియవచ్చుచున్నది.

అవి యెవ్వియన పూర్వకాలమున నొకప్పుడు శ్రీ హారీతుండను నృపవరేణ్యుడు ధర్మమార్గమున ప్రజాపాలనంబొనర్చుచు అరణ్యంబునంగల దుష్టమృగంబుల సంహరింప నొకనాడు వేటకరిగినట్లును భీకరారణ్యమున పులినోటబడనున్న నొకగోవును రక్షింపబూని నిశితనారాచముల నా వ్యాఘ్రముపై బరప నవ్వ్యాఘ్రం బాగ్రహించి నుమడింప గోవునుజంపి తానును బాణముచేయ నువులంబాసినట్లును, గోవును పులిబారినుండి రక్షింపజాలనందుకు ఆ భూకాంతుడు దురంత చింతాక్రాంతుండై స్వపురోహితుండగు శ్రీ వసిష్ఠమహర్షిని బిలిపించుకొని ఆయన నుచితరీతి సంప్రీతుం గావించి అరణ్యమున యాకస్మికముగ పులివాతబడిన గోవును కన్నులారగనియు గోవును రక్షించుటలో విధివశంబున విఫల

మనోరథుండ నైతిగాన ఈ పాపంబు తొలంగ నుపాయం బెయ్యది యైన దెల్పుడని యమ్మహర్షిని ప్రార్థించినట్లును, త్రికాలజ్ఞుడగు నమ్మహర్షికి భావికాలగతులు యోగదృష్టిచే కరతలామలకంబుకాగా రాజా ! నీ వింతమాత్రమునకు చింతిల్లనేల, అరుణారణ్యంబున భూతపురియను నొక దివ్యక్షేత్రమును, అనంతపుష్కరిణియను నొక రమ్యసరోవరంబును గలవు. నీ వచ్చటి కరిగి అమల ప్రభావయుతమగు నా పుష్కరిణినిగుర్యించి యా దివ్యక్షేత్రమున వెలయు నర్చామూర్తి యగు శ్రీ శ్రీ యాదికేశవస్వామి ననుదినం బును శ్రద్ధాభక్తులతోనర్చించుచురాగా శీఘ్రంబున శ్రీహరి నీయెడ సుప్రసన్నుడై నిన్నుపునీతుం జేయుటేగాక మున్ముందా దయా మయుని యనుగ్రహంబున విశేషఫలంబు వడయుదువు. జాగు సేయక నీ వందరిగి నేను జెప్పిన చొప్పున నియమబద్ధుండవై శ్రీహరిని పూజింపుమని ప్రోత్సహించినట్లును, నృపవరేణ్యుడును ఋషివరేణ్యునకు మ్రొక్కి యాశీర్వాదము వడసి నరుణానర ణ్యంబునగల భూతపురికరిగి, శ్రీ యనంతసరోవరంబున నను దినంబును సుస్నాతుండై శ్రీ శ్రీ ఆదికేశవస్వామి నర్చించు చుండ నొకనాడు శ్రీహరి సుప్రసన్నుడై "రాజా నీవు నన్నా రాధించిన కతంబున సకల పాపవిముక్తుడ వైతివి. బ్రహ్మర్షివై ధన్యతం గాంచితివి." బ్రహ్మన్ కలియుగే ప్రాప్తే ధర్మేనష్టేఖ్రీతిరితే । మద్భక్త స్సర్వధర్మజ్ఞః తపగోత్ర సముద్భవః । శారీరక మహాభాష్య గ్రంధకర్తా జితేంద్రియః। తస్యసంబంధినశ్శిష్యాః సురాణామపిదుర్లభం। మామప్రాప్యైవతే

సర్వేగమిష్యతి పరాంగతిం॥ ఓబ్రహ్మర్షీ కలియుగమున ధర్మము నష్టముకాగా సకలధర్మంబుల నెరింగినవాడును జితేంద్రియుడును నగు నా భక్తుడొకడు నీ గోత్రంబున జన్మించును. అతడు బ్రహ్మ సూత్రములకు భాష్యమును రచించును. అతని సంబంధులగు శిష్యులు నన్ను ప్రత్యేకముగ నారాధింపవలసిన నిమిత్తములేకనే దేవతలకు నైతము దుర్లభమగు పరమపదంబు లభింపగలదు. అని వాక్రుచ్చి యంతర్థానంబు నొందినట్లు యభివర్ణింపబడియుండు కథయొకటియు, సుకేతుండను రాజు పూర్వకాలమున పాండ్యదేశ మేలుచుండి చోళరాజ పుత్రికల నేద్దురిని పెండ్లాడియు యెంత కాలంబునకును సంతానంబు వడయనేరక సంతాపంబునొంది శ్రీ గోకర్ణక్షేత్రంబున కరిగి అందు శ్రీశంకరునిగూర్చి తపంబొనర్చి నట్లును, ఆయన యీ నృపవరేణ్యునకు ప్రత్యక్షంబై యాతని తపంబునకు కారణంబరసి "రాజా నీభార్య లేద్దురు పూర్వజన్మంబున నూర్వశి మున్నగు దేవకాంతలు. వారొక సరోవరంబున కరుగ అందు సంతానార్థమై గజరూపమున మునిదంపతులు జల కేళి సలుపుచుండుటను గనిరి. మరుక్షణమే గజరూపమున నున్న మునిపత్ని లజ్జచే గట్టుచేరెను. జలకేళికి విఘ్నమొనర్చిన దేవ కాంతలపై మునీశ్వరుడు కినుకబూని మీరు భూలోకమునబుట్టి సంతానహీనులై యుందురుగాకయని శపించెను. ఆ దేవకాంతలే నీభార్యలు. వారికి ఋషిశాపవశంబునగల్గినచేటుచే నీకు సంతానము గలుగదయ్యె. నీవిపుడరుణారణ్యమునకు నీ సతీమణులతో నరిగి అందుండు భూతపురియను దివ్యక్షేత్రమునగల పరమపవిత్ర జల

పూరితంబగు అనంత సరోవరంబను పుష్కరిణి స్నానమొనర్చి అనుదినంబును అం దర్చామూర్తియైవెలయుచుండు శ్రీ ఆదికేశవ మూర్తి నర్చించుచుండిన ఆ దయామయుని యనుగ్రహము లభించి సంతానంబు వడయుదువు అని పల్కి యంతర్ధానంబు నొందినట్లును శ్రీ సుకేతుండు శ్రీ శంకరుడు వాక్రుచ్చినటుల నొనర్చి శ్రీ భూతపురి కేశవానుగ్రహమున సంతానము వడసి నట్లును, నభివర్ణింపబడుకథ మరొకటియును నైయున్నవి. ఇందుకు మరొక నిదర్శనముగ భూతేశ్వరాలయ మొకటి నీ భూత పురిని బ్రతిష్ఠింపబడి యున్నది. శ్రీ తొండమాౙ చక్రవర్తి యను భక్తశిఖామణి శ్రీ శ్రీ ఆదికేశవస్వామివారికి, బహు ప్రాచీనములగుటచే అచ్చటచ్చట చాలా శిథిలములై యుండిన మండపగోపుర ప్రాకారములు నిర్మించుతరి నాస్థానమండపమునకు దగిన చతుస్థంభములు లభింపక ప్రభువు చింతాక్రాంతుడయ్యెను. భక్తజనకల్ప ద్రుమమగు భగవంతుడొకనాటిరాత్రి రాజు స్వప్న మున నగపడి ఈ గ్రామమునకు పడమరనున్న పెద్దచెరువులో నీవుకోరిన స్థంభములున్నవని తెల్పెను. చక్రవర్తి యుదయమున మేల్కాంచి స్వప్నము మేరకు చెరువునొద్దకు భృత్యామాత్యులతో నరిగి పరిశోధింప స్థంభము లగపడినవిగాని అవి యతిస్థూలముగ నత్యున్నతముగ నుండుటచే గొనివచ్చుట కష్టసాధ్యముగనుండెను. అత్తరి భూతేశ్వరుడు చక్రవర్తి స్వప్నమున నగపడి స్వీయభటు లగు భూతంబులతో స్థంభములు తానే తెప్పించెదననిబల్కి బూతములనుగని చెరువుననున్న చతుస్థంభంబులను గొనివచ్చి

మీరందావహించి భగవద్దర్శనంబు జేసికొనుచుండుడని యాజ్ఞా పించెను. కాన ప్రభువు తలపెట్టిన దివ్యకైంకర్యము భగవదను గ్రహమున నిరాయాసముగ నెరవేరినది. ముఖమండమునందలి స్థంభము లిప్పటికిని గంభీరాకారముతో చూచువారల కాశ్చర్యము గొల్పుచుండును. భూతపురి చతురశ్రమ విశాలవీధులుగల యం దమైన నగరము. చతుర్వీధులందును సన్నిధి వీధులందును వరుసలుదీరి యున్నతముగ బెరిగిన నారికేళ వృక్షరాజములతోను, నగరముచుట్టు నేత్రానందము గావించు పచ్చని వరిపైరుతోను, నానా పుష్పఫలభరితములై దివ్యపరిమళమును వెదజల్లు రమ్యో ద్యానములతోను, ఉద్యానవనముల మధ్యమున నచ్చటచ్చట నిర్మింపబడిన నిర్మలజలపూరిత రమ్యకాసారములతోను, నలరారు చున్నది. సన్నిధి వెనుకనుండు పుష్కరిణియే నిదివరకు పురాణకథలలో వభివర్ణింపబడినదని దెల్పిన యనంత పుష్కరిణి శ్రీ మదనంతమూర్తి కృపారసమే ఇందులోని తీర్థమని భక్తులచే మిక్కలి కొనయాడబడుచుండు నదీపుష్కరిణి. ఇందొకవత్సరము నియమముగ స్నానమొనర్చినవారు ఎట్టి మొండిరోగములనుండి యైన విముక్తులై ఇహపరముల దప్పక సుఖింతురు. శ్రీ అనంత మూర్తి ఈ భూతపురిలోనే జన్మింపగలడని శ్రీ బ్రహ్మాండ పురాణములోని నీ క్రింది శ్లోకమువలన దెలియవచ్చుచున్నది. ఇది శ్రియఃపతి శ్రీసూక్తి.

శ్లో॥ మన్నియోగాద్భూత పుర్యామహీనా మీశ్వరఃకలా ।
శ్రీ రామానుజరూపేణ జనిష్యతి సతాంముదే ।

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదన తత్పరః ।
భాష్యం నిర్మాతి వేదాంత సూత్రాణామపితత్వవిత్ ॥

"నాయాజ్ఞచే పన్నగేంద్రుడగు ఆదిశేషుడు కలియుగమున భూతపురిని శ్రీ రామానుజనామమున నవతరించును. శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించుటలో నాసక్తిగలవాడు కాగలడు. ఆయన ఆస్తికుల కానందము గూర్పగలడు. వ్యాసరచిత వేదాంత సూత్రములకు భాష్యమును రచించును అని పై శ్లోకాభిప్రాయము. ఇట్టి మహిమగల ఆదిశేషుల యవతార స్థానమగు భూతపురిలోని యనంత పుష్కరిణి చుట్టును ఉభయ వేదాంత పారంగతులగు భాగవతుల మందిరములున్నవి. శ్రీ మదనంతమూర్తి యవతారానంతరము తత్పదాశ్రితులలో నెందరో యందు జేరుకొని కోవెల నెంతయో యభివృద్ధికిఁ దెచ్చిరి. శ్రీ పెరుంబూమారునందుగల భూసురులేగాక తదితర వర్ణములవారును భాగవత సంప్రదాయమునకుఁ జేరినవారే. వీరు భగవద్బోధాయన సంప్రదాయకులనియు, శ్రీవైష్ణవులనియు, విశిష్టాద్వైతులనియు పిలువబడువారు. ఆ కాలమున భూసుర పండితులలో శ్రీ ఆసూరికేశవాచార్యులవారు ద్రావిడ సంస్కృత వేదాధ్యయనమునందేమి తర్కవ్యాకరణ వేదాంతాదిశాస్త్ర విద్యలందేమి అసమానపాన పాండిత్యము గడించినవారు. వీరు భగవత్ప్రీతిగ బహుక్రతువు లొనర్చి దీక్షితులని వ్యవహరింపబడు చుండెడివారు. శాంతశమదమాది కల్యాణగుణ సంపత్తియు జ్ఞానభక్తి వైరాగ్యాద్యాధ్యాత్మిక సంపత్తియుఁగల మన కేశవా

చార్యుల వారియెడ ప్రేమగౌరవములు చూపని వారాయూర గాన రారు. వీరి భార్య శ్రీ కాంతిమతీదేవియు అనవరతపతి శుశ్రూషా పరాయణయగు పరమసాధ్వి ఈ కాంతిమతీదేవియే శ్రీ శ్రీనివాస క్షేత్రవాసులగు శ్రీ శ్రీ తిరుమల నంబిగారి పెద్దతోడబుట్టువని మనకిదివరకు తెలిసిన విషయమేగదా. ఈ పవిత్రదంపతులయ పార భగవద్భక్తియే శ్రీ మదనంతమూర్తిని శ్రీ వైకుంఠము నుండి ఇందవతరింపజేసినది. శ్రీకేశవాచార్యులవారికి చిరకాలము సంతానములేక శ్రీ కైరవిణీతీరస్థ శ్రీ పార్థసారథిస్వామివారి విశేషానుగ్రముచే కలియుగమున కలి కలుషంబులఁబాసి జనుల నుత్తీర్ణులఁజేయ శ్రీ ఆదిశేషులను పుత్రులుగా వడసి ధన్యులైరి. పుత్రోదయమైన వెనుక శ్రీ కేశవదీక్షితులవారు బావమఱదియగు శ్రీ శ్రీ తిరుమల నంబిగారికీ శుభవర్తమానము తెలియ పఱచిరి. శుభలేఖ శ్రీ తిరుమల జేరుటయు నంబిగారు శ్రీ పెరుంబూదూరు చేరుటయు నేక కాలముననే తటస్థించినది. ఇప్పటివలె నుత్తర ప్రత్యుత్తరములు శీఘ్రముగ నందు సదుపాయములులేవు. తగు వారిని వెదకి లేఖవ్రాసి వారివెంట పంపవలసియుండును. లేఖఁ గొనిపోవు వారికి తగు మార్గవసతులులేని యా కాలమున లేఖ సకాలమునకు చేరునను నమ్మక మెక్కడిది. ఐనను దైవకటాక్షము ప్రసరించిన వారికే యాటంకములు నుండవుగదా. శ్రీ శ్రీ తిరుమల నంబిగారికీ శుభవార్త యిదివరకే సాక్షాద్భగవన్ముఖముగానే తెలిసి యుండినందున శ్రీ శ్రీనివాసుని యాజ్ఞ చొప్పున సకాలమునకే వీరు భూతపురికి వేంచేయుచున్నారు. భగవధ్యాన

పరాయణులగు వీరికి దారిలో నెన్నియో శుభశకునము లగపడు
టచే నమందానంద మానసులై యేమేమియో లోలోన దలపోయుచు
నడక సాగించుచున్నారు. తగు మార్గవసతులులేని యాకాలమున
కొండలు, వాగులుగల భీకరారణ్యములు కేవల మాటవికులకును
సింహశార్దూలాది దుష్టమృగములకును శరణ్యమై యుండెను.
అంబుజోదరు దివ్యపాదారవింద మధుపాయిత మానసులకు
దైవమే తోడ్పడునను నమ్మకము, ధైర్యము, మార్గాయాసమును
కెడమివ్వక గమనోత్సాహమును పురికొల్పుచుండును గదా.
పూర్వము శ్రీ రామానుజదర్శన కాంక్షియైన శ్రీ యక్రూరునకున్న
రధసౌకర్యము వీరికి లేకున్నను మనోరధము లుభయులకును
సమానమే. మార్గమధ్యమున శుభశకునములను గనినపుడు.

మ॥ "అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రబోద్ధామమై
జలజాక్షంబయి కర్ణకుండల విరాజద్గండమైయున్న యాజల
జాతాక్షు మొగంబు చూడగలుగుఁ సత్యంబు పోనేడు నావల
దిక్కేగుచునున్న వీవన మృగవ్రాతంబులీ త్రోవలన్" అని

యనుకొనుచు గోపగోపీపరివృత యామునతీరస్థ బృందావనము
కరుగుచుండు నక్రూరులు వారు అటులనే అను సంధించుకొనుచు
భగవద్భాగవత పరివృతానంత పుష్కరిణీతీరస్థ సాధుబృందావన
మున కరుగు నక్రూరులు వీరు. సంకల్పహయః సంయుక్త
మనోరధులై కంసారి సంకల్పము నెరవేర్ప మాపటివేళకు గమ్య
స్థానము చేరుకొనిరి. శ్రీ కేశవదీక్షితులును శ్రీ శ్రీ తిరుమల
నంబిగారిని గాంచినతోడనే యా దయామయుడగు శ్రీ శ్రీవిహా

మునిగని నటులానందాంబుధి మగ్నులై పాదప్రక్షాళనాది సకల సత్కారములు గావించిరి. పరస్పర స్వరూపానురూప భగవద్భాగవత ప్రశంసాపూర్వక కుశలప్రశ్నలతో ముచ్చటించు కొనుచుండగా దీక్షితులవారి ధర్మపత్ని యన్నగారి రాకకలరి యధోచిత సత్కారములే మరక నడుపునటుల భర్తకు విన్నవించు కొనెను. దీక్షితులవారు భాగవత కైంకర్య నిమగ్నులై యుండ శిశువును జూడవచ్చిన వారందరు నద్భుతావహమగు నొక దివ్య తేజము శిశువు ఆకారమున బొడగట్టుచుండుటంగని. యాశ్చర్య నిమగ్నమానసులగుచుండిరి. పసినిమ్మపండువంటి దేహచ్ఛా యయు నాకర్ణాంత విశాలనేత్ర యుగ్మమును, శ్రీకారములను బోలిన కర్ణయుగళమును గంభీర విశాల ఫాలభాగమును వెడద యురమును నాజానుబాహు యుగళమును, నత్యంత మార్దవ కోమల శుభరేఖాంకిత పాదపల్లవములును నెన్నిమారులు చూచి నను తనివినొందకుండ జేయుచుండెను. బాలార్కుని మించిన దివ్యతేజోమయ మందహాస సుందర వదనారవిందము నెట్టి విర క్తులనైన ననురక్తులను జేయుచుండెను. దేహసంబంధమణు మాత్రములేని పౌరులే యా శిశువురూప సంపదకచ్చెరువందు చుండ, తోడబుట్టు కొమారుడగుటచే దేహబాంధవ్యమును నిత్య సూరి నిర్వాహకుడగుటచే నాత్మబాంధవ్యమునుగల యా శిశువును మన శ్రీ శ్రీ తిరుమల నంబిగారు కన్నుల కరువుదీర కనుగొన నేల యాసపడరు. లేకలేక చిరకాలమునకు శ్రీ శ్రీనివాస విశే షానుగ్రహముచేఁ బడసిన పుత్రరత్నము నన్నగారికి చూపు

కుతూహలముండుట శ్రీ కాంతిమతీదేవిగారికిని సహజమే. స్నానానంతరము శ్రీ కాంతిమతీదేవి అన్నయ్యా! నీ మేనల్లునిజూచి యాశీర్వదింపుమని శిశువును గొనివచ్చి సూతికాగృహద్వారము కడనుండి పలికిన వెంటనే బావగారితో ముచ్చటించుచుండిన నంబిగారు ఆమెవంక దిరిగి "అమ్మా! యీ నేనును నదేయడుగ దలంచి యుంటిని. నీవే శిశువును గొనివచ్చితివి" అని మందహాసముతో బలికిరి. శ్రీ కాంతిమతీదేవి శిశువు నెత్తికొనివచ్చి సూతికాగృహద్వారముకడ నిలిచి శిశువు నన్నగారికి చూపునపుడా బాలగోపాలమూర్తినిగన్న దేవకీదేవి మోముకన్న మనకాంతిమతీదేవిగారి మోము మందహాసరుచులచే బ్రకాశించుచుండుటంజేసి మిన్నయై యుండెననుటలో నతిశయోక్తి యావంతయులేదు. బాలగోపాలమూర్తికి రూపలావణ్యాదు లుండవచ్చునుగాని మాతమోమున మందహాసరుచు లెక్కడివి? ఏ ముహూర్తమున నా కసుగందనా కంసుడు తుదముట్టించునో యను భయదుఃఖములే యామె కన్నులనుండి యశ్రుకణములచే సాక్ష్యము నొసంగుచుండెను. అట్టి పరిస్థితిగల దేవకీదేవి ప్రాణము లరచేత బట్టుకొనిగదా యుండును. శ్రీ కాంతిమతీదేవికా భయదుఃఖములు లేకుండుటేగాక యన్నగారి నుండి శిశువునకు మంగళాశాసనము లభించునన్న మనోల్లాసము వదనారవిందమునకు వన్నెవెట్టుటచే తన దివ్యనామము సార్థకమగుచుండెను. ఇచట మరియొక వైధర్మ్యమీ రామానుజ ద్వయమున గానవచ్చుచున్నది. ఆ రామానుజుల మేనమామకు శిశువును కనినను వినినను వెలికి

ప్రాణము లెగసిపోవునంత భయము. ఈ రామానుజుల మేన మామకు యెగసిపోవనున్న ప్రాణములు లోనదూరి నంత యానందము వైధర్మ్యముండుచోట సాధర్మ్యముండక పోదుగాని యిది మరియొక సందర్భమున పరిశంసింతము. శ్రీ శ్రీ తిరుమల నంబిగారు శిశువునుగాంచి యనిర్వాచ్యానంద మనుభవించిరి. వారి మనోభావన గ్రహింపగల మహనీయులకు "॥అ॥ మంచివారి కెల్ల మంగళ ప్రదలయ్యు, కల్లరులకు మేలుగాని యట్టి, తనువు లెన్నియైనదాల్చి లోకమునకు నేమమెల్ల ప్రొద్దుఁజేయు నితడు" అని వీరి లక్ష్మణ, బలరామావతారములఁగా దలంచియు,

క॥ ఎరిగినవారల మనుచును, కొరమాలిన యెరుకలెరిగి కొందరు నీపేరెఱిగియుఁ, దలపగనొల్లరు పఱతు రధో గతులజాడ పన్నగనాథా ॥

క॥ నీవారై నీదెస తమభావంబులనిలిపి ఘనులు భయవిర హితులై। యే విఘ్నంబులు జెందక నీవలరెడి మేటిచోట నెగడుదురీశా ॥

క॥ నిను నాలుగాశ్రమంబుల జనములు సేవింప నిఖిలజగ ములు సత్యంబును, శుద్ధంబును, నగుగాత్రంబు నీవు నొం దుదువుగదే ॥

క॥ ధరణీభారము వానెను పురుషోత్తమ ఈశనీదు వుట్టువున। త్వచ్చరణాంబుజముల ప్రాపున పరమాత్ముని కరుణ ప్రాణికోటికి గలుగుఁ ॥ అని

తలపోసి యానందించుచున్నట్లు తోచక మానదు. అన్న

గారి మంగళాశాసనమును వడసిన పుత్రరత్నమును శ్రీ కాంతి మతిదేవి లోనికి గొనిపోయెను. అవ్వల క్రమమున శుద్ధిపుణ్యాహ నామకరణ మహోత్సవములును, భాగవతారాధనయు, యథావిధి జరిగినవి. నామకరణ మహోత్సవ దినమున శ్రీ శ్రీ తిరుమల నంబిగారు శిశువునకు లఘుచక్రాంకనంబొనర్చి, శ్రీ రామానుజు డని (ఇలయాళ్వార్) పేరిడి, శ్రీ పాదరేణువును మేననలది చెవిని ద్వయోచ్చారణంబొనర్చి శ్రీ శ్రీనివాసునియాజ్ఞ తృప్తికర ముగ నెరవేర్చిరి. మంత్రరత్నము లోన ప్రవేశింపగనే పుత్ర రత్న స్వరూపము మాణిక్యబరిణెలోని దివ్యమాణిక్యమువలె తేజరిల్లెను.

శ్లో॥ పుణ్యాంభోజవికాసాయ। పాపధ్వాంతక్షయాయచ।
శ్రీమాన్ ఆవిరభూద్భూమౌ రామానుజ దివాకరః॥
శ్లో॥ వందే వేదాంత కర్పూరచామీ కరకరండకం।
రామానుజార్యామార్యాణాం చూడామణి మహర్నిశం॥

రెండవ గుచ్ఛము—సమాప్తము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## మూ డ వ గు చ్ఛ ము.

శ్రియఃపతి పాదసేవయే ధారక పోషక భోగ్యముగ నుండువాడు గనుకనే శ్రీ గరుత్మంతునకు పెరియ తిరువడియని బిరుదనామమేర్పడినది. ఇంతేగాదు శ్రీ యామునాచార్య స్తోత్ర రత్నమున భగవంతునిఁ గొనియాడు సందర్భమున ఈయన కైంకర్యము విశేషముగ ప్రశంసింపబడియున్నది. అందులోని భావముఁదెలిసికొనిన మనమును తప్పక కృతార్థులమగుదుము. శ్లో॥ దాసస్సఖా వాహనమాసనం ధ్వజోయస్తేవితానం వ్యజనం త్రయీమయః। ఉపస్థితంతేన పురోగరుత్మతాత్వదంఘ్రి సమ్మర్దకిణాంకశోభినా॥ స్వరూపమునుబట్టి జీవులందరు ఉభయ విభూతుల లోను భగవంతునకు దాసులే యనుటకు "దాసభూతాస్స్వ తస్స ర్వేహ్యాత్మనః పరమాత్మనః। నాన్యథాలక్షణం తేషాంబంధే మోక్షేతథైవచ" అను శ్రీసూక్తికద్దు. ఈ సూక్తిదాస్య శ్రద్ధగల వారియెడ సార్థకత నొందును. ఇట్టిదాస్య శ్రద్ధగలవాడు నిత్య

సూరి సత్తములలో జేరిన శ్రీ గరుత్మంతుడు. కనుక స్తోత్రరత్న
ములోని దాసః అను పదమునకు స్వరూపానురూప దాస్యములో
మిక్కిలి శ్రద్ధగలవాడవి భావము. ఇంతేగాక పరమాత్మ
ఉత్పత్తిస్థితిలయము లొనర్చునపుడు యోజనీయాంశములను
తనతోకలసి యోచించునంతటి సఖుడుగాను, ఆశ్రితుల నాపత్కా
లమున రక్షింప భగవంతుడు త్వరపడు నపుడు భక్తుల కడకు
భగవంతువి మనోవేగమువంటి గమనవేగమున గొనిపోగల
వాహనముగను, భక్తుల యభీష్టము సావధానముగ భగవంతుడు
వినవలసినపుడు కూర్చుండుటకు సింహాసనముగను, భక్తపరి
త్రాణ కాలమున దూరమునుండియే భగవంతుడు తమ్మురక్షింప
వచ్చుచున్నాడను ధైర్యోత్సాహము లంకురింపఁజేయ చూపట్టు
ధ్వజముగను, భక్తరక్షణార్థము భగవంతుడరుగునపుడు వర్షాతప
ములు మేనసోకవివ్వని మేలుకట్టుగాను, భక్తరక్షణార్థ మాయన
విచ్చేసి నంతనేగమన శ్రమనివారణార్థ ముపకరించు పక్షములే
చామరములుగ గలిగి కైంకర్య మొనర్చువాడును తన కరతలము
లెప్పుడును శ్రియఃపతి శ్రీ పాదములఒరపిడిచే కాయలుగాచి
అవియే దాస్యచిహ్నములుగ గలవాడును నగుచు భగవత్సన్ని
ధిలో నిత్యదాస్య మొనర్చు చున్నాడని స్తోత్రరత్నములోని పై
శ్లోకమునకు భావము. ఇట్టి కైంకర్య భాగ్యముగల నిత్యసూరి
లోకోజ్జీవనార్థ మిందు పలుమారవతరించి యున్నాడు. యుగాం
తరము నవినతాకశ్యపులకు పుత్రరత్నమై యవతరించి యమృ
తాహరణాద్య సాధారణ కార్యములుచేసి "నమాతుః పరదేవతా"

అను శ్రీసూక్తి కనుగుణముగ మాతృదాస్య విమోచనము గావించి యుండుట శ్రీ మహాభారతము పఠించిన భాగ్యశాలుర కందరకు విదితమే. ఈ కలియుగమునను పాండ్యదేశమున శ్రీ విల్లిపుత్తూరను గ్రామమున భూసురోత్తముడై యవతరించి పాండ్యదేశాధీశుని సభలో పరతత్వ నిర్ణయముగావించి విద్యా శుల్గమును లభించి అశేష విద్వద్బృందముచే గౌరవింపబడెను. అప్పటినుండియే శ్రీ పెరియాళ్వారని నీ దివ్యసూరికి ద్రావిడ బిరుదనామము. లోకోజ్జీవనార్థము ఈయన యానాడు రచించిన ప్రబంధరాజమునే తీరుప్పల్లాండందురు. ఇట్టి మహిమలచే వెలయు శ్రీ గరుత్మంతుడు పరమపద నాథుని పాదములొత్తుచు "ఈ యానందనిలయమున నిన్ని భోగములు మాతో సమానముగ ననుభవింప బాధ్యతగల్గియు యెందరో జీవులు అనాదికర్మ ప్రవాహవేగమున దరిగానక కొట్టుకొని పోవుచుండుటను శ్రియఃపతిగని తాను శ్రీరామకృష్ణాద్యవతారములెత్తి వ్యక్తావ్యక్త చైతన్య విమర్శన నైతము పాటింపక తన యాదృచ్ఛిక కటాక్షమో స్పర్శయో లభించిన బద్ధజీవులను నైతము ముక్తుల గావించెను. ఇంతటితో తృప్తినొందక శ్రీ సుదర్శన పాంచజన్యాది పంచాయుధాంశజులగు కొందరిని నావంటివారిని కొందరిని భూలోకమున నవతరింపజేసి ఎందరో చేతసులను ముక్తుల గావించెను." ఈ విభూతి దివ్యవైభవము లిన్నియని నూహింపనైన సాధ్యముగానంత విరివిగానుండియు అనుభవించువారు మాత్రము ఇంకను చాలా తక్కువగనే యగపడుచున్నారనియు

జీవులు పరిపక్వదశ నొందుటకు కలిప్రాచుర్య మడ్డుదగులుచున్న దనియు వీరిని కలిజారినుండి తప్పించి శీఘ్రముగ నిందుజేర్చి ఈ వైభవముల ననుభవింపచేయ నీ పర్యాయము భూలోకమునకు నిత్యసూరి నిర్వాకుడగు అనంతుని బంపు టుచితమనియు పరిమితిలేని పరోజ్జీవనేచ్ఛచే ఇప్పుడిపుడేకదా శ్రీ ఆదిశేషుని అంశ కొంత భూలోకమున నవరింపజేసిరి. అందవతరించిన శ్రీయనంతునకు చేదోడు వాదోడుగనుండి నియమిత కైంకర్యమొనర్ప బంపుమని వీరిన వేడిన వీరికి మరింత ముఖోలాసముగ నుండక పోదు గదాయని స్వాంతమున తలపోయుచుండెను. ఆసాభిప్రాయస్మిత వికసితంబును, చారుబింబాధరోష్ఠమునుగని యానంద ప్రవాహమున నోలలాడుచుండు శ్రీ భూనీళాదిదేవేరులలో దేవదేవదివ్యమహిషియగు శ్రీ దేవివంక శ్రియఃపతిజూచి గరుత్మంతుని మనోవైఖరి నించుక గమనింపుమని కనుసంజ్ఞజేసెను. అమె యది గమనించి మనంబుననే తన యానందమును బలవంతముగ నిమిడించుకొనెను. శ్రీదేవివలెనే భర్తగారి ఉద్దేశ్యము గుర్తెరిగిన భూనీళలు మాత్రము ఆనందమవ్విధమున మనంబున నిమిడించుకొనక పరస్పరము వ్యక్తావ్యక్తముగ ముచ్చటలాడుకొనజొచ్చిరి. శ్రియఃపతివారి సద్దు భ్రూసంజ్ఞచే వారించుచుండ శ్రీ గరుత్మంతుడు మోముపైకెత్తి శ్రియఃపతి వంకను దేవేరుల వంకనుజూచి లజ్జావనతవదనుదయ్యెను. అపుడు "గరుడా నీ యభిప్రాయమునే గమనించుచునే యుంటిని. ఈ దేవేరులును నీ విమలాశయమును గురించియే విలాసముగ ముచ్చటించుకొను

చున్నారు" అని శ్రియఃపతి యనెను. అపుడు శ్రీ గరుత్మంతుడు లేచి అంజలి ఘటించి "దేవా ! దేవరవారికి తెలియరానిదియు నొకటికలదా. దాసునిగూడ భూలోకమున నవతరింపజేసి మన యనంతునకు చేదోడు వాదోడుగ నుండి కైంకర్య మొనర్ప వియమించిన ధన్యుడనగుదును గదాయని యనుకొనుచు అందులకై దేవరవారిని ప్రార్థింపనుంటిని" యనెను. శ్రియఃపతి యపుడు దేవేరులవంక కటాక్షింప "నాథా శ్రీ గరుత్మంతుని విమలాశయమును, మీవలెనే తనివితీరని చేతనోజ్జీవన తత్పరతయు మిక్కలి యానందింపదగినవియని శ్రీ నీళాదేవియనెను. ఆనందింపదగినదేగాక ప్రశంసింపదగినదని శ్రీ క్షమాదేవి యనెను. ఆనందించి ప్రశంసింపదగినవేగాక ప్రోత్సహింపదగినవియని శ్రీ రమాదేవియనెను. శ్రియఃపతి కపుడు దేవేరుల వాక్యములానందముగొల్ప శ్రీ గరుత్మంతునితో నీ వనంతునకు తోడ్పడుచుండుటేగాక మరికొంత కైంకర్యము లొనర్ప సంకల్పించితిని. నీ వందరిగిన పిదప స్ఫురింపజేదునులెమ్ము అనెను. అపుడు శ్రీ గరుత్మంతుడు ధన్యోస్మియని శ్రీ గరుడధ్వజునకును, శ్రీ భూనీళాదిదేవేరులకును మ్రొక్కి యంజలిబద్ధుడైనిల్వ శ్రియఃపతి "భూలోకమున మనయనంతు డవతరించిన గ్రామమునకు చేరువ మళలమంగళ మను గ్రామమొండుగలదు. అందు కమలనయన బట్టరు, ద్యుతిమతియను ఇరువురు భూసురదంపతులు నన్న నవరతము పూజించుచుండువారు. వారికి నీవు పుత్రుండవై బుట్టి స్వరూపానురూపనియమిత కైంకర్యబొనర్చి ధన్యుడవయ్యె

దవుగాకయని మంగళాశాసనంబొనర్చిరి. ఇవ్విధమున శ్రీ వైకుంఠమున జరిగిన సంభాషణానుసార మచిరకాలముననే శ్రీ దుర్మతి సంవత్సర పుష్యమాసమున పునర్వసుతారయందు శ్రీ కమలనయనభట్టరను భూసురోత్తమునకు ధర్మపత్నియగు శ్రీ ద్యుతిమతీదేవి గర్భశుక్తి నుండి గరుడాంశచే నొక పుత్రరత్న ముదయించెను. వీరి జన్మకాల నిర్ణయమున కొన్ని వికల్పము లేర్పడుచున్నవి. శ్రీ దుర్మతినామ సంవత్సరమును బట్టిచూడ శ్రీ రామానుజాచార్యులవారికన్న వీరు నాల్గు సంవత్సరముల మాత్రమే చిన్నయని యేర్పడుచున్నది. పాశ్చాత్యదృష్ట్యా విమర్శనచేసిన కొందరు భాగవతులు శ్రీమద్రామానుజులవారీ విభూతిలో 1017 ఎ.డి నుండి 1137 ఎ.డి వరకు వేంచేసి యుండిరనియు, వీరు 1024 ఎ.డి నుండి 1129 ఎ.డి వరకు వేంచేసి యుండిరనియు నిర్ణయించియుండిరి. వీరి నిర్ణయమును బట్టి శ్రీ రామానుజావతారమునకు ఏడుసంవత్సరముల కవ్వల వీర వతరించినటుల ఏర్పడుచున్నది. ఇదిగాక నూటఇరువది సంవ త్సరములు శ్రీ రామానుజులీ విభూతిలో వేంచేసి యున్నటులను, నూటఅయిదు సంవత్సరము మాత్ర వీరీ విభూతిలో వేంచేసి యున్నట్లును ఈ నిర్ణయమునుబట్టి యేర్పడినపుడు, శ్రీ రామాను జావతార సమాప్తకాలమునకు వీరుండినటుల ఏర్పడదు. ఉభయ సంప్రదాయగురు పరం పరలోను వీరు శ్రీ రామానుజావతార సమాప్తివరకు ఈ విభూతిలో వేంచేసియున్నట్లే తెల్పియున్నారు. గాన విజ్ఞులీవిషయము విమర్శించి దెల్పిన మున్ముందు పాఠక

మహాశయులకు విజ్ఞాపనంబొనర్చబడును. విజ్ఞులకీ విషయము విమర్శించు కార్యమువదలి మనము మళలమంగళ గ్రామమునకు మనోభావమున నరుగుదమురండు. శ్రీ శ్రీ తిరుమల నంబిగారికి శ్రీ ద్యుతిమతీదేవిగారు చిన్న తోడబుట్టువగుటనుబట్టి ఈమె ప్రసవసమయమునకును వారు విచ్చేసి నామకరణ మహోత్స వము వరకును ఇందేయుండి శిశువునకు నామకరణ మహోత్సవ దినంబున లఘుచక్రాంకనంబొనర్చి శ్రీపాదరేణువు మేననలది తమ ఇష్టదైవమగు శ్రీ గోవిందుని పేర దాస్యనామంబొనర్చి యాశీర్వదించిరి. అహా! శ్రీ వైంతనిత్యసూర్యంశజులు భాగినే యులుగా వెలసిన మన శ్రీ శైలపూర్ణుల భాగ్యమే భాగ్యము. నాటి నుండి వీరికి గోవింద మిశ్రులను నామము సుప్రసిద్ధము. శ్రీ రామానుజ గోవింద మిశ్రులు ఈ ఉభయ దివ్యదేశ వుత్సవకాల ములలో కలసి ముచ్చటించు కొనుచు పోవుచుండినపుడు మహేం ద్రవరుణోపములని కొందరు. శ్రీ రామలక్ష్మణ సదృశులని కొందరు. శ్రీ రామకృష్ణ సదృశులని కొందరు యనుకొని యానం దించుచుండెడివారు. రూప. గుణ. సంపదలలో పై వీరటువంటి వారే యనుటకు సందియములేదు. వీరి తండ్రిగారు తాము నేర్చిన విద్యనంతయు వీరిరువురికి అయిదవఏటనుండి గరపుచు వచ్చిరి. వీరివురి మేధాశక్తి యసదృశము చదివిన పాఠము మరల పర్లవేయ నక్కరలేకుండ విద్యగడించుచు వచ్చిరి. ఇరువురు బాలురకు గర్భాష్టమముననే ఉపనయన సంస్కారము బ్రహ్మోపదేశము యథావిధి జరిగిన వెనుక వీరిరువురు తమ

తమ తండ్రిగారివద్ద వేదవేదాంతశాస్త్ర సాహిత్యాది విద్యలభ్య
సించుచుండిరి. శ్రీ గోవిందమిశ్రులకు తమ యన్నగారగు శ్రీ
రామానుజులవారియెడ ప్రేమగౌరవములు మెండు. శ్రీ రామానుజు
లును శ్రీ గోవిందమిశ్రులను మళలమంగళము నుండి పలు
మారు పిలుసుకొని ప్రేమతో ముచ్చటించుచుండెడివారు. శ్రీ
రామానుజులవారికి తర్క వ్యాకరక వేదాంతాదిశాస్త్ర రుచి మెండు
శ్రీ గోవిందమిశ్రులవారికి వేదవేదాంగములయెడ మిక్కిలి అభి
రుచి. ఇందుకు వారిరువురికిని వారివారి అనాదిపూర్వవాసనా
బలమే కారణము. ఏలయన శ్రీ గరుడాంశచే నవతరించిన
వారగుటచే ఒకరు (శ్రీ గోవిందులు) వేదమయులైరి. శ్రీ శేషాం
శచే అవతరించిన మరియొకరు (రామానుజులు) వేదవేద్యు
లైరి. ఇట్లు అన్యోన్యప్రేమ విశ్వాసములతో పెరుగుచురాగా
శ్రీ రామానుజులకు పదునారు సంవత్సరములు కాగానే శ్రీ కేశవా
చార్యులవారు తమ కొమారులకు రూపలావణ్యాదులచే నలరారుచు
అభిజాత్యవంశమునకు చేరిన వధువునుగొనివచ్చి అతివైభమున
ఉద్వాహమొనరించిరి. గృహస్థాశ్రమము స్వీకరించియు విద్యా
భ్యాసమును విరమింప నిష్టములేకుండుట శ్రీ రామానుజులయెడఁ
గానవచ్చెను. అపవర్గసాధకమగు వేదాంత విద్యాభిరుచి త్రైవర్గిక
భోగాభిరుచి నెంతయో మించియుండుటను పుత్రునియెడ శ్రీ
కేశవాచార్యులవారు గమనించి ఆకాలమున అఖిలవేదాంత విద్యా
నిలయమను విఖ్యాతిగాంచిన శ్రీ కాంచీపురిని విద్యనభ్యసింప
కుమారునంపిరి. పరమ వైదికమతమునకున్ను బాహ్య, కుదృష్టి

లిలామతములకున్నగల భేదము బాగా విమర్శించుకొనవలయు
నను ఆసక్తి ఇదివరకే శ్రీ రామానుజులవారి కంకురించియున్నం
దున నాకాలమున అద్వైత విద్వాంసులలో మిన్నయని యెన్నిక
గన్న యాదవ ప్రకాశకులను నొక యేకదండి సన్యాసివద్ద విద్యా
భ్యాసముజేయ నిశ్చయించుకొని శ్రీ కాంచీపురిలోని శ్రీ శ్రీ వరద
రాజస్వామివారి యాలయమునకు ఫలపుష్పాది పూజాద్రవ్యము
లతో నరిగి పుణ్యకోటి విమానమున వెలయు భగవద్దివ్యమంగళ
విగ్రహమునుగని పులకీకృతగాత్రులై కన్నుల కఱవుదీర
దర్శించి ప్రణామము లర్పించి "సీ॥ సకలాత్మకర్తవై సర్వని
యంతవై తనరెడి నీకు వందనముదేవ। విశ్వశరీరివై విశ్వ
ప్రభుండవై వెలయు నీకంజలి విశ్వగర్భ। సర్వభోక్తృత్వంబు,
సర్వశేషిత్వంబు గలుగు నీకు ప్రణామమలఘుచరిత। పూర్ణుఁడ
వౌచు విభూతిద్వయేశుండవౌ నీకు దేవజోహారొనర్తు గీ॥ ధర్మివౌ
నీకు చేమోడ్పు దైత్యజైత్రి। లోకరక్షక గుణపాత్రి లోకనేత్రి।
వేయిశిరములు నేత్రముల్ వేయు నన్నిపాదములుగల్గు నీకు నే
ప్రణుతిఁ జేతు॥" గీ॥ విశ్వహేతువులై చాలవెలయు. పంచవింశతి
సమాఖ్యతత్వముల్ విమలభూషణాస్త్రములుగాగదాల్తు వాద్యంత
శూన్య। హరిపరాత్పర పరమాత్మ పరమపురుష॥ గీ॥ స్వామి
శ్రీ దేవరాజ ప్రసన్నుఁడవగు। సకల లోకాధినాధ ప్రసన్నుఁ
డవగు। సత్ప్రపన్న నివాస ప్రసన్నుఁడవగు నీ పదంబులె నా
మదినిలుపువాడ (భార్గపురాణము) యను భావమున భగవత్ప్రభా
వమును నుతించుచు రమారమణునకు పూజాద్రవ్యము లర్పించి,

ఆరాధనానంతరము అర్చకు లొసంగు తీర్థశఠకోప. ప్రసాదములు స్వీకరించి. భగవదాజ్ఞగొని యాదవ ప్రకాశకులయొద్ద కరిగిరి. యాదవప్రకాశకులు శిష్యుల కప్పుడపుడె పాఠముల నుపక్రమింప నుండిరి. శ్రీ రామానుజులువారినిగవి వినయవిధేయులై అంజలి జోడించుకొనినిల్వ యాదవ ప్రకాశులు వారిని కూర్చుండ నియమించి అందరుదెంచిన కారణమడిగిరి. శ్రీ రామానుజులును "స్వామీ నాది భూతపురి. అందు శ్రీ ఆసూరికేశవాచార్యులవారి పుత్రుడను. తమవద్ద విద్యనభ్యసింప మా తండ్రిగారు బంపిరి. కావున తమ శిష్యసంఘములో నన్నొకనిగ ననుగ్రహించి విద్య గరపుడు" అని ప్రార్థించిరి. అపుడు యాదవ ప్రకాశకులు ఇతః పూర్వము వీరు తండ్రిగారివద్ద నేర్చిన శాస్త్రసాహిత్యాది గ్రంధములలోని కొన్ని అంశములు పరీక్షించి వారిచ్చు సమాధానములకమందానంద మానసులై ఇట్టి శిష్యరత్నమును యాదృచ్ఛికముగ లభించినందులకు లోలోన సంతసించుచు నిరభ్యంతరముగ విద్య నభ్యసింపవచ్చునని బలికిరి. శ్రీ రామానుజులానాడు మొదలు నిర్విచారముగ విద్యాభ్యాసము చేయుచుండిరి. ఇట్లు కొంతకాలము గడవ శ్రీ గోవిందమిశ్రులును, తామును శ్రీ కాంచీపురిని విద్యనభ్యసింపగోరి తలిదండ్రుల యాజ్ఞవడసి వచ్చేసి అన్నగారికి గృహకృత్యములలో తోడ్పడుచూ యాదవ ప్రకాశకులకడ వినయవిధేయతలతో మెలంగుచు విద్య నభ్యసింప జొచ్చిరి. ఇట్లు మరికొంతకాలము గడవ శ్రీ రామానుజుల వారికి పితృయోగము తటస్థించుటఁజేసి భూతపురి కరుగవలసి

వచ్చెను. భూతపురిలోనున్న బంధుజనులు ఇక ఇంటివద్దనే గృహస్థాశ్రమ ధర్మములు నెరవేర్చుకొనుచుండుమని శ్రీ రామానుజులవారి కెంతయో బోధించిరిగాని వారికి విద్యాభ్యాసరుచి మెండుగా నుండుటచే వారందు కియ్యకొనక తమ పట్టువదలక కుటుంబమునుకూడ వెంటగొని మరల శ్రీ కాంచీపురి కరిగి అందు స్థిరనివాస మేర్పరచుకొని విద్య నెప్పటివలె నభ్యసింప జొచ్చిరి. "ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై। యారంభించి పరిత్యజింతురిల విఘ్నాయత్తులై మధ్యముల్। ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచు౯ ధృత్యున్నతోత్సాహులై, ప్రారబ్ధార్థము లుజ్జగింపరుగదా ప్రజ్ఞానిధుల్ గావునన్॥ అను న్యాయము మన శ్రీ రామానుజులయెడ మిక్కిలి సార్థకమైనది. శ్రీ గోవిందమిశ్రుల కీలాటి గృహచ్ఛిద్రము లెవ్వియు లేవికతనను, అవి వాహితులగుటనుబట్టియు అన్నగారివద్దనేచేరి వారికి సకల కార్యములందును తోడ్పడుచుండిరి శ్రీ రామానుజులకు (శ్రీ భరతులకు) శ్రీ సౌమిత్రి (శ్రీ శత్రుఘ్నులు) వలె అనువర్తించు వీరినిగని పెక్కుమంది ఆశ్చర్యానంద విమగ్న మానసులగుచుండిరి.

శ్లో॥ పుష్యేపునర్వసూ జాతం వందే గోవింద దేశికం।
రామానుజ పదామ్భోజద్వంద్వ ప్రవణమానసం॥

మూడవ గుచ్ఛము—సమాప్తము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## నాల్గవ గుచ్ఛము.

యాదవ ప్రకాశకులు సాహిత్యశాస్త్ర విద్యలందేగాక మంత్రశాస్త్రమునందును ఆరితేరినవారు ఎట్టి మంత్రవేత్తలకును లొంగక జనుల నామరణాంతము బాధపెట్టు భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షసులు యాదవ ప్రకాశకు లొక్కతూరి మంత్రించిన తోడనే భయపడి పాదాక్రాంతులై ఇక నెన్నటికి ఇట్టి బాధలు గావింపమని నిదర్శన పూర్వకముగ శపథముజేసి శాశ్వతముగ తొలగిపోవు చుండెడివి. మంత్రములకు లొంగని మొండిపిశాచ ములను సైతము భేతాళాది భూతపతులవశము చేయగల శక్తి మంతులు యాదవ ప్రకాశకులు. ఒకనాటిరాత్రి వీరి మఠము నొద్దకు రాజభటు లెందుకో సత్వరముగ వచ్చిరి. శిష్యు లర్ధ రాత్రము వరకు గురువుగారివద్ద పాఠములు వల్లించి గురువుగారి యాజ్ఞగొని అప్పుడప్పుడే తమ తమ గృహములకరిగి యుండిరి. ఒకరిద్దరు శిష్యులు మాత్రము ప్రత్యేక గృహవసతులు లేకుండు

టచే కాబోలు. మఠద్వారవితర్దికలపై పరుండి కూర్చుండిరి. వెనుక పేర్కొన్న రాజభటులు యాదవ ప్రకాశకుల మఠమున తలుపుతట్టి తమ అధికారసూచక సహజ గంభీరస్వరముతో అఱచిరి. అరుగుపై నిద్రించుచుండిన శిష్యులులికిపడి లేచి రాజభటులంగని ఇట్టి నిశీధసమయమున మా గురువుగారి నేల మేల్కొలిపెదరని యడుగ మేము రాజభటులము. మా రాజు గారి కొమరితె నొక బ్రహ్మరాక్షసిపట్టి బహుకాలమునుండి వేధించుచున్నది. మీ గురువుగారు గొప్ప మంత్రవేత్తలని మా ప్రభువుకు తెలిసి వెంటనే వారినితోడితేర మమ్ముల నంపెను. తడవుసేయ వీలులేదు. మీ గురువుగారిని మేల్కొలుపుఁడని పలికిరి. ఇటు గురునిగ్రహమునకును, అటు రాజనిగ్రహము నకును వెఱచి క్షణకాలము యోచించి తుదకు విధిలేక గురువు గారిని లేపఁబోవుచుండ వీరి సంభాషణ వినుచుండిన గురువుగారే లేచివచ్చి తలుపుతీసి భటులవల్ల వృత్తాంతము సవిస్తరముగ తెలిసి వలయు పరికరంబులంగొని శిష్యులలో నొకరు వెంటరా రాజస్థానమునకు వెడలిరి. యాదవ ప్రకాశకులు విచ్చేయు వరకే మంత్రవేత్తలచే నగరునిండి యుండినది. రాజపుత్రిని ఆవేశించిన బ్రహ్మరాక్షసి యార్భాటము ఇంతింతయని చెప్ప తరముగాదు. ఒక ప్రత్యేకస్థలమున రాజపుత్రినుంచి యుండిరి, ఒక్కొకతూరి యాపె పటపట పండ్లుకొరికి గుడ్లెఱ్ఱజేసి హుంక రించుచు మంత్రింపవచ్చిన వారిపై దుముకును. మంత్రవేత్త చేతనుండు వేపమండనే బలవంతముగలాగి చావమోద బోవును.

దుకూలవస్త్రములెన్ని మార్లు గట్టినను విప్పి యావలఁబారవేయును. ఒక్కొక్కపరి వికటముగ నవ్వును. మరియొకపరి బొమముడితో నన్నుతాకవచ్చిన నీపండ్లూడగొట్టెదనని బెదిరించును. దేవభాషతో మంత్రవేత్తతో సంభాషించును. నీవేపాటి శాస్త్రజ్ఞుడవో చూతమిటురమ్మని పిలిచి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రమున కర్థముచెప్పలేని అజ్ఞున కధోగతియేగదాయని పకపక నవ్వును. నీవెందుకీరాచపట్టి నావేశించితివని యడుగ నీపాండిత్యము పరీక్షించి నీబవిసి యార్పనని బలుకును. మంత్రవేత్తలెందరో తమతమ శక్తినంతయు ధారవోసిరిగాని తుదకు వారి యత్నములన్నియు బూడిదలోబోసిన పన్నీరు చందమే యయ్యెను, రాజదంపతులును, తదీయ భృత్యామాత్యులును, తక్కుంగల రాజబంధువులును సంతత శోకపరీత చిత్తులైయుండిరి. రాచకూతురా అసమాన రూప లావణ్యవతి. కాలమానవ యౌవ్వనకాలము ఆవేశించినదా బ్రహ్మరాక్షసి. ఎపుడీ ప్రారబ్ధకర్మ తొలఁగునాయని అందరు చింతించుచుండ తుదకు యాదవ ప్రకాశకులవల్లనే ఈకార్యము నెరవేరఁగలదని ఆప్తులు పలుకుటవల్లనే రాజభటులను మతమునకంపి ఆయనను పిలిపించవలసివచ్చినది. భటుల వెంటవచ్చిన యాదవప్రకాశకులను ప్రభువు కాలోచిత గౌరవ పురస్సరమున లోనికిగొనిపోయి రాజపుత్రిని చూపఁబోవ, ఇది వేళగాదు. ఉదయమున ఈకార్యము తప్పక నెరవేర్చెదను. మీరధైర్యపడ నవసరములేదని యాదవప్రకాశకులు బలుక ప్రభువందుకియ్యకొనెను. యాదవప్రకాశకులును

రాజమందిరముననే యారాత్రి శేషముగడిపి, అరుణోదయమున లేచి. స్నానాది నిత్యకృత్యములు నెరవేర్చుకొని ఒక కలశ మున తీర్థమును మంత్రించి, శిష్యునిబిలిచి "నీవీతీర్థము గొని పోయి రాచపట్టిపై చల్లి నీవీరాచపట్టిని వదలిపోవ మాగురువుగారి యాజ్ఞయైనది. ఇక నీమాటలుసాగవు. వృథాగా గురు నిగ్రహము నకు గురిగాక వెంటనే వెడలి పొమ్మని చెప్పిరమ్మ" ని పంపిరి. తీర్థకలశము గొనిపోవు శిష్యునిగని ప్రభువును తన పుత్రికయుం డు స్థలమునకు అతనివెంట నరిగెను. రాచపట్టి అప్పుడప్పుడే కన్నులు మూసియుండినది. గురువుగారి యాజ్ఞమేరకు తీర్థము శిష్యుడు రాచపట్టిపై ప్రోక్షించి గురువాజ్ఞ తెలపగనే బ్రహ్మరా సిచే నావేశింపఁబడిన యారాచపట్టి వికటముగ నవ్వి నీగురువు గారి ప్రపితామహుఁడు వచ్చినను నేనిందుండి తొలగను. మీగు రువుగారే యిచ్చటినుండి మరుక్షణమే మర్యాదగ తొలగకున్న మీరిరువురును నాకోపానలమునకు ఆహుతియగుదురు. జాగ్రత యని బెదరించెను. తీర్థముగొనివచ్చిన శిష్యుడావాక్యములకదరి పడి గురువుగారివద్దకు పరుగిడి జరిగిన సంగతులన్నియు తెలి పెను. యాదవప్రకాశకులు "ఓహో! నాయాజ్ఞనైతము ఆ బ్రహ్మరాక్షసి ధిక్కరించెనా ? అదెంత గుండె ధైర్యముగలది" యని దిగ్గునవేచి వలయు పరికరములతో స్వయముగ వెళ్ళిరి. రాజపుత్రి ఒక కాలు ముడుచుకొని మరియొకకాలు చాచుకొని ఏమేమియో వదరుచుండినది. వీరు ఆమెవద్దకు రాగనే ఆయ నవంక మోమెత్తిజూచి యతిశేఖరా! రండు ఇటు కూర్చుండుడు.

అనుచు ముడిచియుండిన పాదమునుగూడ చాచెను. అపుడు యాదవసూరి విభూతి మంత్రించి వేపమండతో ఉచ్చాటనజేయ బోవ మునుపటివలె బ్రహ్మరాక్షసి వికటముగనవ్వి ఓ మంత్రవాదీ! నీవేల వృధాశ్రమపడెదవు. మంత్రశాస్త్రమున నీకున్నంత యోగ్యతకన్న వేయియంతలు యోగ్యత నాకువున్నది. మంత్రశాస్త్రమునందేగాదు మరేశాస్త్రమునను నేను నీకు తీసిపోను. నేను త్రికాలవేదినిగూడ. కావున నీ యధిక ప్రసంగము లిక కట్టిపెట్టి మర్యాదగ వచ్చిన దారిబట్టిపొమ్మా అని ధిక్కరించెను. యాదవసూరి ఈలాటి పైశాచిక వాక్యములెన్నియో వినియున్న వారు గాన అందుకు జడియక నీవు త్రికాలవేదివైనందుకు నీ చరిత్ర మామూలాగ్రముగ తెలిసికొనవలసినదే యనిరి. అపుడా బ్రహ్మరాక్షసి ఓహో! ఇదియా నీ బ్రతుకు మహామంత్రవేత్తనని వచ్చితివే. నేనెవరో తెలిసికొనలేనివాఁడవు నన్నా తొలగింపఁజూచెదవు? ఇదిగో నావంక చూడుము అని భయంకరముగఁజూచి పాపమా సన్న్యాసి యదరపడునట్టు వికటాట్టహాసముజేసి "నా పూర్వజన్మ వృత్తాంతమేగాదు. నీ పూర్వజన్మ వృత్తాంతమును నాకు తెలియును. ముందు నా పూర్వజన్మ వృత్తాంతము వినుము. నేను కావేరీతీరమున నొక భూసురాగ్రహారమున వేదవేదాంగ పారంగతుఁడగు భూసురపండితుఁడను, నాయంతమేధావియు, విద్యావంతుడును మరియొకడు లేఁడని నీవలెనే లోలోన గర్వించుచుండెడివాడను. ఒక మహాయాగ మొనర్చు సందర్భమున పొరపాటున మంత్రలోపము జేయుటచే

నీబ్రహ్మరాక్షసజన్మ మనుభవింపవలసి వచ్చినది. నాకు సద్గతి జూపువారగుపడువరకు నేనీ రావపట్టిని విడిచిపో నిష్టపడను. ఇక నీ వృత్తాంతముఁ జెప్పెద వినుము. తిరుమలలో శ్రీ శ్రీనివాసుని బ్రహ్మోత్సవము సేవింపఁ నెంచి భూలోక వైకుంఠ మనదగు శ్రీరంగమునుండి కొందరు స్వాములు వేంచేయుచు మార్గమధ్యమున మధురాంతకముజేరి యందు విశ్రాంతి తీసికొనఁ దలచి ఆయూరి చేరువ నొక చెఱువులో స్నానసంధ్యాద్యనుష్ఠాన ములు దీర్చుకొని చెఱువుగట్టున నొక సముచిత స్థలమున వంట చేసికొని భగవదారాధన చేసికొని భుజించి వేంచేసిరి. నీవు చెఱువు సమీపముననున్న ఒక పుట్టలో ఉడమువైయుండి వెలు పలికివచ్చి అందు యాదృచ్ఛికముగ లభించిన భగవదర్పిత తీర్థ ప్రసాదములు ఆనుభవించి ఈ జన్మమున భూసుర పండితుఁడవై సన్న్యాసము స్వీకరించితివి" అని బ్రహ్మరాక్షసి పలుక యాదవ సూరి కాలత్రయవేదియగు నీకు నీ ముక్తిమార్గముగూడ తెలిసియే యుండును గదా యన "ఆదియును జెప్పెదవినుము. నీవద్ద నొక భాగవతుఁడు భూతపురినుండివచ్చి విద్య నభ్యసించుచు న్నాడు. అతవిని నీవు నీ సామాన్య శిష్యులలో నొకనిగ పరిగ ణింపతగదు. అతఁడు లోకోజ్జీవనార్థ మవతరించిన నిత్యసూరి నిర్వాహకుడు. నీకును నాకును జన్మవిమోచనము గావింపగలవా డతడే గాన నీవతనిని ఇచ్చటికి పిలిపింపుము. అతని దర్శన మాత్రముననే నాబంధవిమోచనమును వీరి దుఃఖవిమోచనమును అగున"ని పలుక అచ్చటనున్న వారందరు ఆపలుకులువిని

యాశ్చర్యము నొందిరి. యాదవసూరి తన శిష్యునటకు రప్పింప నించుక సంశయించుచుండ నావార్తలు వినుచుండిన ప్రభువు "యతీశ్వరా! కాలయాపనము జేయక మీ శిష్యుని పిలిపింపుడు. అతని పేరును ఉనికియుఁ దెల్పిన మా భటులే యాతనిని తోడ్కొని వత్తురు" అనఁగనే యాదవసూరి యెదుటనుండు శిష్యునితో నీవు రామానుజుని కడకేరిగి నేనిందుండుటం దెల్పి శీఘ్రముగ తోడ్కొని రమ్మని పంపెను. శిష్యునివెంట రాజ భటులును వెళ్ళిరి. వీరు వచ్చువరకు శ్రీ రామానుజులు కాల్య కృత్యములు దీర్చుకొని శ్రీ గోవిందులతో యాదవసూరి మఠమున కరుగ నుద్యుక్తులై యుండిరి. గురువుగారియాజ్ఞ తెలియగనే శ్రీ రామానుజులు తమ్ములతో "గోవిందా! మన గురువుగారు రాజమందిరమున నుండి నన్ను పిలువనంపిరి. కారణ మచ్చ టనే తెలియును. శీఘ్రముగ పోయివత్తును. నీవు నేను వచ్చు వరకు నింటనుండుము" అని పల్కి ఇంట నెరవేర్పవలసిన పనులు శ్రీ గోవిందుల కొప్పగించి తాము రాజభటుల వెంట నరిగిరి. వారు రాజమందిరములో నుండు యాదవప్రకాశకుల వద్దకు రాగానే యచ్చటనున్న వారందరు యా శ్రీవైష్ణవశిఖామణి నా పాదమస్తకమవలోకించి వారి బ్రహ్మవర్చస్సున కచ్చెరువు నొందసాగిరి. యాదవప్రకాశకులును "రామానుజా! అదిగో ఆగదిలో నుండు రాజపుత్రిని ఒక బ్రహ్మరాక్షసి అవేశించినది. ఇది మా మంత్రములకు లొంగునదిగాదు. నీవు పొమ్మన్న పోవునఁట. పోయి చూడుము" అనగనే శ్రీ రామానుజులు రాచ

పట్టియుండు గదిలోనికిపోయి యామెను జూచిరి. రాచపట్టియు వారిని చూడగనే బారుగబాచుకొని యుండిన పాదములు ముడుచుకొని తలవంచుకొనెను. అపుడు శ్రీరామానుజులు, "అయ్యా! నీవీ రాచూలి నేలబాధించెదవు. మా గురువుగారియాజ్ఞ నేలధిక్కరించితివి? వారి మంత్రిప్రభావము నీ వెఱుఁగవు గాబోలున"ని యనుచుండగనే యా బ్రహ్మరాక్షసి "శ్రీవైష్ణవ శిఖామణీ! మీ గురువుగారి ప్రభావము నేనెఱుంగనిదిగాదు. వారికున్న మంత్రిశక్తి నాకును కలదు. నా యుదంతమంతయు ఇదివరకే ఆయన కెఱింగించితిని. ఆయనతో నాకు పనిలేదు. నీ శ్రీపాదయుగళము నా శిరమున నుంచుము. నేను ధన్యుడనై ఈ రాచూలిని విడిచి పోయెదను" అనగనే శ్రీరామానుజులటులనే యొనర్చి తమ శ్రీపాదరేణువు రాజపుత్రి నొసటనుంచిరి. మరుక్షణముననే యా బ్రహ్మరాక్షసి ధన్యోస్మి. రామానుజా! ధన్యోస్మి. నేటితో నీ యనుగ్రహమున నా ప్రారబ్ధకర్మము తీరినది. అదిగో ఆ దివ్యపురుషులు నన్నాహ్వానించుచున్నారు. ఈ రాచూలినే గాదు, ఈలోకమునే శాశ్వతముగ విడిచిపోవుచున్నాను. ఇదిగో నిదర్శనము అనఁగనే రాచనగరు ముందుఁడిన రావిమ్రాను సమూలముగ ఫెళ్ళుమని విఱిగి నేలకూలెను. అద్భుతివిని యందరును నావింతఁ జూడనరిగిరి. శ్రీరామానుజులును రాచపట్టియుండిన గదివిడిచిరాగానే రాచపట్టియు తలుపులు మూసికొని విడిచిపోయిన వస్త్రమును కట్టుకొని వెలుపలికివచ్చి తల్లిచాటున సిగ్గుచే నిలుచుండెను. తల్లియు కూఁతురిని చేరఁదీసి బిగియార కౌగి

లించుకొని చుంచుదువ్వి తనవద్ద కూర్చుండఁ బెట్టుకొనెను.
ఇంతలో ప్రభువును తక్కుంగల రాజబంధువులు మున్నగువా
రునువచ్చి లజ్జావనత వదనయైయున్న రాచపట్టినిగని యానం
దించిరి. ప్రభువు తన కూఁతురిని గొనివచ్చి యాదవసూరికిని
శ్రీ రామానుజులకును మ్రొక్కించెను. అవ్వల నా గురుశిష్యుల
నిరువురిని కొనియాడి నమస్కరించి యుచితరీతి సత్కరించి
సాగనంపెను. అచ్చట మూగియుండిన మంత్రివేత్తలును పౌరు
లును కనివిని యెఱుగని యా శ్రీవైష్ణవ శిఖామణి ప్రభావమును
అభినందించుచు రాజాజ్ఞవడసి నిజనివాసముల కరిగిరి. నాఁటి
నుండి శ్రీ రామానుజ ఖ్యాతిలత దేశమంతటను పాకెను.

నాల్గవ గుచ్ఛము—సమాప్తము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## పంచమ గుచ్ఛము.

చోళరాజపుత్రి నావేశించిన బ్రహ్మరాక్షసిని తాము విడిపింపఁ జాలనందుకును, తమ శిష్యులగు శ్రీ రామానుజులు విడిపించుటేగాక ఆ బ్రహ్మరాక్షసిచే మిక్కిలి కొనియాడఁబడుటచే యాదవసూరి హృదయమున అసూయానలము ప్రజ్వలింపఁ జొచ్చెను. భూతావిష్టులను మంత్రతంత్రములచే చక్కఁబఱుపవచ్చును గాని అసూయావిష్టులను చక్కపరుప నేరితరము? ఆకారణముచే శ్రీ రామానుజులయెడ ప్రతి సందర్భమునను అనాదర భావము వెలిపుచ్చుచుండిరి. అడిగిన సంశయ విషయములకు మనఃపూర్వకముగ సమాధానము చెప్పటమాని వికటోక్తులాడఁ జొచ్చిరి. ఒక్కొక్కతూరి శ్రీ రామానుజులు కంటఁబడ ఈతఁడేగదా నా ఖ్యాతిగౌరవములకు హానితెచ్చుచున్నాఁడని లోలోన శోకింపఁజొచ్చిరి. శ్రీ రామానుజులు మాత్రము గురువుగారి నూతన వైఖరిని గమనించియు గమనింపనట్లు విద్య

నభ్యసించుచుండిరి. గురువుగారి యద్వైతబోధ యఖండ అద్వితీయ వికటస్వభావము మిక్కిలి జుగుప్సాకరముగ నుండు టచే కొంౘబోలు, కొందరు శిష్యులు స్థలాంతరమున విద్య నభ్య సింప నుద్యుక్తులగుచుండిరి. ఇదిగని శ్రీ గోవిందమిశ్రులు మీరు మనగురువుగారియెడ వైముఖ్యత వహించుటకు గతం బెయ్యది యని స్థలాంతరమున విద్య నభ్యసింప నుద్యుక్తులగు వారిలో తమకాప్తులగు వారి నడిగిరి. వారిలో కొందరు ధైర్యము దక్కిమనోభిప్రాయము వెలిపుచ్చ సంకోచించుచు నొకరి మొగమొగరు చూచుకొనుచుండ శ్రీ గోవిందమిశ్రులకు పరమా ప్తుఁడగు నొక శిష్యుడు "గోవిందా! మన గురువుగారి చర్యలు నీవు గమనింపలేదా? మనమిన్ని సంవత్సరములనుండి వేదాంత శాస్త్ర మభ్యసించుచున్నాముగదా. పరవస్తు నిర్ణయ మితడు చేసెనా? జీవపరమాత్ములకు భేదములేదనియు ఆ పరమాత్మయే అవిద్యోపాధిచే జీవుఁడయ్యెననియు తత్త్వజ్ఞానమును బోధించు మహావాక్యాను సంధానముచే తానే బ్రహ్మమను నిరూఢజ్ఞానము కాలక్రమమున గల్గుటచే బ్రహ్మముగా మారుననియు ఇది భ్రమరకీట న్యాయమున అనువర్తించుననియు చెప్పినదే పలు మారు చెప్పుచుండుటలేదా! కాలక్రమమనగా యెంతకాలమని నీ వొకప్పుడు ప్రశ్నింప "యన్మరణంత దవభృధమ్" అని కల కాలము సంతత జీవబ్రహ్మైక్యాను సంధానముజేయుచురాగా శరీర వియోగకాలమున ఈ అవిద్యోపాధి తొలగి బ్రహ్మమగు నని బోధింపలేదా? ఈ పల్కులు నీకు రుచించినవా? అది

యట్టిద శ్రీ వరదరాజస్వామి వారి గరుడోత్సవ దినమున మీ అన్నగారు తద్దివ్యోత్సవదర్శన కాంక్షచే కొంత యాలస్యముగ మఠమునకు విచ్చేయఁగనే "వరదరాజు ఈవేళకు వరమిచ్చెఁ కాబోలు. పూజారులు పొట్టకూటికై పన్నిన పొంగలి పులిహోర తంత్రములే జ్ఞానప్రీతి పాదకములని నీవు నమ్మితివి గాబోలు. "అనిశము సర్వభూత హృదయాంబుజ వర్తినగు నీశుననునవజ్ఞఁ జేసి మనుజుండొగి మత్ప్రతి మార్చ నావిడంబనమున మూఢుడై ఉచిత భక్తిని నన్ను భజింపఁదేని, అమ్మనుజుడు భస్మగుండమున మానకవేల్చిన యట్టివాడగుఁ" అని శ్రీ భాగవత కపిలదేవ హూతి సంవాదములో తెల్పియుండుట నీవెరుంగవు గాఁబోలు. నని వచింపలేదా ? మరియొకతూరి స్వామివారి ఏకాంతోత్సవము సేవింప నుద్యుక్తుఁడనై విన్నవించుకొన "నీ కేకాంత సేవగావలెనో నన్నడుగు ఎందులకు 'ప్రీతి మా స్వప్రబుద్ధానామ్' అను ఆర్యోక్తి మీకెన్నిమార్లు చెప్పినను చెవికెక్కినట్లులేదు. ఇట్టి వారికే ప్రహ్లాదుఁడు 'పొండొల్లవివారు కర్మ పుంజముపాలై' అన్నాడు" అని మీ అన్నగారి మొగమువంక ఈయనయే నన్ను ప్రోత్సహించెనని ఉగ్రముగా చూచుచు పలికినది నీవు గమనించ లేదా ? ఇట్టి అసహ్యాకరములగు విపరీత వర్తనము లనుదిన మునుగని వేసరియే మేము స్థలాంతరమున కరిగి విద్య నభ్య సింప నుద్యుక్తులమైతిమి. అని యనుచుండగనే గోడచాటు నుండి వీరిరువురి సంభాషణ పొంచి వినుచుండిన మరియొక యాదవసూరి శిష్యుడు వీరియెదుటికివచ్చి మాధవా ! ఇదియా

నీ ఉద్దేశము ? నీవు నాకు చెప్పకపోయినంత మాత్రముననే మీ ఉద్దేశము నేను కనిపెట్టఁజాలనను కొంటివి కాఁబోలు. చాలుచాలు. వినసహ్యమగు గురునింద. అందునూ యతినింద. మీ కిరువురకు నొకరిని నాడిపోసికొననిదే పొద్దు పోదు గాఁబోలు. ఇట్టి వారిని గట్టుకొని పాపమాయన గంగాయాత్రకు బోవ సంసిద్ధుఁడైనాఁడు. మాయమర్మము లెరుగని సద్గురువున కిట్టివారు దాపరించిరేయని నాకు మిక్కిలి జాలికలుగుచున్నది. అని యనుచు అచ్చోటు వాసిచనెను. శ్రీ గోవిందమిశ్రులును చూచితివా ఇట్టి గోముఖవ్యాఘ్రములను అని యాప్తుని మందలించి స్వగృహమున కరిగి శ్రీ రామానుజులకు జరిగిన విషయములన్నియు తేటతెల్లముగావించిరి. శ్రీ రామానుజులు మందహాస వదనులై "గోవిందా ! ఇది యంతయు భగవంతుని లీలావిలాసము. ఆయా జీవుల ప్రారబ్ధకర్మనే వ్యాజముగగొని భగవంతుడు లీలారసమనుభవించుచుండును" అనిరి. శ్రీ గోవిందులు "అన్నయ్యా ! భగవంతునికిది లీలారసముగా వచ్చునుగాని జీవుల పురోభివృద్ధికిది భంగకరముగదా" శ్రీ రామానుజులు, "నీవు పొరపడుచున్నావు. ఇది జీవుల పురోభివృద్ధి కెంతమాత్రము భంగకరముగాకుండుటేగాక మీదు మిక్కిలి ఉపకారము. ప్రారబ్ధకర్మములోని కష్టసుఖములనుభవించుచుండఁగా నాయా జీవులు తాము కేవలపరతంత్రులమనియు స్వతంత్రులమని విఱ్ఱవీగుట కేవల భ్రమయనియు తెలిసి క్రమముగా సకల ప్రవృత్తినివృత్తులకు భగవంతునిపైననే యాధారపడుదురు. ధనాభిమానము,

దేహాభిమానము, విద్యాభిమానము, కులాభిమానము. మతాభి మానము ఇత్యాదులు బంధమునకే హేతువులగు రాగద్వేషాదుల జనింపజేయును. ప్రారబ్ధకర్మ శీఘ్రముగ నశించిపోవుకొలది భగవదనుగ్రహము ప్రసరించుటకవకాశమేర్పడును. తిమిరాప హారియగు భాస్కర పవిత్రతేజః ప్రసరణమునకు మట్టిగోడయైనను ఆటంకమేగదా ! మట్టిగోడ కరుగు కొలది భాస్కరతేజము వ్యాపించుచు తిమిరము నణచును. కొందరు మూఢులు మాపై భగవంతుని దయలేదందురు. దయలేనివాఁడు భగవంతుఁడెట్లగును ? కాన తమ ప్రారబ్ధకర్మ అడ్డుతగిలి భగవంతునిదయ ప్రసరింపలేదనవలెను. అట్టి కృప ప్రసరించుట కాటంకమగు ప్రారబ్ధకర్మను తొలగింప భగవంతునే ప్రార్థింపవలెను. ఇట్లు ప్రార్థింపవలెనను జ్ఞానపరిపాకము కలుగువఱకు జీవులు అవ్యక్త చైతన్యములైనను, వ్యక్తచైతన్యములైనను లాభములేదు. అట్లని వీరినిగూడ భగవంతుఁడుపేక్షింపక తన అనాది సత్యసంకల్పముచే క్రమముగా శాశ్వతానంద సౌధముచేర పైపై సోపానముల నెక్కించుచుండును. ఇదంతయు సావకాశముగ విమర్శించుకొనఁదగిన విషయము. మఠమున కరుగ తడవగుచున్నది. ఇదిగో నేను వెళ్ళుచున్నాను. నీవును గృహారాధనకు వలయు పరికరములుగూర్చి శీఘ్రముగ మఠమునకు రమ్మ"ని చెప్పి మఠమున కరిగిరి. శ్రీ రామానుజులు మఠమున కరుగు నప్పటికి కొందరు శిష్యులు మఠవితర్దికలపై కూర్చుండి పాఠములువల్లె వేయుచుండిరి. గురువుగారభ్యంజనముఁజేసికొన నుద్యుక్తుల

య్యను శిష్యులలో నొకనితో కొన్ని ముఖ్యాంశములు మాటలాడ వలసి మఠములో నొక ఏకాంత ప్రదేశమున మాటలాడు చుండిరి. ఆ శిష్యుఁడు మరెవ్వడునుగాడు. ఇదివరలో శ్రీ గోవిందమిశ్రులకును వారి మిత్రులకును జరుగుచుండిన సంభాషణ గోడచాటునుండి వినివచ్చి యథోచితముగ మందలించిన వాఁడే. ఈ శిష్యునకును గురువునకును ఈ క్రింది సంభాషణ జరుగుచుండినది.

గురువు:— "ఓహో! ఇదియా నీ ఆలస్యమునకు కారణము. రామానుజునివల్ల నా పరువు ప్రతిష్ఠలు తగ్గునని నేనిదివరకే గ్రహింపకపోలేదు. ఇతనిని మఠమునుండి తొలగించిన నొక కష్టము, తొలగింపకున్న నొక కష్టము. మ్రింగరాని కడిగ నేర్పడినది."

శిష్యుడు:— "మ్రింగరాని కడియను ఉదాహరణ మేలదెచ్చెదరు. ఇది అన్నము ముద్దగాదు, సున్నము ముద్ద. మీరెద్దియేని నొక యుపాయము వెదకని యెడల ఇక వారము దినముల సరికి ఈ మఠములో మనమిరువురమే మిగులుదుము. 'ఆలస్య మమృతం విషమ్' యని మీరే ఎన్నిమారులో చెప్పుచుంటిరి గదా."

గురువు:—"అది నిశ్చయమేగాని మనపై నపఖ్యాతిలేక శిష్యులకు తత్కారణమున నాపైని ప్రతిపత్తిలేక యితనిని తొలగించు టెట్లనియే యోచించుచున్నాను."

శిష్యుడు:— "తొలగించుట మఠమునుండియా, గ్రామమునుండి

యా, లేక లోకమునుండియా ?

గురువు:—(శిష్యుని కడపటి వాక్యమున కదిరిపడి) "నీవు చివర చెప్పినపవి, అతిసాహసము, మహాదోషముగూడ."

శిష్యుడు:— "దిక్కులేక నాలుగక్షరములు నేర్చుకొని బ్రతుకు తెరువు చూచుకొన వచ్చిన వారికి గురువుగారియెడ విప్రతిపత్తి గలిగించి గురుశిష్య సంబంధము నెడఁబాపుట మాత్రము మహాదోషముగాదా ? చికిత్సకుఁడు దుష్టాంగము నేమి చేయును?"

గురువు:— "సమయమునకు మంచివిషయమే జ్ఞప్తికి దెచ్చితివి. అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శేషాంగ శ్రేణికి రక్షసేయుక్రియ నీయజ్ఞుంగురుద్రోహి" ఇత్యాది భావమును వెలిపుచ్చు భాగవత శ్లోకమును తలంపునకు తెచ్చుకొని బొమముడివైచి తలయూచి, మరల మనోభావము నించుక మార్చుకొనిన వారివలె మఠద్వారము మూయలేదు. గోవింద, రామానుజులు వచ్చువేళయైనది. పోయి చూడుము" అని శిష్యనంపి "యుక్తియుక్తం వచోగ్రాహ్యం బాలాదపిశుకాదపి" అను వాక్యము వ్యర్థముగాదు. వీఁడు మిక్కిలి మేధావి; దూరదృష్టిగలవాఁడు; గురుశ్రేయోభిలాషి. వీఁడుదలచిన సాహసకార్యము మాత్రమింకను యోచింవదగినది. "శృంగిణాం శృంగభంగఇవ మానభంగోహి మనస్వినాంవధః" అన్నట్లు ముందు రామానుజ శృంగభంగ విధానమే యోచింపవలెను"అని యనుకొనుచుండ ద్వారముకడ

కరిగిన శిష్యుఁడువచ్చి రామానుజుడు యరుగుపై కూర్చుంది యున్నాడని చెప్పెను. "నేడు మఠమున తైలము కొద్దిగా నున్నది. ఉన్నదంతయు నా అభ్యంజనమునకు సరిపోవును కాన నీవు నంగడి కరిగి తైలముగొనితెమ్ము. వెలుపలనుండు విద్యార్థులను లోనికి పంపుము." అని గురువు చెప్పగనే వారి యాజ్ఞచొప్పున శిష్యుఁడు బయటనున్న వారిని లోన ప్రవేశ పెట్టి వెళ్ళెను. విద్యార్థులును గురువుగారికి నమస్కరించి వారి యాజ్ఞగొని తమ తమ నియత స్థలముల గూర్చుండిరి. గురువుగారపుడు శిష్యులతో, "సాహిత్య పాఠములు మధ్యాహ్నమున చదువచ్చును" వేదాంత విద్యార్థులు మాత్రము పాఠ మువక్రమింపవచ్చును. అని నుడువగనే ఒక విద్యార్థి "స్వామీః నిన్న తాము చెప్పినపాఠములో కొన్ని సంశయములు తీర్చుకొనవలసియున్నది. ఆజ్ఞయైన విన్నవించుకొందుయని ననెను."

గురువు:— "అభ్యంతరమేమి ? తప్పక సందేహ నివృత్తిచేసి కొనవలసినదే"

శిష్యుడు:— "బ్రహ్మము రూపనామక్రియా రహితమనినపుడు, గుణరహితుఁడనియు, చెప్పవలసివచ్చును గదా?"

గురువు:— "తప్పక గుణరహితుఁడే. గుణమున్న వస్తువునకు నాశము తప్పదు పరబ్రహ్మ శాశ్వత వస్తువు; గుణరహితుఁడు."

శిష్యుడు:— "అటులైన సత్యం-జ్ఞానం-అనంతం అను ఉపనిష ద్వాక్యముల కర్థమేమి?"

గురువు:— "సత్యం అనగా అసత్యముకానిది. జ్ఞానమనగా అజ్ఞానములేనిది; అనంతమనగా అంతములేనిది; కనుకనే, బ్రహ్మము నిర్విశేష చిన్మాత్రము."

శిష్యుడు:— చిన్మాత్రమనగా, జ్ఞానమాత్రముగదా. అజ్ఞాన మెట్టిది ?

గురువు:— "అది అనిర్వాచ్యము; చెప్పుటకు సాధ్యమైన దానిని చెప్పవచ్చునుగాని, చెప్పుటకు సాధ్యముగాని దానిని చెప్పుటెట్లు?"

శిష్యుడు:— "మంచిగుణములుగూడ బ్రహ్మమున కుండవా ?"

గురువు:—"మంచిచెడ్డలు మిథ్యాభూతములు; త్రిగుణాత్మకములు. పరబ్రహ్మము త్రిగుణాతీతుఁడు."

శిష్యుడు:— "సగుణశ్రుతులు పరమాత్మకు గుణసంపత్తినిగదా తెల్పును. ఆసగుణశ్రుతులను బట్టియే పరమాత్మ సుగుణము లెన్నియో గలవాఁడని కొందరనుచుండుటలేదా ?"

గురువు:— వారికి వేదాంత శాస్త్రములోని సూక్ష్మాంశములు బాగా తెలియవు. ఇదిగాక లోకవ్యవహారము సక్రమముగ నడవ కున్న జనులు చెడుదురని మంచినడవడికలు జనులకు బోధించు కొఱకు శ్రుతులకును కొందరు లౌకికార్థములు కల్పించిరి. విగ్రహారాధన, భక్తి ఇత్యాదులన్నియు మహ ర్షులు పామర జనులు వృథాకాలయాపనము చేయకుండునట్లు కల్పించిరి. ఇవి మనశ్శుద్ధికి, సదాచారమునకు, ధర్మప్ర వృత్తికి, తోడ్పడి క్రమముగ జీవబ్రహ్మైక్యరూపనివృత్తి మార్గమునకు సహకారి కారణములుగా నుండఁగలవు. అయా

జీవుల స్వభావభేదములనుబట్టి కొన్నిసమయములలో అపాయ కరములను కావచ్చును."

శిష్యుడు:—"అట్లయిన అర్చావిగ్రహారాధన పామరజనులు చెడ కుండుటకు మాత్రమే యనియా మీ అభిప్రాయము.''

గురువు:— " 'ప్రతిమా స్వప్రబుద్ధానాం' అను ఆర్యోక్తికి మరే మర్థము ? తాత్వికమున ఇవి ఉజ్జీవనకరము లెంతమాత్రము కాజాలవు. తత్త్వజ్ఞానాన్మోక్షం అను న్యాయముననుసరించి మహావాక్యాను సంధానజనిత తత్త్వజ్ఞానముచేతనే ముక్తి."

శిష్యుడు:— "పరబ్రహ్మకు మీరన్నట్లు రూపమేలేనప్పుడు తస్య యథాక ప్యాసం పుండరీకమేవ అక్షిణీ" అను ఛాందోగ్యోప నిషద్వాక్యంబునకు మన నీలకంఠుఁడు చెప్పిన అర్థము చెప్పి నను తప్పులేదే."

గురువు:— నీలకంఠా ! నీవేమర్థము చెప్పితివి ?

నీలకంఠుడు సంకోచముచే తలవంచుకొనెను. దామోదరు డను మరియొక శిష్యుఁడు నీలకంఠుని వంకజూచి, "మమ్మ కడుపుబ్బ నవ్వించిన వాఁడవు గురువుగారియొద్ద ఏలసిగ్గుపడి యెదవు ?'' యనెను.

గురువు:— ''ఈ శృత్యర్థమున నవ్వువచ్చునంతటి విషయమే మున్నది ? ''

శిష్యుడు:— ''తాత్వికార్థమేదో మాకు తెలియదుగాని, పరబ్రహ్మ నేత్రములు మర్కట పృష్ఠములవంటివని జెప్పి మమ్మ నవ్వించినాఁడు.''

గురువు:— (చిఱునవ్వుతో) ఇదియా సంగతి. దేవుని కాకారమే లేనపుడు నేత్రములు మర్కటపృష్టములవంటి వన్న నేమి. మకరంద నిర్భరారవింద పత్రములవంటి వన్ననేమి? మిధ్యాప్రపంచ వస్తుసామ్యము నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మము నకు అంటకట్టుట అతి సాహసము ఈ సంవాదము విధిలేక వినవలసివచ్చినందుకు లోలోన దుఃఖించుచు గురువుగారికి తలయంటుచున్న శ్రీరామానుజులవారికి ఈ కడపటి గురు శిష్య సంభాషణచే లోని దుఃఖముపొంగి వెలికి అశ్రువులుగా మారి గురువుగారి తొడపై తప్తతైలబిందువులవలె రెండు మూడు బిందువులుపడి చురుక్కని బాధగావించినవి. గురువు గారును మోముపైకెత్తి అశ్రుపూర్ణ నయనులైన శ్రీరామా నుజులవంకఁజూచి దుఃఖకారణమడిగిరి. అపుడు శ్రీరామా నుజులు ఇంక మోమాట ముంచుట స్వరూపహానియని యెంచి కాఁబోలు ఆర్యా! తమ వాదము శాస్త్రసమ్మతముగాదు. అత్యంత శ్రుతివిరోధమగు మీ వాక్యములు భగవన్నిగ్రహ హేతువులు. ముముక్షువుజ్జీవింపనున్న జిజ్ఞాసువుల కత్యంతా నర్థదాయకములు. శిష్యసాహసమునకు మన్నింపవేడెదనని అంజలి జోడించి పల్కిరి. యాదవప్రకాశకులు శ్రీరామా నుజులయెడగల క్రోధము నడంచుకొని "నా వాదము శాస్త్ర సమ్మతము కాదని చెప్పునంతటి పరిపక్వదశ నొందితివి. సంతోషము. నా వాదమే నెగ్గవలయునను అభినివేశము నా కావంతయు లేదు. నీవు మాత్రమీ శ్రుతివాక్యమున కర్థ

మెట్లు సమర్థించెదవో చెప్పుము చూతము" అనగానే శ్రీ రామానుజులు "కప్యాసపదమునకే అప్యాస్త ఇతి కప్యాసమనియు, కంపిబతీతి కపిః నాళం, కపౌఆస్త ఇతి కప్యాసమనియు, కంపిబతీతి కపిః సూర్యః, తేన ఆస్యత ఇతి కప్యాసమనియు విమర్శించి అనగా జలమునందుదయించినదియు, తన కిరణములచే జలమును పానముఁజేయు సూర్యునిచే వికసింపఁజేయబడినదియు అగు పుండరీక పత్రము లెటులుండునో అట్టులే సూర్యాంతర్వర్తియగు శ్రీమన్నారాయణుని నయనములుండునని చెప్పుట సమంజసమనిరి. అపుడు యాదవప్రకాశకులు నీవు చెప్పినది వ్యవహారికార్థము. ఇంతకునూ దీనిపై వాదోపవాదములున్నవి. మున్ముందు వీనిని తెల్పెదను. ప్రకృతమీ విషయము యింతటితో విరమింతము. "మఱచితి రామానుజా! నేను గంగాయాత్రఁజేయ సంకల్పించితిని. నీవును గోవిందుఁడును మఱి కొందరు విద్యార్థులును నా వెంట రావలసియుండును. రేపే ప్రయాణమునకు సుముహూర్తమున్నది. సంసిద్ధులుగండు. అనవసర ప్రసంగములతో కాలాతీతమైనది. ఈ మధ్యాహ్నమువ మీరు మఠమునకు రానక్కరలేదు. రేపు వేకువజాముననే ప్రయాణ సన్నాహముతోరండు. నీలకంఠదామోదరులదప్ప తక్కిన వారందరు ఇక వెళ్ళవచ్చు" ననగానే శిష్యులు గురువుగారికి నమస్కరించి తమ తమ నివాసములకుఁ జనిరి.

పంచమ గుచ్ఛము—సమాప్తము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఆ ర వ గు చ్ఛ ము.

---

శ్రీ రామానుజులకు విద్య గఱపుచుండు యాదవప్రకాశకులు యెంతకాలమునుండియో గంగాయాత్రజేయ సంకల్పించియుండిరి. తాము గొప్ప మంత్రవేత్తలను సుప్రసిద్ధి తమ శిష్యులగు శ్రీ రామానుజుల మూలమున హతమైనందుకు కల్గిన అవమానము ఆదేశమున క్షణకాలమైననుండ సహింపజాలని తీవ్ర వేదన గలిగింపఁజొచ్చెను. యాత్రోద్యమ తీవ్రతనాటి నీలకంఠ సంభాషణచే నినుమడించెను. తమ యపఖ్యాతికి మూలమగు శిష్యునే వెంటఁగొనిపోవ నెంచుట ఉచితముగాదని తోచినను తమ యంతరంగ శిష్యుఁడు చూపిన ఉపాయమునుబట్టి అట్టిదారుణ కార్యము తాముపేక్షించినను అంతరంగ శిష్యుఁడే జరుపునను తలంపుతో శ్రీ రామానుజులను వెంటగొనిపోవ నిశ్చయించిరి. శ్రీ గోవిందమిశ్రుల స్వభావము బాగా గుర్తించుటకు యాదవ ప్రకాశకులకు తగు అవకాశము చిక్కలేదు. ఇదిగాక గురు

శుశ్రూషలో శిష్యులందరికన్న శ్రీ గోవిందమిశ్రు లెక్కువ శ్రద్ధాభక్తులుగల వారనియు, ఆయన కేవల మమాయకులనియు యాదవసూరి అభిప్రాయము. అందుచే శ్రీ గోవిందమిశ్రులను వెంటగొనిపోవ తీరదని నిశ్చయించియుండిరి. ఆకాలమునను సన్న్యాసులు శిబికలనెక్కి సంచరించువాడుక యుండుటచే యాదవసూరియు ఆ పద్ధతినే యనుసరించెను. శ్రీ రామానుజాది శిష్యవర్గముతో శ్రీత్యర్థపరిసంగము జరిగిన మరుదినముదయమున నొక సుముహూర్తమున తాము వెంటఁగొనిపోవ నిశ్చయించిన శిష్యవర్గముతో యాదవసూరి పయనమయిరి. తమ యంతరంగ శిష్యులకు మాత్రము తమ శిబిక వెంటనే వచ్చుసదుపాయముఁ జేసి యుండిరి. శ్రీ గోవిందమిశ్రులకును ఇట్టి సదుపాయ మమరియుండియు తమ యన్నగారి వెంటనేరాఁ గురువుగారిని ప్రార్థించి వారి యంగీకారమువడసి యుండిరి. గురువు వెంట నుండు శిష్యులుతప్ప మిగత వారందరు యథావకాశముగ పదశ్రమఁ బాపుకొనుచు కాలినడకనే వచ్చుచుండిరి. వారు తుంగభద్ర, కృష్ణ, గోదావరి, నర్మద మొదలగు పవిత్రనదీతోయములం గ్రుంకి పోవుచుండిరి. తీర్థస్నానమును అజ్ఞాననివృత్తికి సాధకమను నమ్మికయుండుటచే యాదవప్రకాశకులు స్వయముగ నదీతోయములం గ్రుంకుటేగాక శిష్యులకును తీర్థమహాత్మ్యమును అభివర్ణించి చెప్పుచు పోవుచుండిరి. ఇట్టి సదుపాయము తమ వెంటఁబోవు శిష్యులకు మాత్రమేకలదుగాని తక్కినవారి కెక్కడిది? శిష్యులు భిన్నభిన్న స్వభావులుండుటయు సహజమేగదా.

గొప్ప ధార్మిక చక్రవర్తిగదా. ఆయన వింధ్యహిమాలయ మధ్య నొకచో నశ్వమేధమను నొక జన్న మొనరించుచుండ దివ్యాలంకార శోభితమగు సవనాశ్వమును నింద్రుడు రాక్షసరూపమున మాయావియై హరించెను. సవనాశ్వమును గానక ఋత్విజులును చక్రవర్తియు సవనమునకు ఘోరవిఘ్నము సంభవించినదని వ్యాకులపడఁ జొచ్చిరి. సాగరోపమహృదయుఁడగు నా సగరుడు తన యరువదివేల పుత్రులంగని మీరు భూలోకమంతయు వెదకియైనను సవనాశ్వమును దేవలయునని శాసించెను. పితృవాక్య పరిపాలన తత్పరులై వారు భూమండల మంతయు వెదకి అశ్వము గానంబడని సంగతి దీనానసులై తండ్రికి నివేదించిరి. చక్రవర్తి యాగవిఘ్నమువకును గలుగనున్న యనర్థమునుదలచి పాతాళము వరకుత్రవ్వి యైనను సవనాశ్వమును వెదకితేక తీరదని పుత్రుల నియమించెను. పితృవాక్యోల్లంఘన దోషమునకు వెఱచి వారు బహుకాలము భూమిని త్రవ్వుకొని పాతాళమునకుఁబోయి, దిగ్గజములను పూజించి, యీశాన్యదిక్కునకుబోయి, అచ్చట నొక తపోనిధింగాంచిరి. మహర్షి సమీపముననే సవనాశ్వము మేయుచుండెను. వారు విధివశమున ఆయనను మహర్షియని తెలియక ఎవఁడో మాయావి అశ్వమును హరించి తపమను నెపమున ఈ వేషము బూనియుండెనని యాతనిపై కినుకజనింప నానావిధముల నతనిని హింసింపఁబోయిరి. అపుడు మహర్షి కన్నులఁదెరచి హుంకార మాత్రమున వారి నందరను భస్మముఁజేసెను. ఈ మహర్షి శ్రీమన్నారాయణుఁడేగాని మఱెవ్వడునుగాడు. భగవన్

గ్రహము వారింపనేరితము ? కొడుకులు బహుకాలము వేచినను రాకుండుటకు సగరుడు చింతాక్రాంతుఁడై తన మనుమఁడగు అంశుమంతున కుత్సాహము పురికొల్పి నీ పినతండ్రులగతిని సవనాశ్వహర్త నరయ సర్వసన్నాహమున నరుగుమని చెప్పెను. అంశుమంతుడపుడు పాతళమున కరిగి. దిగ్గజములను పూజించి. తన పినతండ్రులు మహర్షి శాపమున భస్మమగుట తెలిసి చాల వగచి సమీపమున నుండు సవనాశ్వమునుజూచి దానిని గొనిపోవు టకు ముందు పినతండ్రులకు తిలోదకములు విడువ యత్నింప తీర్థము లభింపమి నలుదిక్కులఁ జూచుచుండెను. అపుడు శ్రీ వైనతేయులగుపడి శ్రీమన్నారాయణ నిగ్రహముచే భస్మమైన వీరికి తత్పాదోదకమగు గంగతోనే తర్పణముఁజేయదగుననిచెప్ప నంశుమంతు డందు కామోదించి అశ్వమునుగొని సగరునియొద్ద కరిగి జరిగినయుదంత మంతయు నెరింగించెను. సగరుఁడు యాగమును యధావిధి నిర్వహించెనుగాని గంగతెచ్చు నుపా యము మాత్రము తోచలేదు. అతని వెనుక అంశుమంతుడును అతని పుత్రుడగు దిలీపుడును గంగను దెచ్చుటలో సగరునివలె విఫలమనోరధులైరి. గంగ నెట్లుగొనిరానగు. పైతామహులకు తత్తీర్థమున తర్పణాదులెట్లు గావింపనగునను విచారము దిలీపుని మనంబును ఆ మరణాంతము గలంచుచుండెను. కాని కేవలము భగవదనుగ్రహముననే ఇదినెఱవేరదగినదని నిశ్చయించి ఆ దయామయునే ప్రార్థించుచుండెను. దిలీపునకు భగీరథుఁడను పుత్రరత్నముదయించి యుండెను. భగవచ్చరణారవింద శరణా

గతి చేయనొల్లక యెన్నిసాధనాంతరములచే కార్యములు సాధింపఁ బూనినను వారివారి ప్రారబ్ధకర్మానుసారము కార్యము నెఱవేరు టయో విఫలమగుటయో ఏర్పడును. ప్రపన్నులకు మాత్రము ఆపన్న శరణ్యుఁడే కోరిన కార్యములు నెరవేర్చుచుండునుగదా. భగీరధునకు గంగను తెచ్చుటకు పూర్వము సంతతిలేకుండెను. రాజ్యము మంత్రుల కొప్పగించి అతఁడు గోకర్ణక్షేత్రమున సర్వ భారములు భగవంతునిపై నునిచి తపంబొనర్చెను. వేయిసంవ త్సరములు గడచిన వెనుక భగవన్నియమనమునవివరించి దేవతా గణంబుతో ప్రత్యక్షమై వత్సా! నీతపంబునకు సంతసించితిని. వలయువరంబు వేఁడుమనెను. భగీరధుఁడు పితామహునకు నమ స్కరించి దేవా! కపిలమహర్షి నిగ్రహమునకు గురియై భస్మీ భూతులగు నా పితామహులు గంగోదకమున తృప్తులై అక్షయ లోకములందు నటులను నాకు సత్సంతానప్రాప్తి యగునటులను వరంబొసంగ వేడెదననెను. బ్రహ్మయు నీకోర్కె సఫలమగు గాకయని దీవించి గంగావతనము భూమిసహింపజాలదు. ఇందుకు శంకరుడు నీకు తోడ్పడ యతనిని ప్రార్థింపుము అని పల్కి గంగాదేవితో నీవు భగీరధునికోర్కె నెరవేర్చుమని చెప్పివెడలెను. అంబుజాసనుని వరంబుగొనిన వెనుక నొకవత్సరము భగీరధుడు శ్రీశంకరునిగూర్చి తపంబొనర్ప ఆ దయామయుడు ప్రత్యక్షమై గంగను ధరించుట కొప్పుకొనెను. సర్వలోక పావనియగు గంగాదేవియు భగీరధునికోర్కె నెరవేర్ప భూలోకమున కవత రింప నెంచి మొదలు శ్రీశంకరని ప్రార్థనచే ఆయన జటాజూట

మున జేరెను భగీరథుడు మరలప్రార్థింప శ్రీ శంకర జటాజూటము నుండి బిందుసరోవరమున విడువఁబడి గంగా, హ్లాదినీ, పావనీ, నళినీ, సుచక్షు, సీత, సింధు అని యేడుపాయలై ప్రవహించి అందులో నొక ప్రవాహము భగీరథుని వెంటఁబోయెను. శ్రీ శంకరజటాజూటము నుండి భూమిపై ప్రవహించు గంగనవలోకింపఁ గలిగిన భాగ్యశాలురగు దేవతలకును మనుజులకును అత్యంతాశ్చర్యానందములు గలుగుట సహజమేగదా. గంగా పవిత్రతోయములం గ్రుంకిన వారందరు నిర్ధూతపాపులైరి. గంగయు నాకస్మికముగ తపోధనుఁడగు శ్రీ జహ్నుమహర్షి యాగశాలలో ప్రహించి యాగద్రవ్యముల నన్నిటిని నీటఁగలపెను. మహర్షి యపుడు కోపోద్రిక్తుఁడై గంగ నంతయు తపోమహిమచే పానముఁజేసెనుగాని మరల భగీరథ ప్రార్థనచే ప్రసన్నుఁడై చెవినుండి విడిచెను. జహ్నుమహర్షి శ్రోత్రము నుండి విడువఁబడుటంజేసి నాఁటినుండి గంగ జాహ్నవియని పిలువఁబడుచున్నది. భగీరథుఁడు జాహ్నవిని పాతాళమునకుఁ గొనిపోయి పితామహులకు జలతర్పణాదు లొనరించి వారిని స్వర్గసుఖమనుభవింపఁ జేసెను. సోదరులారా! ఇట్టి ప్రభావము గల గంగాయాత్రయే మనగురువుగారి యనుగ్రహమున మనకు లభింపనున్నది. అని చెప్పి గంగాప్రభావకథను ముగించిరి. ఇంతలో ఇనుండును పశ్చిమాంబుధిం గ్రుంకుచుండెను. కొందఱు చేరువనున్న జలాశయ మొకటిగని అందు సాయంకాల భగవదాజ్ఞావిధులు నెరవేర్చుకొన సత్వరముగ పోయిరి. గంగాచరిత్రము

ముగియగనే త్వరితముగ నరుగుచుండు వారిని మన శ్రీ గోవింద మిశ్రులనుసరింపక మందమందగ నడచుచుండిరి. శ్రీ రామానుజులును సోదరుఁడొంటరిగ వెనుక జిక్కనవి గాబోలు అతఁడు తమ్ము కలిసికొనువరకు తిన్నతిన్నగ నడచుచుండిరి. శ్రీ గోవింద మిశ్రిలన్నగారిని గలిసికొని "అన్నయ్యా! మన గురువుగారి యుద్దేశము మున్ముందు పోవుచుండు మన మిత్రులలో కొందరి మూలమున నేడుదయమున వింటిని. నీవానాఁడు రాచపట్టి నావేశించిన బ్రహ్మరాక్షసిని తొలగించినది మొదలు దానివెంటనే తమ ఖ్యాతిగౌరవములున్ను తొలగించితివని ఆయన ఖిన్నుడై యుండ శిష్యాధములు కొందరు నిప్పీయాత్రా వ్యాజమున గంగలో త్రోసి తుదముట్టింప ప్రోత్సహించి యున్నారఁట ఇదిగాక గురువుగారి యాధ్యాత్మికబోధ విపరీత జ్ఞానముగ నగుపడుటలేదా? అది వినియేగదా నీవు సహింపజాలక అతనికభ్యంజనమొనర్చ్చ తరి కన్నీరుగార్చితివని వింటిని. దుస్సంకల్పులకు కుదృష్టియే ఆధ్యాత్మికమునందును గల్గుట యొక వింతగాదు. ఈ విషయము నీకేకాంతమున తెల్పుటకే నేను నాగమనమును మందగించితిని" అనగనే శ్రీరామానుజులు నాకును కొన్నిదినములనుండి వీ. వ్రివర్తనలో వైపరీత్యమగపడుచున్నది. గాని ప్రకృతము మన మనుసరింపవలసిన పద్ధతి జెప్పుమనిరి శ్రీ గోవిందులు "జీవన్భద్రాణి పశ్యతి" (బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు) అను ఆర్యోక్తి కలదు గదా! ఇందెందే నొకచోట విశ్రమించి వేకువజామున ప్రయాణముసాగింపనెంచియుంటిమి

గదా. నీవంతగ గమనించియుండవేమో గాని యిచ్చోటి కతి సమీపముననే కొంద రాటవికులు గుడిసెలు వేసికొనియున్నట్లు ధ్వనివల్ల తెలియవచ్చెను. నేను నిన్ను వొంటరిగ ఇందువిడి చి పోవలసివచ్చినపుడు నీవీరాత్రి నిరపాయముగ గడుపుటకు ఉచితస్థలము నెమక చింతించుచుంటిని. " ఏదిక్కువేనివారికి నీదిక్కే దిక్కునుమ్మీ నీరజనాభా" అను నార్యోక్తి వ్యర్థము గాదు గదా" ఉదయముననో ఆటవికులు నీకు తప్పక తోడ్పడు దురు. మున్ముందు నీయోగక్షేమముల యెడ ఆపద్బాంధవుఁడు డును, సర్వాంతర్యామియును నగు శ్రియఃపతియే తోడ్పడకపోఁ డు. మనవారందరు నిద్రించిన వెనుక నీవు వీరి కగుపడకుండు నటుల నొక సంకేతస్థలమున పరుండుము నేనును నటులనేయొ నర్చి యీరాత్రి గడపి ఉదయమున వీరిని కలిసికొనెదను. నీ విషయము వీరడిగినపుడు సమయోచితముగ వీరిని తృప్తిపరచె ద. ఇట్టి పరిస్థితులలో ఇంతకన్నను గత్యంతర మగుపడలేద ద" నిరి. శ్రీరామానుజులును "గోవిందా! ఇందెద్దియో అద్భు త భగవత్సంకల్పమిమిడి యున్నది నీవు చేయుమన్నపనియే చేసెదను గాని నీ చిరవియోగమే కడు దుస్సహము. అదియును ఆ శ్రియఃపతియే తొలగించి మనలను మరల నొకచోఁగూర్పక పోఁడు" అని యిట్లు మాటలాడుకొనుచు వారిరువురు సమీపజలా శయముజేరి కాల్యకృత్యముల నెరవేర్చుకొనుచుండిరి. ఆ జలా శయము చేరువనే ఒక సత్రిముండెను. యాదవసూరి శిష్యులు వీరిరువురు ఇచ్చట చేరుటకు మునుపే సత్రిముచేరుకొని విశ్రి

మించుచుండిరి. శ్రీ గోవిందరామానుజులును ఆసత్రమునకే వచ్చి కొంతకాలము ఆ వింధ్యారణ్య ప్రభావమును, వింధ్యపర్వతమును శాసించిన శ్రీ అగస్త్యమహర్షి ప్రభావమును చాలసేపు మిగతవారితో ముచ్చటించుకొనుచుండిరి. వారందరాసత్రమున ఉచితస్థల మేర్పరచుకొని పరుండి పగలంతయు దారినడచివచ్చి యుండుటచే గాఢనిద్రావస్థకులోనైరి. ముమ్మందు విరపాయముగ కాంచీపురిచేరు నుపాయము చింతించుచు శ్రీరామానుజులొక సంకేతస్థలము చూచుకొని అందువిశ్రమించి కొంత నిద్రావస్థ నొందిరి. శ్రీగోవిందులు వారి సమీపముననే ఒకచో విశ్రమించిరి. కాని శ్రీరామానుజులను గురించిన చింతచే నిద్రపట్టలేదు. "దేవరాజ దయాసింధో దేవదేవ జగత్పతే త్వదీక్షణ సుధాసింధు వీచివిక్షేపసీకరైః । కారుణ్యమారుతానీతైః శీతలైరభిషించమామ్" అను అభియుక్త శ్రీసూక్తిననుసంధించుకొనుచు భగవద్గుణామృతమున నోలలాడుచుండిరి. అర్ధరాత్రిమీరితి గడచినది. ఇంతలో యాదవసూరి శిష్యసంఘములో నొకడు లేచి మిగతవారినందరిని మెల్కొలిపి సూర్యోదయమునకు చేరందలచిన చోటు మిగతరాత్రంతయు నడచినగాని చేర దుస్సాధ్యమని హెచ్చరించెను. వారందరును ఔచిత్యమును గ్రహించి పయనమైరి. వారిలో నొకడు శ్రీగోవిందులను మేల్కొలుపబోవ శ్రీ గోవిందులును నేనును మేల్కొనియేయున్నాను గాని మాయన్నగారికి మాత్రము మార్గాయాసముచే నిద్రబట్టక ఇప్పుడిపుడే కూర్కుతగిలినది. ఇపుడు వారిని మేల్కొలుపుటచి

తముగాదు. మీరందరరుగుఁడు. వారు మేల్కొనిన పిదప మే
రిరువురముకలిసి వత్తుమని పలికిరి. అన్నదమ్ముల గాఢవిశ్వా
సము వారెఱింగియుండుటంజేసి అందుకు సమ్మతించి త్వరగా
తమ్మి కలిసికొనుమని చెప్పి రావలసినదారి విమర్శించి వెళ్ళిపో
యిరి. వారరిగిన కొంతకాలమునకు శ్రీరామానుజులుమేల్కొ
ని తమ సమీపమున శ్రీ గోవిందులుమాత్రమే పరుండియుండు
టయు మిగతవారందరును అగుపడకుండుటయుఁ గని తమ్ముని
వద్దజేరి మేల్కొల్పబోగా "అన్నయ్యా! నాకీనాడునిద్రపట్టలేదు.
మన మిత్రులు మాత్రము ఘడియక్రింద పైనము సాగించిరి.
నిన్ను విడచిపోవనొల్లక నేను వారితో నరుగఁజాలనైతి" ననిరి
శ్రీరామానుజులపుడు "గోవిందా! నీవు నాకొఱకై నిలచిన గురు
వుగారికి కినుక జనించును. మన మిత్రులను అన్యథా భావింతు
రేమో. నేనీరాత్రి శేష మిందే గడపి ఉదయము భగవన్నియ
మము ననుసరింతును. నీవు నాకొరకై వ్యాకులపడవద్దు. వారు
దూరముగ వెళ్ళిన నీవు వారిజాడగానక త్రోవదప్పి శ్రమపడ
వలసివచ్చును. కాన శీఘ్రముగ పయనముగమ్మ"ని తమ్ముని
తొందరవెట్టిరి. శ్రీ గోవిందులును అన్నగారి నియమనమును
త్రోసిపుచ్చఁజాలక వారికి సర్వభద్రములొనగూర్ప శ్రీ శ్రియః
పతిని ప్రార్థించుచు శ్రీరామానుజపాదారవిందములకు మ్రొక్కి
వారి మంగళాశాసనము గైకొని విధిలేక తిరిగితిరిగి చూచుకొను
చు వెడలిరి.

అరవగుచ్ఛము — సమాప్తము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఏడవ గుచ్ఛము.

అవి శుక్లపక్షదినములు. కుముదినీకాంతుడు పిండి యారబోసినటులు పండువెన్నెలతో ఆయడవిలోని సర్వజంతుసంతానమునకు ఆనందమొనగూర్చుచు నంతరిక్షమున ప్రాకుచుండెను. శ్రీరామానుజులు శ్రీగోవిందమిశ్రుల నెడఁబాసి వుండవలసి తమయప్పటిస్థితికి క్షణకాలము వ్యాకులపడి ఇదియు మానవసామాన్యులకవగతముగాని భగవత్కృపాఫలమై యుండనోపునని మనంబును సమాధానపరచుకొని కన్నులమూసి భగవద్దివ్యమంగళ విగ్రహానుభవ తత్పరులై యుండిరి. ఇట్లించుమించు నొకముహూర్తకాలముగడచునప్పటికి దూరమున మనుజులశబ్దమువినఁబడినది. ఈశబ్దము తమయోగసమాధిలో నగపడుచుండు జగన్మాతయగు శ్రీపెరుందేవీతాయారు హసన్ముఖోద్గతమగు మృధుమధురశబ్దమువలెకన్పట్టెను. ఆమె శ్రీవరదరాజస్వామితో ముచ్చటించుకొనుచు పోవుచుండినట్లగపడెను. ఆదివ్యదంపతుల

యన్యోన్య ప్రేమావలోకనయుత సంభాషణము విన నిచ్చవా రమెను. ఒకరి భుజములపై నొకరు చేతులు వైచుకొని ఆపం డువెన్నెలలో విహరించుచు ఒక రమ్యోద్యానముననున్నట్లు పొడ కట్టెను. ఆహా వీరు విహరించు ఉద్యానవనమెంత రమణీయ ముగ నున్నది. వీరిరువురి సంభాషణలోని సారాంశమును గ్రో లి అభినందనసూచకముగ తలలూపుచున్నవో యన మలయమా రుతముచే ఈ అశోక పున్నాగ మాకంద తరు శాఖలు కదలుచు న్నవి. సుందరతరు శాఖలపై నెక్కి చకోరదంపతులు ప్రణ యానందమున నోలలాడుచున్నవి మీ ప్రణయానందములో త్రోవనుబోవు నాకేలజోక్యమని ఒక మేఘశకలము మఱుగున కరిగి మరియును త్కాంతయావఁజాలనటుల మరల నగుపడెను. కళాపూర్ణులున్నచోట మమ్మాదరించువారెవరని మేఘశకలము న్నియు ఒకటి వెనుక నొకటి విచ్ఛిన్నములయ్యెను. జగన్మాత జగన్నాథునికుడిభుజముపై చేయివైచి యెద్దియో యోచించువాని వలె మోముపైకెత్తి యాకశములోని విధుబింబమువంకఁజూచు మధువైరి మధురాధరముపై తనకటాక్షముబఱపి నిజకోమలకర పల్లవమున నాథునిచుబుకము తనవైపుత్రిప్పుకొని నాథా! యాచ కోర దంపతుల ప్రణయానుభవము గనుఁడని వ్రేలితోచూపుచు జగన్నాథుని భుజపై మోమువంచి యాతని మందహాస సుం దర వదనారవిందమువంక చూచుచుండెను. అపుడు జగన్నా థుడు దేవీ! పండువెన్నెల సర్వజంతుసామాన్యమునకే య త్యంతానందదాయకముగనుండ ఇక చంద్రకిరణములే భారకముగ

గల చకోరముల యానందమునకు మేరగలదా. ఇంతకును ఇది యంతయును నీవిచిత్ర సంకల్పవిలాసమేగదా యని మెచ్చ టించుకొనుచు కలహంస వినాదముచే నొప్పు నొక కాసారము వద్ద నొక చంద్రకాంత శిలాతలమున విశ్రమించిరి. బాహంవు ను పధానముగ చేసికొని యొత్తిగిలి పరుండిన నాథుని చరణారవింద ములను జగన్మాత మెలమెల్లన నొత్తుచు నిదావస్థకులోనై నాథుని మృదుపీతాంబరాచ్ఛాదిత యూరువుపై శిరముఁజేర్చి పరుం డెను. ఇటుల నిద్రించుచుండ జగన్నాధు డుపధానముగ జేసు కొనిన బాహువించుక చలించినట్లయ్యెను. తదనుగుణముగ శ్రీరామానుజుల మనంబును చలించినది. అపుడు శ్రీరామాను జులవారు పరమపురుషా నేను మీకు సకల కైంకర్యములొనర్ప కుతూహలముగల దాసుఁడనై కైంకర్యములకే యువ్విళ్ళూరు చుండియు నాయంకతలమున శిరమును జేర్చి నీకు సుఖనిద్రగూ ర్చు భాగ్యము లేకపోయెను. ఉపధానముగానుంచుకొన్న యా హువెంత నొచ్చుచున్నదో గదాయని యనుకొనుచుండగనే గాఢనిద్రావస్థలో బాహువునుండి శిరముజారి శిలాతలముపై బడి నట్లయ్యెను. మాధవున కాస్థితి నిద్రాభంగము కలిగింపకున్నను ఇదివరకే వ్యాకులచిత్తులైన శ్రీరామానుజులకు మాత్రము గో రుచుట్టుపై రోకటిపోటువలె మరింత వ్యాకులతకలిగించి వారి సమాధిస్థితికి భంగము కలిగించెను. అపుడు వారదరిపడి కన్ను ల విప్పి నలుదిశలు కలయఁజూచిరి. గాని వారికింతవరకు గా నవచ్చుచుండిన ఉద్యానవనము లేదు. కాసారము లేదు. చం

దరికాంత శిలావేదికయును లేదు. కౌపీనమాత్రధారియై ఒక మెఱుకుగొంగడి తలగడగానిడి బారెడుదూరమున ఒత్తిగిలి పరుండి నిద్రించుచుండెను. అతని యూరువునే తలగడగా చేసుకొని యెరుకునియు వెలికల బరుండి నిద్రించు చుండెను. అపుడు శ్రీరామానుజులు "అహా ఇదేమిచిత్రము! నేనింతవఱకు చూచుచుండిన సన్నివేశమేమయ్యెను? క్షణములో మటుమాయమయ్యెనే. ఇక నా దివ్యదంప తుల జూచు భాగ్యమబ్బునా? దివ్యదంపతులకు మారు ఈ యాటవికమిథున మిందగుపడుచున్నదే పరమపురుషా! నీలీల నెఱుంగుటకు నావంటి మానవమాత్రున కసాధ్యము. అని య నుకొనుచు నచ్చోటువాసి మరికొంతదూరముపోయి పరుండి త మ కిదివరక గుపడుచుండిన యాయద్భుతసన్నివేశమునే కన్ను లు మూసికొని తలంచుకొనుచుండిరి. ఇంతలో నెఱుకుసాని కన్నుల నులముకొనుచు దిగ్గునలేచి కూర్చుండి నాథుని తట్టిలేపి "మామా! దప్పేస్తున్నది. నోరెండుకొస్తాది అముంతతో యా దనైనా నీళ్ళుపట్టుకొస్తావా" యనెను. ఎఱుకులేచి కూర్చుండి ఆకసమువంకజూచి "అదో తెల్లారొచ్చింది. ఇయ్యాలప్పుడు నీళ్ళెక్కడొస్తాయే? తెల్లార్తే యాడనైనా తీసుకెళ్ళి నీళ్ళుతాపు తానులే" యని యావులించుచు పలికి మరల పరుండకుండిన యె ఱుకసానిని చేయిపట్టి లాగి తన ప్రక్కను చేర్చుకొనబోయెను. యెరుకలసాని తీయని గట్టిగా చేయివిదిల్చి "ఆడ మనిసి పండు కొన్నాదన్న బిడియమన్నా అక్కర్లా? మొగోళ్ళకక్కరదీర్తే

సరి. దప్పిదీర్చుమంటే దాపుచేర్చుకుంటావు. బాగుంది. ఇరు గుకింకా "యని తోసి "ఆపందిన మన్పినడగరాదూ" అనెను. వీరి సంవాదమువిని శ్రీరామానుజులు లేచి కూర్చొండి అయ్యో ఈయెఱుకత యెంత దప్పిగొనియున్నదోగదా! విదర్భమబ్బున వాఁడీమె దాహబాధను గమనించినట్టులేదు. అని వారిచెంత కరిగి అమ్మా దగ్గరనే ఒక చెఱువున్నది. అచ్చటికివెళ్ళి ఈ చెంబుతో నీరు గొనివచ్చెదను, లెమ్మ పాపము నీవెంత దప్పి గొంటివో యన అప్పుడామె యామాటలకలరి అంతేచాలు బాప నయ్యా నూరేఁడ్లు చల్లగాబతుకు అనెను. శ్రీరామానుజులు నీరుగొనిరా చెఱువునొద్దకు వెళ్ళిరి. ఎఱుకరూపముననున్న యాపురుషుఁడు దేవీ! మన రామానుజుని దయార్ద్రహృదయము గంటివి గదా? మన మనుకొనిన పనియు సాగినది. ఇక విత దనాయాసముగ నూరుజేరుకొనఁగలఁడు అని భార్యతో అ చ్చోటుఁబాసి జనెను. శ్రీరామానుజులు గడచిన సాయంకాలము గనిన చెఱువు గానరాక నేను త్రోవతప్పితినా యేమి? సత్ర మునకు చేరువనేగదా చెఱువుండినది. ఇదేమి వింతయని య నుకొనుచు కొంతదవ్వరుగ నొక దిగుడుబావి యగుపడినది. దీనిలోని నీరైన గొనిపోయెదనని బావిలోనికిదిగి నీరుగొనివచ్చి తాముఁచ్చిన త్రోవనేపోయి సత్రముచేరిరి. గాని బాగాపరికిం ప అది తాము రాత్రి పరుండిన సత్రముమాత్రము గాదు. అది యటుండ ఆయాటవికులందగుపడరైరి. పాపము శ్రీరామాను జులు వారికొఱకై చాలాకాలము వెదకుచు కొంత దవ్వరుగుసరి

గుభల్లున తెల్లవారెను. అపుడు శ్రీరామానుజులకు తూర్పుదిశను మనుజులశబ్దము వినవచ్చెను. ఇంచుక దవ్వరుగ నారికేళవృక్ష రాజములును, ఉన్నతసౌధములును, ప్రాకారమండప గోపురము లు గల ఆలయమును, తన్మధ్య నొక స్వర్ణవిమానమును కన్ను ల పండువుగ గానవచ్చెను. ఆహా ఏమి నాభాగ్యము! అకాన వచ్చునది పుణ్యకోటివిమానమువలెనున్నదే! ఇదినాపాలిటి పెన్ని ధియగు వరదరాజమూర్తి వెలయు కాంచీపురియే. ఆపదుద్ధార కుఁడగు ఆ దయామయుడే శ్రీ దేవీసహితుఁడై ఆటవికవేషము న నన్ను వింధ్యాటవినుండి తప్పించి కాచెను. దీనశరణ్యా! పరమపురుషా! వరదప్రభో! నీనితాంతాపార దయారసమున నా సంతాపమునార్పి కాపాడితివిగదా యని పరమపురుషుని కొని యాడుచు పోయి కాంచీపురిలోని విజనివాసము చేరుకొనిరి.

ఏడవగుచ్ఛము—సమాప్తము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## ఎ ని మి ద వ గు చ్ఛ ము.

---

మోక్షప్రదాయకములుగనుండు పట్టణంబులు ఏడుఅని వాడుక అవి ఎవ్వియన "అయోధ్యా మధురామాయా కాశీకాంచీ త్యవంతికాః పుణ్యాద్వారవతీచైవసప్తైతే మోక్షదాయకాః॥" ఈఏడు నగరములలో కాశీ మిక్కిలి ప్రసిద్ధమైన నగరము. దీనినే వారణాసి యందురు. వరుణ, అసి అను రెండుపదముల కూడిక చే వరుణాసియై యావల వారణాసియయ్యె నని కొందరు చెప్పుదురు. బ్రహ్మేంద్ర గంగాధరుల నివాసిగన్న త్రిమూర్తులలో మహా భాగవతశిఖామణియగు శంకర సాన్నిధ్యమునకుతోడు పవిత్ర భాగీరథీతీరమున ఈ నగరముండుటచే బంగారునకు పరిమళ మబ్బినట్లయినది. ఇతర గొప్పపట్టణములలోవలె వీధులు మిక్కిలి విశాలవంతములుగాకున్నను మేడలత్యున్నతములు. యాత్రికులు గంగాస్నానముఁ జేసికొని మహేశ్వరుని దర్శించి కృతార్థులగుటకై వచ్చి ఈనగర రమణీయతనుఁజూచి విడిచి

పోనొల్లక నెలలకొలది ఇందు నివసించుచుండెడివారు. ఇదిగాక ఇది గీర్వాణ విద్యానిలయము. గీర్వాణవిద్య నభ్యసించి ఉత్తమ పాండిత్యముగడింపనెంచు వారెందరో నానాగ్రామములనుండి వచ్చి వాసముజేయుచుందురు. కేవలము యాత్రికులకేగాక తదితరులకున్ను నిరతాన్నదానముఁజేయు ధన్యాత్ములెందరో ఈ నగరమున నుండుటచే నీనగరమున అడుగునిడినవారిలో ముఖ్యముగ భూసురుడు అన్నపానములకై వగవఁబనిలేదు. అన్నపూర్ణాదేవి యపారకటాక్షముగల గ్రామములలో అన్నమునకేమి కొదువ. విరక్తులకు శ్రీ మహేశ్వరుడును అంత్యకాలమున తారకమంత్రప్రదాతయై మోక్షమార్గప్రదాయకుడై యుండుటచే, అచ్చటనుండువారికి భుక్తిముక్తులకుకొదువయుండదు. గాని న్యాయాన్యాయ విమర్శనయే లేక ధనార్జనమొనర్చి అధికార మధాంధులై బీదసాదల నేడ్పించువారును ఇంకెందరో గలరు. యాత్రికులకడ బొంకులుబొంకియో మరెన్ని నూయోపాయములనో కాసు పీసములు గడించి నిరంతరము జారచోరాది దురభ్యాసములకుఁ జిక్కిన భూసురాభాసులు ఉదయము లేచినది మొదలు ఇరువదినాల్గుగంటలును నూరారుగ ధూమశకటాలయములవద్దను, సత్రములవద్దను తండోపతండములుగ గానవచ్చుచుందురు. ఈ త్రిగుణాత్మక ప్రపంచమున మంచివున్నచోటనే చెడ్డ కొద్దిగానో గొప్పగనో వుండితీరును. మంచివానికి విలువహెచ్చునది చేరువ చెడ్డవారున్ననేగదా! ఇట్టి మహానగరమున కొందఱు శిష్యులు పరుగుపరుగున వెంటరా నొక ఏకదండసన్యాసి శిబిక

వెక్కి గంగానదీ సమీపముననుండు నొక ఇరుకువీధిగుండ బో
వుచుండెను. ఎవరికొరకో ఆయన శిబికనుండి రెండుమూడు
పర్యాయములు తొంగిచూచుచుండెను. ఇటుల నాఇరుకువీధి
దాటి గంగాతీరస్నానఘట్టము చేరి శిబికదిగి ఒక శిష్యునితో
గోవిందా రామానుజుడిందగుపడదేమి" మనవారందఱు ఇందొ
చ్చి చేరుకొనిరిగదాయనిరి. దీనినిబట్టిచూడ నాసన్యాసి మన
యాదవసూరియే యని పాఠకమహాశయులు గ్రహింపకపోరు.
అపుడు గోవిందమిశ్రులు గురువుగారితో "స్వామీ తమ శిబిక
వెంట వచ్చినవారికి తగు వసతులు వుండునుగాని మిగత వారి
కెక్కడివి. కొందఱు చాలబడలి కాళ్ళీడ్చుకొనుచువచ్చుచుండి
రి. గడచినరాత్రి మాలో కొందఱికి తాముగొనివచ్చిన ఆహార
పదార్థ లిదివరకే వినియోగపడియుండినందున వారి నిరాహారస్థితి
జూడజాలక శక్తివంచనలేక, నావద్ద మిగిలియుండిన పదార్థము
లిచ్చితిని. ఇక మాఅన్నగారో మావెంటరాజాలక చాల వెను
కబడిరి, గృహస్థులగు వారు బ్రహ్మచారులవలె కష్టములకల
వడినవారు గారుగదా? నేను వారి వెనువెంటనే తిన్నగ వచ్చి
యుందును గావి మీఅగ్రహమునకు గురియగుదునేమోయని శం
కించి వారి నొంటరిగ విడచి శీఘ్రముగ రావలసివచ్చెను. ఈ
నాటి సాయంకాలమునకైనను వారు మనలను చేరుకొనగలరని
తలంతును" అనిరి. యాదవసూరి శ్రీగోవిందమిశ్రుల వాక్య
ముల లోని ఔచిత్యము గ్రహించి మరేమియు బలుకక స్నాన
మొనర్ప నుద్యుక్తులైరి. స్నానఘట్టమున కొందఱు భూసురో

త్తములు వేదోక్తమంత్రపూర్వకముగ అఘమర్షణ స్నానమాచ రించుచుండిరి. స్నానమొనర్చినవారు పుండ్రముధరించి సూర్య భగవానున కర్ఘ్యప్రదానమొనర్చు చుండిరి. కొందరు కృష్ణాజి నముపై కూర్చుండి జప మొనర్చుచుండిరి. కొందఱు స్నాన మాచరింపవచ్చిన దంపతులకు కొంగుముళ్ళువేసి దీర్ఘసంకల్ప ములతో స్నానముచేయించి గోభూహిరణ్యాది దానములొనర్ప నానావిధముల ప్రోత్సహించుచుండిరి. కొందరు చోరాగ్రేసరు లు వెనుకనుండి ఏమరియుండువారి ముళ్ళువిప్పి మోసములెరుం గకుండులాగున కాసువీసములు హరించుచుండిరి. వాయనముల కై తాత్కాలిక దాంపత్యమును కల్పించుకొని వచ్చినవారిలో కొందరు తమ వడంబడిక కుదుర్చుట కాశాపిశాచ మద్దుదగుల ఒకరితో నొకరు కలహించుకొనుచుండిరి. ఇది యొకమూల నుండి గమనించుచుండిన రక్షకభటులు వీరిమాటలద్వారా వీరి పాత్రితనేరములను కనిపెట్టి వారిచెంతజేరి కారాగృహములకు గొ నిపోయెదమని బెదరించుచుండిరి. వీరికి వెరచినవారు వాయన ములచే నార్జించిన సొమ్ము చాటుచాటున వారికి ముట్టజెప్పి కట్టు గుడ్డలతో వారిబారినుండి తప్పించుకొని పోవుచుండిరి. దంతధా వనము నెపమున కొందరు గంగయొడ్డునకూర్చొని స్నానమాచ రింపవచ్చిన సతీమణులను నానావైఖరుల జూచుచుండిరి. యా దవసూరి శిష్యులుమాత్రము స్నానసంధ్యాది నిత్యవిధులొనర్చు కొనుచుండిరి. శ్రీగోవిందమిశ్రులు గంగలో మునుకలువేయు చుండ చేతికెద్దియో తగిలినట్లయ్యెను. దానిని బయటికి తీసి

శివలింగమని తెలిసి చేజిక్కిన శివలింగము నుపేక్షించిన గురువు వారికిది తెలిసిన ఏమనుకొందురోయని ఇంచుక శంకించి, యాద వసూరివద్దకు గొనిపోయి యాశివలింగముఁజూపి సంగతి తెల్పిరి యాదవసూరియు శిష్యుడుచూపిన శివలింగము మున్ముందు కార్య క్రమమునకు మిక్కిలి ఉపకరించునని లోలోననలరి "గోవిందా ఇది శివలింగముగదా శ్రీ వైష్ణవుడనగు నాకు శివలింగముతో పనియేమని ఉపేక్షింపకుము. శ్రీవైష్ణవసాంప్రదాయ మవలం బించిన మాత్రమున శివలింగమగ్రాహ్యమను అభిప్రాయముం చుకొనగూడదు." శివాయ; విష్ణురూపాయ శివరూపాయ వి ష్ణవే। శివస్యహృదయం విష్ణుః విష్ణోశ్చహృదయం శివః" అని అనుదినమును నిత్యవిధులలో పలుమారు వైదికులు పఠించుచుం దురుగదా. ఓకే బ్రహ్మము సగుణోపాసకులకు ఒకప్పుడొకరికి శివుడుగాను మరియొకరికి కేశవుడుగాను గానవచ్చుచుండును. రూపనామక్రియారహితమగు బ్రహ్మము భక్తానుగ్రహార్థము ఎన్నియోరూపముల గానవచ్చుచుండును. అజ్ఞానులుశివకేశవులకు భేదము పాటింతురు ఇది తొలగించుటకే బ్రహ్మము ద్వివిధ ముగ గానవచ్చుచుండును. అజ్ఞానకల్పితభేదములు పాటింపక ఈరెంటిలో ఎద్దియోనొకరూపమును ధ్యానించుకొనుచుండ క్రమ ముగ నిశ్చలబుద్ధి అలవడి నిర్గుణోపాసనలో ప్రవేశింపవచ్చును. గనుక నీవనుమానపడక ఈలింగమును మీగ్రామమగు మళల మంగళమునకు గొనిపోయి ప్రతిష్ఠించి పూజించుచుండుము. దీన నీకెంతయో అభ్యుదయము గల్గును అని పల్కిరి. గురువుగారి

అంతరంగశిష్యులును "గోవిందా నీభాగ్యము చాలదొడ్డది పవిత్రభాగీరథీతోయమున శివలింగము చిక్కుట అదృష్టముగదా! మన గురువుగారు చెప్పినట్లు చేయుమనిరి. మరి కొందరు రామానుజులిందుండిన ఈకార్యమున కడ్డుదగిలియుందురేమో యనిరి. వారన్నట్లు శ్రీరామానుజులీవార్త వినిన ఏమనుకొందురోయని శ్రీగోవిందమిశ్రులు సంశయుంచియు గురువుగారి బలవంతమునకు లొంగిపోవలసివచ్చెను. అయినను నాచేత ముమ్ముందు ఎద్దియో పరోజ్జీవనహేతువగు కైంకర్యము జేయింప శ్రియఃపతి సంకల్పించినట్లున్నది. తద్విధానము శీఘ్రముగ ఆదయామయుడే స్ఫురింపజేయును. మానవమాత్రుల కంత శీఘ్రముగ ఆదయామయుని సత్యసంకల్పములు విమర్శించుకొను యోగ్యత ఎక్కడిది" అని మనంబు సమాధానపరచుకొని నిర్భయులై యుండిరి.

ఎనిమిదవ గుచ్ఛము—సమాప్తము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## తొమ్మిదవ గుచ్ఛము.

శ్రీ కాంచీపురిని జగన్మాతయగు శ్రీపెరుందేవితాయా
నిజనాథుడగు శ్రీ శ్రీ కరిగిరివరదునితో నొకనాటి రాత్రి ఏకా
తమున ముచ్చటించుచు "దేవా మీనిత్యకైంకర్యము నేమర
సల్పుచుండు మన వైనతేయుని శ్రీవైకుంఠమునుండి రామాన
జులకు చేదోడు వాదోడుగనుండ బంపియు కేవలము శివపూజ
తత్పరుడగునట్లు జేయుటలో మీ విచిత్రసంకల్పము దురవగ
హము గదాయనెను. అందులకు శ్రీ శ్రీ వరదుడు "దేవీ మ
భక్తుల మూలముననేగదా మనము లోకముననుండు అజ్ఞాను
ను దిద్దుబాటొనర్పవలసినది ? దేవతాంతరభజకులైనను ఆయా
దేవతానుగ్రహము బడయుటకు ఆయా దేవతలు ప్రేమించువ
రిని తామున్ప్రేమించినగదా ఆయాదేవతలు అనుగ్రహింతురు
ఇందుకు దృష్టాంతము. కొందరు శ్రీ శంకరుని ఆరాధించి శి
భక్తులమని విర్రవీగుచుందురేగాని శ్రీ శంకరుని అత్యంతప్రి

యుడనగు నన్ను, నన్నారాధించు వైష్ణవులను ద్వేషించుచుండు ట లేదా? ఇట్టివారు శ్రీ శంకరానుగ్రహమునకు పాత్రులగుదురా! మీదు మిక్కిలి అతని నిగ్రహమునకే గురియై మహాభాగవతాపచారదోషమున నిరయంబునంబడుదురు. తగు బోధలేవి కతనగదా ఎందరో భక్తులమని అహంకరించి అధోగతిపాలగుచున్నారు. వీరియెడ జాలిగొనియే వీరికి సద్బోధగావించి ఉజ్జీవింపజేయ కొన్నిదినములు వైనతేయాంశుడగు గోవిందు నీకార్యమున నీయమించితిని. అతడును దేశమున చక్కనిశివభక్తిని నెలకొల్పి ఎప్పటివలె వర్తించును. దీనిని నీవచిరకాలముననే కనుగొందువు లెమ్ము" యని పల్కెరి. జగన్మాతయు నేనూహించినట్లయైనది నాథుని దయామయ త్సంకల్పములు అపారవారములు, అత్యద్భుతములు, దురవగాహములు అనుకొని మారుబల్కక యూరకుండెను, ఇటు కాశీక్షేత్రమున శ్రీయాదవసూరి శిష్యబృందముతో కొంతకాలము గడపి శ్రీరామానుజుల ఉనికియే తెలియక వారితోయోచింప వింధ్యాటవిని త్రోవదప్పి ప్రాణాంతమగు ఆపదకతడు తప్పక గురియై యుండకపోదని బల్కెరి. అందుకు సందేహముండదని నిర్ధారణజేసుకొని పీడ వదలిపోయినదని లోలోన మురియుచుండినను పైకిమాత్రము శిష్యవిశ్లేషమోర్వజాలనివాని పగిది వగచుచున్నట్లగపడుచుండెను. ఆఅంతరంగశిష్యులకు మాత్రము గురువుగారిహృదయము కరతలామలకమే గదా? శ్రీ గోవిందమిశ్రులను స్వగ్రామమున కడుగ యాదవసూరి తీవ్రపరచినను యెద్దియోవంకబెట్టి కాల

యాపనమొనర్చు చుండిరి పాపమతడు గురువిశ్లేషమోర్వజా
లని మృదుస్వభావముగలవాడని ఊహించి తీవ్రపరచుట మాని
రి. కొందరు ఇతనికి పాపము రామానుజులింకను వచ్చునేమో
యను నాసతో నుండనోపునని గురువుగారితో ననిరి అదియు
ను సకారణముగ నెంచదగినదేయని సమాధానపడియుండిరి.
ఇట్లు కొంతకాలము శ్రీవారణాసిని గడపి. శ్రీయాదవసూరి
శిష్యబృందముతో శ్రీ కాంచీపురికి పయనమయ్యెను. శ్రీగోవింద
మిశ్రులు మరికొంతకాలము శ్రీ విశ్వేశ్వర దర్శనమొనర్చుకొను
చుండి అవ్వల స్వగ్రామముచేరి మీఆజ్ఞమేరకు వర్తించెదనని
బల్క అతని గాఢ శివభక్తికి సంతసించి శ్రీయాదవసూరి అటు
లనే గావింపుమని పల్కి మిగత శిష్యులతో పయనమై కతిపయ
దినంబులకు కాంచీపురిని చేరుకొనిరి. శ్రీ గోవిందమిశ్రులు
ఇక మంచితరుణము లభించినదిగదాయని శివభక్తులను చేరదీసి
నిజమైన శంకరభక్తి యెట్టిదో బోధించి ఆక్షేత్రమున సత్శైవ
భక్తి బీజములనాటి స్వగ్రామము చేరుకొని అందు శివలింగము
ను ప్రతిష్ఠించి శైవ వేషధారియై శివార్చనాతత్పరునివలె కన్ప
ట్టుచూ అందునూ సత్ శైవభక్తిబీజములు నాటుచుండిరి. స్వగ్రా
మములోని సన్నిహిత బంధు మిత్రులు వీరి బాహ్యవేషముగని
భ్రమించి అంతరంగాభిప్రాయ మరయజాలక ఈయుద్యమము
శ్రీవైష్ణవస్వరూపమునకు అత్యంత గర్హితమైనదని తక్షణమేమా
నుమని యెన్నియోవిధముల బోధించిరి. గాని ఆబోధ వారిచెవి
కెక్కకపోవుటచే వ్యాకులాంతఃకరణులై మరలిరి. శ్రీగోవింద

మిశ్రిల ప్రవృత్తి ఇవ్విధముగనుండగా నొకనాడు శ్రీ నిటలా
క్షుడు స్వప్నమున అగపడి కాళహస్తిలో నా కైంకర్యములు నా
నాటికి క్షీణదశనొందుచున్నవి. నీవందు చక్కని శివభక్తి వ్యా
పింపజేయుచు కైంకర్యములు చక్కపరుపవలసినది. నీకు మా
రు నీకు యోగ్యుడని తోచిన మరియొకనిని మత్పూజార్థమిందు
ఏర్పాటుగావించి పొమ్ము అని పల్కి అదృశ్యులైరి. శ్రీగోవింద
మిశ్రి లుదయముననే మేల్కాంచి భగవదాజ్ఞావిధులు నెరవేర్చు
కొని తమ్ము నమ్మియుండిన భక్తులకు తమ స్వప్నవార్త తెల్పిరి.
అపుడు వారు స్వగురువిశ్లేషమోర్వజాలక పెద్దయుంబ్రొద్దు వగచి
వారితో "స్వామీ తమ అపూర్వబోధామృతము శ్రోత్రపేయము
గ గ్రోలి నెమ్మదిక నింతకాలము త్రోసిపుచ్చితిమి. ఇకమీద
మాకాలమెట్లుగడచునో దోపకున్నది. కడసారి కొంతహితము
మాకుపదేశించిపోయిన కలకాలము మనసార మిమ్ము స్మరించు
కొనుచు కాలము గడిపెదమని కడుంగడు ప్రార్థించిరి. అపుడు
శ్రీ గోవిందమిశ్రిలు వారియెడ జాలిగొని "సోదరులారా మీరు
మోక్షమార్గదర్శియు, శ్రీతారకమంత్ర జపపరాయణుడును, భాగవ
తోత్తముండును నగు శంకరుని దైవమువలె నమ్మి పూజించుచుం
డుడు. మీకనుగ్రహింపబడిన ఆ పంచాక్షరీమంత్రమును జపిం
చునపుడు ఆదయామయునే మీకు సద్గురువుగ నమ్మియుండుడు
గాన ఆయన సంతసించి ఆయనప్రేమించు శ్రీరామమూర్తిపై
మీకు కాలక్రమమున భక్తిగల్గి కలికల్మషములు బాసి కడతేరు
మార్గముతప్పక జూపును. ఆయన విష్ణు వైష్ణవద్వేషము మా

త్రిము సహింపదు. విష్ణు విగ్రహములను, వైష్ణవభాగవతో త్తములను కనినపుడు అంజలియైన జోడింపకుండరాదు. విష్ణు వైష్ణవకథలు విన్నపుడుసయిత మటులనే యాచరింపదగును. వీరశైవులమని శివభక్తులలో కొందరజ్ఞానులు విర్రవీగి విష్ణు వైష్ణవద్వేషులై తుదకు యమయాతనలకు గురియగుదురు. అ ట్టివారా తారకమంత్రమభ్యసింప నర్హులు? శ్రీ విశ్వేశ్వరక్షేత్ర మగు వారణాసిని మృతినొందినవారికి సాక్షాత్ శంకరుడే మరణ కాలమున తారకమంత్రముపదేశించుననియు తన్మూలమున వారు ముక్తులౌదురనియు కనుకనే "కాశ్యాంతు మరణాన్ముక్తిః" అని ఆర్యోక్తి కలదని కొందరు వచింతురు గాని ఇది మానవజన్మ మునకు క్రిందిఅంతస్తులోనుండు తిర్యక్ జంతువులవిషయము. ఆ జంతువులకు భగవత్సంబంధజ్ఞాన ముండదు. గనుక కాలక్ర మమున ఉన్నతదశనొంది ఉజ్జీవించుటకా క్రమమేర్పడియుండ వచ్చును గాని శ్రీ శంకరాధిదైవతమగు విష్ణువును, తదీయుల ను ద్వేషించు పుణ్యజనుల విషయముగాదు. మధ్యవయస్సులో ఎటులున్నను అంత్యకాలమునకైనను అకృత్యముల కనుతాపము లేకున్న శ్రీ శంకరనిగ్రహమునకే అట్టివారు గురియగుదురు. వారణాసిలోనే నుండినపుడు కొందరు వీరశైవులకీవిషయమే వి మర్శించి యుంటిని. కొందరు పెద్దలీ వీరశైవశబ్దము ప్రయో గించుచుండినందుచే వాడుకలో కద్దుగాని ఇందుకు గాఢమైన శివభక్తియేయని అర్థముగాని విష్ణువైష్ణవద్వేషయుత శివభక్తియ ని గాదు. తన్ను ప్రేమించి తనకు ప్రాణపదమగువారిని ద్వే

షించిన ప్రేమింపబడినవాడు సంతసించునా? శత్రుఘ్నుడు భర తైకభక్తి భరితుడన్నంతమాత్రమున భరతాధిదేవతయగు శ్రీరా మూర్తిని తదీయులను ద్వేషించెననవచ్చునా? నేనిచ్చటనుండి పోయిన పిదప మీరందరును ఈ శైవసత్సంప్రదాయమునను వర్తించుటేగాక దేశమంతటను దీనిని వ్యాపింపజేయుటే నాము ఖోల్లాసము. వెనుక పేర్కొనిన ద్వేషములేక శ్రీపంచాక్షరీ మంత్ర జపమొనర్చువారు కాలక్రమమున శ్రీశంకరుని యనుగ్రహముచే పక్వావస్థనొంది తుదకు విష్ణుభక్తులుగా మారుదురు. ఇందుకు "శంకరస్యతుయోభక్తః సప్తజన్మాంతరంవరః తస్యైవతు ప్రసాదేవ విష్ణుభక్తిః ప్రజాయతే" యను ప్రమాణమున్నది. ఈ వాక్యములను బట్టిచూడ ఇపుడు విష్ణుపూజా తత్పరులైన భాగవతులుగూడ ఒకప్పుడు శివభక్తులుగనుండినవారే. ప్రాకృత దేవతాభక్తి కనిపెంచిన తలిదండ్రులపై నుండు ప్రేమవంటిది. అప్రాకృత భగవద్భక్తి పతిభక్తివంటిది ఇదియే ముక్తిసాధము నెక్క నిరపాయమైన శ్రేణికయనిపల్కిరి. ఈ నూతనబోధలోని అపూర్వ ఔచిత్యమును గ్రహించి గురువుగారికి ప్రదక్షిణప్రణా మము లర్పించి గౌరవపురస్సరముగ వారిని శ్రీ కాళహస్తికి పంపి తాము గురువుగారు బోధించినమేరకు అనువర్తించు కొనుచు, యధోచితముగ ప్రచారమొనర్చుచుండిరి. శ్రీగోవింద మిశ్రుల ఆగమనవార్త స్వప్నముద్వారా ఆలయాధికారికి మరి కొందరు భక్తులకు ఇదివరకె తెలియవచ్చియుండుటచే యధోచిత మర్యాదలతో "ఉళ్ళంగై కొండనయనార్ అను శైవనామముచే

పిలువబడు శ్రీ గోవిందమిశ్రులనుగొనిపోయి శ్రీ కాళహస్తి ఆలయబీగ ముద్రలు వారి స్వాధీనమొనర్చి వారియెడ భయ భక్తులతో మెలంగుచుండిరి. శ్రీ పెరుందేవితాయారును ఇది వరలో ప్రశంసింపబడిన వీరి విషయము కన్నులారగాంచి నిజ నాధుని జీవకారుణ్యమునకెంతయో మురియుచుండెను.

తొమ్మిదవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## పదియవ గుచ్ఛము.

శ్రీ వారణాసిక్షేత్రము నుండి యాదవప్రకాశకుడు శ్రీ కాంచీపురికి శిష్యసమేతుడై విచ్చేసి రామానుజుని మూలమున నాకుగల్గిన యపఖ్యాతి తొలగిపోయినది. అతడు వింధ్యాటవిని యే దుష్టమృగముల నోటనో పడిపోయియుండును. ఇక నిశ్చింతగ మరుగుపడిన నాయోగ్యత వెల్లడియగు కాలమీనాటి నుండి ఏర్పడినది యని లోలోన సంతసించుచుండెను. ఇట్లుండ ఒకనాడు కొందరు శిష్యులు పరుగుపరుగునవచ్చి రామానుజులను వరదరాజాలయమువద్ద వైష్ణవగోష్ఠిలో నుండజూచితిమని జెప్పిరి. ఆవార్త అశనిపాతమువలె తోప వ్యాకులితాంతఃకరణుడయ్యు" "అన్యధాచింతితం కార్యం దైవమన్యత్రచింతయేత్" (తానొకటి దలప దైవము మరొకటి దలచును) అనుకొని లోని అసూయను వెలికి జూపక శిష్యునియుదంతము తెలిసి సంతసించిన వానివలె నటించెను. శ్రీ రామానుజులును యాదవసూరి దుష్టస్వభావ

అవగతంబగుటచే మతమునకు బోవుటమాని త్రికాలములందును తమ తల్లిగారు చెప్పిన శ్రీ శ్రీ కరిగిరివరదుని కఅవుదీర సేవించు కొనుచు శ్రీ వైష్ణవగోష్ఠితో మైత్రిగల్పించుకొని వారియెడ భయ భక్తులతో మెలంగుచుండిరి. ఒకదినమున ఎప్పటివలె శ్రీ శ్రీ వరదరాజస్వామిని సేవింపబోవ అందొక భాగవతులు అంజలి బద్ధులై శ్రియఃపతిని హృద్యముగ స్తుతించుచుండిరి. వారుస్తుతిం చునపుడు శ్రీ కులశేఖరాళ్వారుల ముకుందమాలలోని ఒకశ్లోకార్థ మున కనుగుణముగ కన్పట్టిరి. ఆ శ్లోకమిది. "బద్ధేనాం జలినాన తేన శిరసాగాత్రైః స్సరోమోద్గమైః కంఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పాంబునా। నిత్యం త్వచ్చరణారవిందయుగళ ధ్యానా మృతా స్వాదినాం। అస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితం॥ ఇందుకు తార్పర్యము" తామరరేకులవంటి నేత్రములు గల కృష్ణా ; అంజలి బద్ధమగు హస్తములతోను, వంగిన శిరస్సు తోను. గుర్పాటుగల గాత్రముతోను, డగ్గుత్తికగల కంఠము తోను, ఆనందబాష్పములు జారుకన్నులతోను నిత్యము నీచరణ కమల ధ్యానమ నెడియ మృతమును పానము చేయుటయందు ధన్యతంగాంచు జీవనము గలుగుగాక. ఇట్టి భావమునుజూపు ఈ భాగవతోత్తముని వైఖరిగని శ్రీ రామానుజులు అచ్చెరువొంది వారితో సంభాషింప సమయమునకై నిరీక్షించుచుండిరి. శ్రీ కాంచీపూర్ణులని విఖ్యాతిగాంచిన ఈ భాగవత శిఖామణి శ్రియః పతి యపారకారుణ్య వాత్సల్య సౌశీల్యాది కల్యాణగుణములను వేమారు స్మరించి స్మరించి నోరారస్తుతించి అర్చకులొసంగు

తీర్థశఠకోప ప్రసాదములు స్వీకరించివచ్చి ముఖమంటపమున గూర్చుండిరి. శ్రీ రామానుజులును వారివలెనే తీర్థ. శఠకోప ప్రసాదములు భగవత్సన్నిధిని లభించి శ్రీ కాంచీపూర్ణుల చెంత అంజలి బద్ధులై నమ్రభావమున నిలుచుండిరి. శ్రీ కాంచీపూర్ణులు, శ్రీ రామానుజుల నెన్నిపర్యాయములో జూచియుందురుగాని పరిచయముండినదిగాదు. ఈ పర్యాయము శ్రీ శ్రీ కరిగిరివరదుని కరుణాకటాక్షమువా రిరువురిపై ప్రసరించి అన్యోన్య ప్రేమ విశ్వాసములు కల్పించి వృద్ధినొందించు కాలమువచ్చినటు లున్నది. వారిరువురికి ఈ క్రింది సంభాషణ జరిగినది. కాంచీపూర్ణులు శ్రీ రామాజులగని. సస్మితాననులై అయ్యా నిలుచుంటిరేల? రండు, కూర్చుండుడు మిమ్మ సన్నిధిలో ఎన్ని పర్యాయములో చూచుచున్నానుగాని పరిచయములేమి సంభాషించుట కవకాశము కల్గియుండలేదు మీదిగ్రామమేనా?

శ్రీరామా: కాదు, శ్రీ పెరుంబూదూరు.

శ్రీకాంచీ; శ్రీ అ సూరికేశవ దీక్షితులవారి సంబంధులా.

శ్రీరామా: వారు దాసుని తండ్రిగారే.

శ్రీకాంచీ: మీపేరు రామానుజులుగదా?

శ్రీరామా: భాగ్యము, వీనిని రామానుజదాసు రందురు.

శ్రీకాంచీ; ఇచ్చటికివచ్చి బహుకాలమైనదిగదూ?

శ్రీరామా; భాగ్యము, కొన్నిసంవత్సరముల నుండి ఇచ్చటనే విద్యాభ్యాస మొనర్చుచున్నాను.

శ్రీకాంచీ: ఎవరివద్ద?

శ్రీరామా: అద్వైత సన్యాసియగు శ్రీ యాదవప్రకాశులకడ

శ్రీకాంచీ; ఓహో అనాడు రాజపుత్రి నావేశించిన బ్రహ్మరాక్షసిని పారదోలి రాజదంపతులకు ప్రియంబొనరించినది నీవే యని ఇప్పుడు తెలియవచ్చుచున్నది. సంతోషము. మీ తండ్రిగారు ఇపుడు లేరుగదా ?

శ్రీరామా: వారు కొద్దికాలము క్రిందనే పరమపదించి యుండిరి. అప్పటినుండి సకుటుంబముగ ఇచ్చటనే చేరుకొని విద్యనభ్యసించుచుంటినిగాని, కారణాంతరములచే శ్రీ యాదవప్రకాశకులకడ చదువు మానవలసిన పరిస్థితు లేర్పడినవి.

శ్రీకాంచీ: కారణములు కర్ణాకర్ణి వినియున్నాను. అయినను మరి కొంతకాలమచ్చటనే సహనము వహించి యుండి సొంతముగ వారికడనుండు విద్యగ్రహించుట ముస్ముం దు మిక్కిలి సహాయకారిగా నుండకపోదని తలంతును.

శ్రీరామా: వారికిని దాసునికిని కొన్ని అంశములలో అభిప్రాయ భేదము లేర్పడి వారికి దాసునియెడ అనాదర భావమే గాక అసహ్యాభావముగూడ ఏర్పడినది.

శ్రీకాంచీ: అదియు నేనెరుంగుదును. దివ్యదంపతుల కటాక్షము మీపైన పరిపూర్ణముగ నున్నది గనుకనే అనేక విప త్పరంపరలు గడచి వచ్చితిరి. ఇక కొద్దికాలము ఓపి కతో అచ్చటనే గడపి రండు. దాన అద్వైతమత సార మవగతము చేసుకొనవచ్చును. స్వమత స్థాప

నకు పూర్వపక్ష సిద్ధాంతము తెలిసికొని యుండుటా వశ్యకముగదా ? శాస్త్రసమ్మతముగాదని తోచిన అంశములు నిర్దాక్షిణ్యముగ ఖండింపదగినవే.

శ్రీరామా; భాగ్యమే మీ ఆజ్ఞానుసారమే వర్తించెదను. ఈ దాసునియెడ పరిపూర్ణ కటాక్ష ముంచుడు. అని ప్రార్థించి శ్రీ కాంచీపూర్ణుల యాజ్ఞగొని శ్రీ రామానుజులు స్వగృహమున కరిగి జరిగిన సంగతులులన్నియు తల్లిగారికడ విన్నవించుకొనుచుండిరి. అపుడు యాదవసూరి శిష్యులిరువురు శ్రీ రామానుజులకడ కరుదెంచి "రామానుజా నీమొగమే ఇటీవల అపరూప మయ్యెనే. మనగురువుగారు నీవునికియే దెలియక కొన్నిదినములు దురంత చింతాక్రాంతులై యుండ నీవు ఎటులనో యీ గ్రామము చేరుకొంటివని విని నిన్నెప్పుడు జూతునాయని యువ్విళ్లూరు చున్నారు. మీతమ్మునివార్త నీకును తెలిసియే యుండును అతడు లేనికొరతకుతోడు నీవున్ను వారివద్దకు రాకపోవుటచే మరింత తపించుచున్నారు. నీకొరకెంతకాలము నిరీక్షించినను రాకుండుటచే నిన్నుతోడ్కొని రమ్మని మమ్ముల నంపిరి, శీఘ్రముగ మఠమునకు పయనముగమ్ము" అని పల్కిరి. శ్రీ కాంచీపూర్ణుల శ్రీ సూక్తులు అత్యంత శ్రేయోదాయకములని గ్రహించి యుండుటచే ఆనాటి గృహకృత్యభారము తల్లి కొప్ప

గించి శ్రీ రామానుజులు యాదవసూరి శిష్యులవెంట మఠమున కరిగి ఆయనను దర్శించిరి. శ్రీ రామానుజులకు తన అద్వైత సిద్ధాంతము రుచింపదని ఆయనకు తెలియక పోలేదుగాని తన దురుద్దేశ్యము బయటపడునను భీతిచే కొన్నిదినములు శ్రీ రామానుజులను తన వద్ద నుంచుకొని తన వర్తనచే తుదకు వారికి వెగటు బుట్టించి స్వయముగనే చదువు చాలించుకొని పోవునట్లు తగు నుపాయమూహించి యుండెను గాన శ్రీ రామానుజులను చూచిన తోడనే ఆదరమున దగ్గఱకు పిలచి కూర్చుండబెట్టి "రామానుజా నేను నీసౌకుమార్యమఱయజాలక కర్కశారణ్యముల నడిపించి నీకు చాలబాధ గల్గించితిని. నీవు గృహస్థ ధర్మముననుండిన వాడవు. కుటుంబమును విడిపించి, నావెంట తోడ్కొని పోవుట తగదని నాకు తోచినదిగాదు. నీసౌకుమార్యస్థితి తమ్ముడైనను నాకు తెల్పినవాడుగాడు. అట్లొకమారు తెల్పియుండిన నీవునాశిబికవెంటరా నదుపాయము గల్పించి యుందును. నీవు గోవిందునితోగాని, తక్కంగల శిష్యవర్గముతోగాని, చేరుకొనజాలకుండుటకు ఘోరాపదకు వింధ్యాటవిని చిక్కియుందువని యెంచి యింతింతయనరాని దుఃఖము ననుభవించుచుంటిని. నీయదృష్టవశమున ఆపదలు తప్పించుకొని యెటులనో ఇల్లు చేరుకొంటివి. నాయదృష్టవశమున

నిన్ను గుఱించిన యపఖ్యాతియు దుఃఖమును దీరినవి" యనెను అపుడు శ్రీ రామానుజులు "ఆర్యా! యిది యంతయు భగవంతుని విచిత్రవిలాసము. ఆయన యపారకృపయే అందరను కాపాడుచుండును. ఇం దెవరియుదృష్ట మేమున్నది" అని యధోచితముగా సమాధానమొసగి యప్పటివలె వేదాంతవిద్య నభ్యసించు చుండిరి. రామానుజుడు గొప్పమేధావి. అవతార పురుషుడు. మున్ముందు నాసిద్ధాంతము బాగుగ వ్యా పింపచేయగల సమర్థుడు. అని తోచుటచే కాబోలు యిదివఱకు వారియెడగల దురభిప్రాయమును మార్చు కొని యాదవసూరి అత్యంత ప్రేమవిశ్వాసములతో వారికి అద్వైత సిద్ధాంతమును బాగుగ బోధించు చుండెను. ఈ బోధభాష్యాంతము జరిగినది. శ్రీ రామానుజులు మాత్రము ఆయన బోధించు యేవిష యమునగాని, ఆక్షేపణచేయ నుండిరి. దీనినిబట్టి యితనికి స్వసిద్ధాంతమునందు తన మహిమ చేరుచి నానాటికి అభివృద్ధియగుచుండినదనియే యాదవప్రకాశ కులు నమ్మియుండెను. అభిప్రాయబేధములు సిద్ధాంత విషయమున గల్గినపుడు మోమాటము మాని ఖం డింపవలసినదేయని శ్రీ కాంచీపుపూర్ణులు చెప్పియుం డుటను మఱవలేదుగాని అట్లు గావించుటచేమున్ముందు యీ పూర్వపక్ష సిద్ధాంతమును సొంతముగ తెలిసి

కొన నవకాశము తప్పిపోవునేమోయని బోధ సాం
మగువరకు మిన్నకుండుటయే యుత్తమమనితో
"ఏపగిదివారు చెప్పిన యాఃగిదిం జెప్పగాని యిట్టిట
యాక్షేపింపదు రూపింపగ మిద్యలని విరూఢమనీషన్
అను ప్రహ్లాద పద్ధతియే వీరును కొంతకాలము అవల
బింపవలసి వచ్చెను.

పదియవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ప ద నొ కం డ వ గు చ్ఛ ము

శ్లో॥ విగాహేయామునం తీర్థం సాధుబృందావన స్థితం।
నిరస్త జిహ్మగస్పర్శే యత్రకృష్ణః కృతాదరః॥

పాఠకమహాశయులారా। భూలోక ప్రత్యక్షవైకుంఠమని ప్రసిద్ధిగాంచిన శ్రీరంగక్షేత్రమున బ్రహ్మవిద్యా పారంగతులలో నుత్తములని ప్రఖ్యాతిగాంచుటేగాక విద్వజ్జన కోలాహలాది విమత మత్తేభ పంచాననులై భగవద్బోధాయన సిద్ధాంత మాశ్రిత బృందమునకు బోధించుచు కాలక్షేపమొనర్చుచుండు నొక శ్రీ వైష్ణవ శిఖామణి శ్రీరంగనాథాలయ ముఖమంటపమున మృద్వాస్తరణ పీఠముపై వేంచేసియుండుటను భావనావశమున మనోనేత్ర మొక పర్యాయము తెరచి యవలోకించి కృతార్థులగుడు. వీరు శ్రీ శ్రీ శఠగోపయోగీంద్ర ద్రావిడ దివ్యప్రబంధము కాలగతి చేశిథిలమైనపుడు తమ యోగమహిమచే ఆ యోగీంద్రులను సాక్షాత్కారము చేసికొని ఆ దయామయుని యనుగ్రహముచే ద్రావిడ ప్రబంధ

మును సాంగసశిరస్కముగ పునరుద్ధారము చేసిన శ్రీమన్నాథ మునుల పౌత్రులు, అఖండతపోనిధియగు నీశ్వర మునిపుత్రులు బాల్యముననే తమ యపారపాండిత్యప్రభావమున చోళమండలా ధీశుని సభామధ్యంబున బాహ్యకుదృష్టి మతావలంబకులగు ప్రతి పక్షుల నెందఱనో వాదాహవమున జయించి పరమవైదిక సిద్ధాం తమును స్థాపించుటచే రాజదంపతులను మెప్పించిరి. ప్రభువు వీరి పాండిత్య విషయమై పట్టపురాణితో పందెము వేసికొనియుండి వీరు వాదమున గెలచిన అర్ధ రాజ్యమొసంగెదనని శపధము చేసికొని యుండి, శపధము మేరకు పండితుల నందరిని నోడించిన వీరికి అర్ధరాజ్య మొసంగెను. ఇంతేకాక వీరి అసదృశ పాండిత్య ప్రభావమున కాశ్చర్యము నొందిన రాజపత్ని వీరిని బహువిధ ముల సత్కరించి యెన్నైయాళవందారో (నన్నేలు కొనుటకు వేంచేసినారాయేమి) యని పల్కినదని చెప్పుదురు. అందుకు నిదర్శనముగ ఆనాటినుండి యీనాటివరకు వీరిని ఆళవందారని బిరుదనామముచే పిలుచువాడుక యేర్పడినదిగదా. వీరు సాక్షాత్ శ్రీమన్నారాయణునకు శ్రీవైకుంఠమున దివ్యరత్న సింహాస నము నర్పించు నిత్యకైంకర్యముసల్పు నిత్యసూరియని వీరి ప్రభావ మామూలాగ్రముగ నెఱింగిన మహానీయులు వేమారు ప్రశంసించుచుందురు. లోకోజ్జీవనార్థమై వీరు సిద్ధిత్ర యము, ఆగమప్రామాణ్యము, మాయావాదఖండనము, గీతార్థ సంగ్రహము స్తోత్రరత్నము ఇత్యాది గ్రంధములు రచించి యున్నారు. శ్రీరంగరాజానుగ్రహముచే జ్ఞానవైరాగ్యసంపత్తి

పూర్ణముగ లభించి యత్యాశ్రమము స్వీకరించి భగవద్గుణానుభము సల్పుచుండు ప్రపన్న శిరోమణి ఈ యామునముని శ్రీమద్రామానుజుల మేనమామగారగు శ్రీశైలపూర్ణులును. శ్రీ శ్రీ వరదరాజంతరంగ భక్తులగు కాంచీపూర్ణులును. మున్నగు భాగవతోత్తము లెందరో వీరి తిరువడిత్తామరల నాశ్రయించి యుండిరి. ఒకనాడు శ్రీ కాంచీపురి నుండి ఇరువురు శ్రీవైష్ణవులు శ్రీ శ్రీ నంబెరుమాళ్లను సేవించుకొనుటకు పూర్వము వీరి మఠమునకు విచ్చేసి నమోనమో యామునాయయా నాయనమోనమః యని సాష్టాంగ ప్రణామ మర్పించి యంజలబద్ధులై నిలుచుండిరి. శ్రీ యామునాచార్యులవారును వారిని సస్మితాననముచే సమాదరించి ఉచితస్థలమున కూర్చుండబెట్టి వారు శ్రీ కాంచీపురి నుండి వచ్చియుండుటం తెలిసికొని అచ్చట భగవద్భాగవత సన్నిధులలోని యోగక్షేమము లరసి సంతసించి "మాబోటివారు తెలసికొనదగిన విశేషాంసము లింకను ఏమైననున్న తెల్పుడని పల్కిరి. అందుకా స్వాములు, ఇంచుక యోచించి ఆర్యా శ్రీ పెరుంబూదూరు నుండి యొక శ్రీవైష్ణవ శిఖామణి సకుటుంబముగ శ్రీ కాంచీపురికి విచ్చేసి అందు విద్యాభ్యాస మొనర్చుచున్నాడు. వీరి విద్యాగురువు యాదవప్రకాశకులు అద్వైతయతి. పూర్వపక్ష సిద్ధాంతము నభ్యసింప వచ్చిన ఈ వైష్ణవుడు స్వసిద్ధాంత వ్యాప్తి కేమకీడు గావించునోయని శంకించి దుర్బోధకులొంగి వీరిని తుదముట్టింప నెంచియుండెను. ఒకానొక సమయమున, తీర్థయాత్రామిషచే నతనిని గంగలోఁద్రోయ, సమకట్టియుండ

శ్రీ వరదరాజానుగ్రహమున, గోరంత యాయువుండబట్టి వింధ్యాటవినుండి తప్పించుకొనివచ్చి మరల కాంచీపురిచేరుకొనెను.

యామునాచార్యులు:— "విరక్తుఁడగు సన్యాసికి నొక విద్యార్థిపై యిట్టి అసూయ జనించుటకుఁ బ్రబల కారణముండక పోదుకదా?"

శ్రీవైష్ణవులు:— "కారణములేకేమి ఒకప్పుడు చోళరాజపుత్రినిబట్టి చిరకాలము వేధించుచుండిన బ్రహ్మరాక్షసిని తాను గొప్ప మంత్రవేత్తయయ్యు దొలగింపజాలక పోవుటయు శిష్యుఁడు, రాజపుత్రి నొసటిపై తన శ్రీపాదరేణువు నుంచిన మాత్రముననే యది ధన్యోస్మియని దొలంగి బోవుటయు నీ యసూయానల మంకురించి ప్రజ్వలించుటకు హేతువైనది."

యామునాచార్యులు:— "పరశ్రేయము నోర్వజాలుని వారికిది సహజమేగాని యా శ్రీవైష్ణవుఁ డింకను యాదవసూరి యొద్దనే చదువుచున్నాడా"?

శ్రీవైష్ణవులు:— "విద్య మానుకొని యుండదలచెనుగాని దేవరవారి యంతేవాసి యగు శ్రీ కాంచీపూర్ణుల బలవంతముచే మరల యా యద్వైతి యొద్దనే చదువు కొనుచున్నాఁడు."

యామునాచార్యులు;— "కాంచీపూర్ణు లిందులో నేల జోక్యము కలుగజేసుకొనెను "?

శ్రీవైష్ణవులు:— "యాదవసూరికడ విద్యమాని కొంత కాలమీ శ్రీవైష్ణవుడు శ్రీ కాంచీపూర్ణుల యొద్దకు పలుమారు వచ్చు పోవు చుండుటనుబట్టి యితనిస్వభావము శ్రీ కాంచీపూర్ణులు

గ్రహించి యితనియెడ మిక్కిలి జాలిగొనిరి. ఇదిగాక భగవత్ బోధాయన సిద్ధాంతము వ్యాపింపచేయగల సమర్థుఁడితడని కాబోలు పూర్వపక్ష సిద్ధాంతమును నిర్విఘ్నముగా నభ్యసింప బలవంతపెట్టిరను ప్రతీతిగలదు."

యామునాచార్యులు:— "ఆ వైష్ణవుఁడంత సమర్థుఁడని మా కాంచీపూర్ణునకుగూడ తోచెనా ? (మరచితిని) ఆ శ్రీవైష్ణవుని పేరేమి?"

శ్రీవైష్ణవులు:— రామానుజులు ఒక కాంచీపూర్ణులకే గాదు, యా శ్రీవైష్ణవ శిఖామణిని జూచిన వారందరు నతని మేధాశక్తికి వాక్పటుత్వమునకు భగవద్భాగవత విధేయతకు నచ్చెరు వొందకపోరు."

యామునాచార్యులవారు ఆ యిరువురు శ్రీవైష్ణవులను యథోచితముగ నాదరించి పంపినపిదప తమ మనంబున "యీ శ్రీవైష్ణవుడు నా పూర్వాశ్రమ సంబంధియగు ఆ సూరికేశవ దీక్షితుల పుత్రుడై యుండనోపు" ఒకప్పుడు ఆయన పుత్రుడు శ్రీకాంచీపురిలోఁ జదువుచున్నాఁడని కర్ణాకర్ణి వినియుంటిని అయినను ప్రత్యక్షముగ జూచినగాని తెలియదు. సిద్ధాంతవ్యాప్తి కుపకరించు వారిని ముఖ్యముగ చూడవలసినదే" యని యనుకొనిరి. సన్నిధాన వర్తులతోఁ అనంతయేవాత్రహి సంభవంతి హసంతికాయామిన హన్యవాహః। అత్రైవ సంతోయది సంభవంతి హ్యత్రైవ లాభస్సర సీరుహాణాం॥ అనగా కుంపటిలోని నగ్ని కణములవలె నుండు బాహ్యకుదృష్టి మతావలంబకుల నడుమ

అరవిందమువంటి యిట్టి సమర్థుఁడుదయించుట డుత్తరోత్తర దివ్యారవింద సమృద్ధికై యేయుండనోపు మనమొక పర్యాయమా శ్రీవైష్ణవుని జూచివత్తము" అని కతిపయ శిష్యసమేతులై శ్రీ కాంచీపురికిఁ బయనమై సత్వరముగ నాపురిచేరి వేగవతీ తీరస్థ మగు నొక రమ్యోద్యానమున నిలచి నిజాగమనవార్త శ్రీ గజేంద్ర దాసా పరనామధేయముచే విఖ్యాతిగాంచి స్వకీయాభిమతచ్ఛాత్రు లలో ముఖ్యులగు శ్రీ కాంచీపూర్ణులకు దెలియఁబరచిరి. స్వాచా ర్యాగమనవార్త శ్రోత్రపేయముగవిని పెన్నిధిగన్న పేద చందం బున వారి నెదుర్కొని దర్శించి శ్రీ కాంచీపూర్ణులు ప్రదక్షిణ ప్రణామము లర్పింప శ్రీ యామునమునియు స్వకీయ కరుణా కటాక్షము శిష్యునిపై బరపి నిజకోమల కరపల్లవముచే శిష్యుని శిరంబుదువ్వి మందమధురాలాపముల కుశల ప్రశ్నగావించి శిష్య ప్రార్థనచే నిజాశ్రిత సాత్వికబృంద సహితులై పురవరంబుఁజొచ్చి శ్రీ వరదరాజ దివ్యగోపుర పురోభాగంబున నొక మండపమున విశ్రమించిరి. వీరి యాగమన వార్తవిని యుండిన శ్రీ వరద రాజాలయాధికారియు దక్కుంగల కైంకర్య నిర్వాహకులును శ్రీవైష్ణవగోష్ఠితోడను, మంగళవాద్యములతోడను శ్రీ శఠారిని వేంచేపు చేసికొని వారి నెదుర్కొనిరి. శ్రీ ఆళవందారు శ్రీ శఠారికిని శ్రీవైష్ణవగోష్ఠికిని ప్రక్రమప్రణామము లర్పించి వారర్పించు మర్యాదల శిరసావహించి కోవెలలోనికి విచ్చేసి శ్రీ పెరిందేవీ సహిత కరిగిరివరదుని కన్నుల కరువుదీర సేవించి కరిగిరికి వాయువ్య భాగమున నుండు నొక మండపమున్న

చేరువ నొక వల్మీకమును అందొక అనంతమూర్తి అర్చావిగ్రహమునుకని ఆ దివ్యమూర్తిని సేవించుకొని ఆ మండపమున విశ్రమించియుండిరి. శ్రీ కాంచీపూర్ణులును తక్కుంగల యాశ్రిత బృందమును శ్రీ యామునమునులద్వారా తెలియదగిన ఆధ్యాత్మిక విషయము లెన్నియో తెలిసికొనుచుండిరి. అత్తరి శ్రీ యామున మునులు శ్రీ రామానుజులను గురించి తెలియదగిన అంశములు శ్రీ కాంచీపూర్ణులద్వారా తెలిసికొని అమందానంద మానసులై యా శ్రీ వైష్ణవ శిఖామణిని తమ సన్నిధికి పిలిపింపుమని పలుకు చుండ బహు శిష్య పరివృతుడై యొక అద్వైతయతి రెండవ ప్రాకారమునకు ప్రదక్షిణముగ వచ్చుచుండుట నవలోకించిరి. శ్రీ కాంచీపూర్ణు లపుడు శ్రీ యామునమునులతో "స్వామీ వెదక పోవు తీగెచేతికే దగిలినట్లైనది. ఆ శిష్యసంఘముతో బోవుచుండు యతినిగనుడు ఆయనయే శ్రీ యాదవప్రకాశకుడు" అనగనే శ్రీ యామునమునులు అందు శ్రీ రామానుజులను గనుకొన నత్యుత్సాహముతో కొన్ని యడుగులు ముందుకు రాగనే శ్రీ యాదవ ప్రకాశకుని వెనుక నగపడు నా శ్రీ వైష్ణవుడే శ్రీ రామానుజులని శ్రీ కాంచీపూర్ణులనిరి. శ్రియఃపతికి నివేదనకాదగు సమయ మగుటచే కాబోలు శ్రీ యాదవప్రకాశకు లించుకకాల మాగవలసి వచ్చినది. ఇట్టి తరుణమున శ్రీమద్యామున మునులు శ్రీ రామానుజులను దూరము నుండియైనను ఆశదీర జూచనవకాశము లభించెను. బాలభాస్కర ప్రభాభాసమానము ఖారవిందమును, అరవిందపత్రములను బోలిన యక్షియుగళమును తప్తతపనీయ

కణికోపమాన శ్రీచూర్ణరేఖాపమంచి తాంతరాళ సుధాదవళ మృత్స్నాంచిత చిదోర్ధ్వపుండ్రాంకిత సమున్నతలలాటమును తులసీ నళినాక్షమాలాలంకృత విశాలవక్షస్థలమును. పరిఘోప మానను, వృత్తాయత ఆజానుబాహుయుగళంబును, శ్రీ యామున గురువర్యుని యానందాంబుధి నోలలాడించెను. ఇట్లు శ్రీ యామున మునీంద్రులు శ్రీ రామానుజులపై తమ సాంద్రసాదర కటాక్షములు బరపి వారి ఆకారమునుగని ఆనందించి వీరు మున్ముందు పరమవైదిక సిద్ధాంత ప్రవర్తకాచార్యులుగాగ లందు లకై శ్రీ శ్రీ వరదరాజ పెరుమాళ్లను "యస్యప్రసాదకలయా బధి రశ్శృణోతిపంగుః ప్రథావతిజవేనచ వక్తిమూకః। అంధః ప్రప శ్యతిసుతం లభతేచ వంధ్యాతం దేవదేవ వరదం శరణం గతోస్మి॥ అనగా ఎవ్వని యనుగ్రహముచే చెవిటివాడు బాగుగ వినగల్గునో, కుంటివాడు కాళ్లులభించి నడవగల్గునో, మూగివాడు త్వరగ మాట లాడగల్గునో అట్టి అఘటినఘటి నాసమర్థుడగు శ్రీ శ్రీ దేవరాజ స్వామిని వరణుజొచ్చినవాడనైతిని" అనుభావముగల శ్లోకముచే స్తుతించి శరణుజొచ్చి భగవత్సంకల్పము అన్యథా ఏర్పడియుం డుటచే కాబోలు శ్రీ రామానుజుల నావిమతబృందము నుండి తప్పింప నూహ స్ఫురింపక శ్రీ శ్రీ హస్తిగిరీశునికి తిరువాలవట్టి కైంకర్యమునల్ప శ్రీకాంచీపూర్ణ లనువియమించి శిష్యబృందముతో గూడ శ్రీ కాంచీపురివిడిచి శ్రీరంగమునకువచ్చి స్వమఠంబు చేరు కొనిరి. పదనొకండవ గుచ్ఛము—సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## పదిరెండవ గుచ్ఛము

శ్రీమద్యామున మునులు శ్రీరంగమున స్వపదాశ్రితులకు తిరువాయమొళి కాలక్షేపమను గ్రహించుతరి తామసపురాణ ప్రశంసలో ప్రపన్నులకు అన్యదేవతాపరమగు లింగపురాణేత్యాది తామసపురాణములు పఠింప నర్హంబులుగావని వక్కాణించుచు తమ యనంతరము మీపరమవైదిక సిద్ధాంత వ్యాప్తి కడ్డుదగులు దుర్మత ప్రచారములు రూపుమాపువారు తామిదివరకు కాంచీపురిలో కాటాక్షించిన శ్రీరామానుజులేయనియు, వారిని తమ యనంతరము దర్శనస్థాపనాచార్యులుగ నొనర్ప శ్రీ శ్రీ కరిగిరి వరదుని శరణుజొచ్చియున్నాడను ఆ దయామయుడు నా విమలాశయమును విఫలమొనర్పడనియు, మనంబున తలపోయుచుండిరి. ఇక కాంచీపురిలో యాదవప్రకాశకులకడ శ్రీ కాంచీపూర్ణులు నియమించిన ప్రకారము శ్రీ రామానుజులు భాష్యాంతము గ్రంధము వ్యాఖ్యాన సహితముగ చదివి ముగించినవెనుక గురువు

గారితో "ఆర్యా మీరు బోధించు విషయములో నాకు పెక్కు స్థలముల సంశయములు వొడముచుండినవి. గ్రంధము సాంః ముగ సేవించిన వెనుక సంశయములు మీకడదీర్చుకొననెంచి ఇంతకాలము వేచియుంటిని. నేటికి భాష్యాంత మద్వైత బోధ మైనదిగదా ? కొన్ని సంశయములడిగి విమర్శించుకొన నవకాశ మిచ్చెదరా" యనిరి. యాదవప్రకాశకులు "పూరకుండుటనుబట్టి సంశయ రహితుడవై గ్రంధమును సేవించుచుంటివనియే యెంచి యుంటిని. అయినను ఇపుడు మించిపోయినదేమియులేదు. అడుగదలచిన వేవో యడుగుమనిరి. అపుడు గురుశిష్యులిరువు రికి నీక్రింది సంభాషణ జరిగినది.

రామా; భగవంతుని తెలిసికొనుటకు ప్రమాణమెద్ది ?

యాద; వేదమే ప్రమాణము.

రామా: వేదమెవరిచే తెల్పబడినది ?

యాద: అజ్ఞునివలె అడిగెదవేల. భగవంతుడుతప్ప మరెవరు తెల్పగలరు ?

రామా: ఆయనదాని నెందుకు తెల్పెను ?

యాద; జీవుడు బాగుపడుటకు ?

రామా; బాగుపడుట యనగా ?

యాద: తన్నుతాను తెలిసికొనుట ?

రామా: తానెట్టి వాడని తెలిసికొనుట ?

యాద: జరామరణ శూన్యుడు సచ్చిదానంద స్వరూపుడు. రూప నామక్రియా రహితుడు, సర్వవ్యాపకుడు.

రామా: జీవుడిట్టివాడైన భగవంతుడెట్టివాడు ?

యాద: భగవంతుడన్నను, జీవుడన్నను ఒకడే. జీవబ్రిహ్మ భేదములు బ్రిహ్మమునందవస్థాభేదములు మాత్రిమే.

రామా; అవస్థాభేదములన్న ?

యాద; అజ్ఞానావస్థలో జీవుడని వ్యవహరింపబడు చుండును. జ్ఞానావస్థలో బ్రిహ్మమని వ్యవహరింపబడు చుండును.

రామా: భగవంతునికిగూడ అజ్ఞానావస్థయున్నదా ? అటులైన భగవంతుని కజ్ఞానావస్థ ఎట్లు వొచ్చినది.

యాత; అది ఆయనకు స్వభావసిద్ధము. ఆకసమున మొబ్బు లావరించుటలేదా, అటులనే.

రామా: అజ్ఞానమనగానేమి ?

యాద; అజ్ఞానమనగా వస్తుయాధాత్మ్య జ్ఞానములేకపోవుట.

రామా:అజ్ఞానావస్థయు స్వభావముగగలవాడు భగవంతుడన్నపుడు, జ్ఞానావస్థకు ఆయన వొచ్చువిధమెట్లు? ఇంతయును అట్టి అజ్ఞానావస్థలో జ్ఞానావస్థ అనునదొకటి కలదని తెలియ వచ్చుటెట్లు ? యస్సర్వజ్ఞ స్సర్వవిత్ పరాశ్యశక్తిర్వివిధైః శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియాచ అను శ్రుతి పరమాత్మకు అజ్ఞానమున్నట్టు లెచ్చటను తెల్పియుండలేదు.

యాద: సామాన్యులకు అజ్ఞానమునదొకటి వున్నదియని తెలియక పోవొచ్చునుగాని భగవంతునికేల తెలియదు. సర్వజ్ఞుడు భగవంతుడని నీవే చెప్పితివే. అదిగాక సర్వంఖల్విదం బ్రిహ్మ. నేహనానాస్తి కించన అను

శ్రుతిని విమర్శించిచూడ జ్ఞానముగాని, అజ్ఞానముగాని సర్వము భగవత్స్వరూపమే ఆయనతప్ప మరెద్దియున్ను లేదని తెలియవొచ్చుచున్నది.

రామా: సర్వం ఖల్విదం బ్రహ్మ అనుచో చేతనాచేతన విశిష్ట సమస్త ప్రపంచము పరబ్రహ్మ అంతర్యామిగాగలది యని యర్థము. నేహనానాస్తికించన అనుచో ఆయన అంతర్యామగాలేని దేదియు లేదని యర్థము. ఆయన సమానాధిక రహితుడగుటచే అంతయు ఆయనకు అధే యత్వ విధేయత్వ, శేషత్వములచే అంతర్యామియు త్రివిధ కారణభూతుడును అగు ఆయన నియమనమునకు లోబడి యుండును. ఇదిగాక మీరన్నట్లు బ్రహ్మముతప్ప మరె ద్దియు లేదని నపుడు సామాన్యులెవరు? దేవుడని వ్యవ హరింపబడు వాడెవడు?

యాద: కొంటె ప్రశ్నలకు యుక్తియుక్త సమాధానములు బాగానేర్చుకొంటివి. నీమూలమున శిష్యులందఱు చెడుచు న్నారు. సర్వంఖల్విదం బ్రహ్మ, నేహనానాస్తి కించన అను శ్రుతివాక్యములకు నీవు బొత్తిగా అర్థమెఱుంగవు. ఇదిగాక ఏకమేవా ద్వితీయం అను మహావాక్యమునుబట్టి జూచినను, బ్రహ్మముదప్ప రెండవది లేదనియే యర్థము జెప్పదగును. ఇట్టి స్థితిలో సామాన్యులెవరను ప్రశ్నకు జీవరూపమున బహువిధముగా గానంబడు బ్రహ్మమే యని చెప్పకతీరదు.

రామా: 1 నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం ఏకోబహూనాం యోవిధదాతికామాన్, నిత్యులకు నిత్యుడై, చేతనులకు పరమచేతనుడై, బహుమందికి తానొక్కడై, నియామకుడై కామాది పురుషార్థముల నెవ్వడొసంగుచున్నాడొ.

2 క్షరాత్మానా వీశతేదేవఏకః ప్రకృతిని, జీవుని, ఒకడు (దేవుడు శాశించుచున్నాడు)

3 అస్మాన్మాయా సృజితేవిశ్వమేతత్ తస్మిన్శ్చాన్యో మాయయాసన్నిరుద్ధః (శ్వేత 4-9) ఈ ప్రకృతిచేత నీ ప్రపంచమును (దేవుడు) సృజించుచున్నాడు. జీవుడగు మరియొకడు మాయచే కట్టుబడి యున్నాడు.

4 "తయోరన్యః పిప్పలిం స్వాద్యత్తి। అనశ్నన్ అన్యో అభిచాకశీతి" అనగా ఈ యిరువురిలో ఒకడు (జీవుడు) తియ్యని పిప్పలమును (కర్మఫలమును) తినుచున్నాడు. మరియొకడు (దేవుడు) తిననివాడై అంతయును ప్రకాశించుచున్నాడు. (ముండ 3-1-2)

5 భోక్తాభోగ్యం పేరితారంచమత్వా (శ్వేత-5) భోగించువానిని (ఆత్మను) భోగ్యం (ప్రకృతిని) ప్రేరేపించు వానిని (ఈశ్వరుని) తెలుసుకొని, ఇత్యాది బహుశ్రుతులు జీవపరమాత్ములకు భేదము తెల్పుచుండలేదా? ఇట్లుండ బ్రహ్మము భ్రమించి తానే జీవుడుగా నున్నాడనియు, సర్వంఖల్విదం బ్రహ్మ, నేహనానాస్తికించిన అను శ్రుతివచనాను సారము బ్రహ్మవ్యతిరిక్త పదార్థము

కించిదపిలేదనియుచెప్పువాద మెంతమాత్రమును తృప్తి కరముగలేదు. ఆయన సమానాధికరహితుడని చెప్ప దగును. అని నిర్దాక్షిణ్యమున పల్కిరి.

శిష్యులలో కొందరు స్వామీ రామానుజులు పల్కిన శ్రుత్యర్థమునుబట్టి జీవపరమాత్మలు భిన్నులనియే తెలియ వచ్చుచున్నది. మీరు జెప్పినటుల దేవుడే బ్రమించిన ఆ భ్రమ అతనికెట్లు తొలగిపోవును? అని యడిగిరి.

యాద; (మొగము చిట్లించుకొని) మీరందరు రానురాను పెదవికి మించిన పల్లువలె మారితిరి. సాధన చతుష్టయసంపత్తి లేనివారికి బ్రహ్మవిద్య పట్టువడదు. గనుకనే మీకీ బ్రహ్మవిద్య అంటు ప్రాప్తిలేదు. మీ ఇచ్చవొచ్చిన చోటికి పొండు. నాబోధయందు ప్రతిపత్తిలేని వారిక్కడ నడుగిడ గూడదని నిర్ధాక్షిణ్యముగ పలికి కోపమున దిగ్గునలేచి లోనికరిగెను. గురువుగారి ఆజ్ఞగొని వెళ్లుటకుగాని వారిని క్షమాపణ వేడుకొనుటకుగాని ఆయన అవకాశమివ్వనందుచే మరికొంతకాలము వారికొరకై నిరీక్షించి తుదకిక ప్రయోజనము లేదనుకొని, సాంధ్యకృత్యములుదీర్ప సమయమగుటచే శ్రీ రామానుజులును వీరియెడబద్ధసఖ్యముగల మరికొందఱును, మార్గమధ్యమున ఆనాటి విపరీతపరిస్థితులను గురించి మందలించుకొని వ్యాకులపడుచు మరుదినంబుననైనను మఠమునకుబోయి యాదవసూరిని సుముఖునింజేసుకొన బ్రయో

జనముండదని నిర్ధారణ జేసికొని తమతమనివాసముల కరిగిరి.

పదిరెండవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజ ప్రభావకల్పకము.

## పదమూడవ గుచ్ఛము.

---

శ్రీ రామానుజులు నిజమందిరమునకు విచ్చేసి ఆనాడు శ్రీ యాదవసూరి మఠమున జరిగిన యావదంశములను తల్లిగారి కడ తెల్పిరి. అపుడామె నాయనా నీవు శ్రీ కాంచీపూర్ణులకడ నుండి వారి పురుషకారమున శ్రీ కరిగిరివరదుని కైంకర్యమొనర్చు చుండుటే మిక్కిలి శ్రేయోదాయకము. పూర్వపక్ష సిద్ధాంతము శ్రీ కాంచీపూర్ణుల వియమనామసారము సాంతమున గ్రహించి తివిగదా? ఇక యాదవసూరికడ నేర్వవలసినదెద్దియు లేనపుడు కాంచీపూర్ణుల యందనుండుటే మంచిదియని పల్కెను. శ్రీ రామానుజులు అమృతోప మానమగు మాతృవాక్యములు గ్రహించి ఆమె నియమనము ప్రకారము శ్రీ కాంచీపూర్ణుల సన్నిధిజేరి మఠమున జరిగిన వాగ్వాదము, తల్లిగారి హితబోధ విజ్ఞాపనం బొనర్చిరి. వారును శ్రీ రామానుజులకు ఆధ్యాత్మజ్ఞాన ముపదేశించుచుండిరి. దాసునికేదేని కైంకర్యము నియమింపు

మని శ్రీ రామానుజులు ప్రార్థింప వ్యాధరూపమున మీకు శ్రియః పతులు వింద్యాటివిని దర్శనమొసంగి మీరు భగవధ్యాన నిమగ్నులై యున్నతరి మీకు తెలియకుండగనే యీగ్రామపరిసరమున నుండు శాలికణర్ యను జలాశయ సమీపమున జేర్చిరిగదా? ఆ బావితీర్థమే మీరును దినము శ్రీ శ్రీ వరదరాజస్వామివారి తిరువంజనము మున్నగు కైంకర్యముల కర్పించుచుండుడు. దాన మీకు మున్ముందు అభ్యుదయము కల్గుననిబల్క వారటులనే యొనర్చుచుండిరి. ఇట్లు కొన్నిదినంబులు గడువ తమ ఆచార్యులగు శ్రీమద్యామున మునులు తమకేకాంతముగ నుగ్గడించి పోయిన శ్రీ సూక్తులు జ్ఞాపకమురాగా శ్రీ రామానుజులవారి నొకనాడు ఫలపుష్పాపూజాద్రవ్యములతో భగవత్సన్నిధికి గొనిపోయి యిరువురును శ్రియఃపతికి ప్రదక్షిణ ప్రణామాదులర్పించి పూజించి, అర్చకులొసంగు తీర్థ, శఠగోప ప్రసాదములు స్వీకరించిన వెనుక శ్రీ కాంచీపూర్ణులు, శ్రీమద్రామానుజులను శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనాచార్యునిగ నొనర్ప శ్రియఃపతిని ప్రార్థించిరి. అందుకంగీకార సూచకముగ స్వామివారి కలంకరింపబడిన సుమదామములోని కొన్నిపువ్వులు శ్రీ శఠారిని వేంచేపు చేసియుండెడు తట్టలో పడెను. ఆసమయమున మన కాంచీపూర్ణులనుభవించిన యానందము వర్ణనాతీతము. భగవదాజ్ఞగొని యిరువురును సన్నిధినుండి విచ్చేసిరి. ఆనాడు మొదలు తమ యాచార్యులను గ్రహించిన యమూల్యవిషయము లెన్నియో శ్రీ రామానుజుల కనుగ్రహించుచుండిరి. ఎన్ని అమూల్యాంశములు

విన్నను పంచసంస్కార సంపత్తి లేనిదే అవివాహితయగు కన్యక యనంగ తంత్రము లెఱింగినట్లే యుండునని దలంచి శ్రీ కాంచీపూర్ణులతో ఆర్యా యీదాసునకు శ్రీ శ్రీ వరదరాజస్వామినుండియే కొన్ని శ్రీసూక్తులు వినవచ్చు వాదముచున్నది. వారికి మీరు ప్రాణసమానులు వారిసన్నిధిని ఈ దాసుని విజ్ఞాపన యొందు విన్నవింప మీకన్నను కూర్చువారు గానరారు అని యింకను ఏమియో విజ్ఞాపనంబొనర్పబోవ, శ్రీ కాంచీపూర్ణులు "అవశ్యము భగవత్సన్నిధిలో విన్నవించెదను మీ అభిప్రాయము తెల్పుడు." అననపుడు శ్రీ రామానుజులు దేవరవారు ప్రసాదించుచుండు శ్రీసూక్తులపై దాసునికి పూర్ణవిశ్వాసమున్నను మున్ముందు లోక సామాన్యమునకు విశ్వాసము దృఢపడుటకుగానే కేవలము భగవన్ముఖముగానే కొన్ని శ్రీసూక్తులు తెలిసికొనవలసినట్లేర్పడినది. ఆ అంశము లెవ్వియన పరతత్వమెద్ది (౧) జీవపరమాత్మలు బిన్నమా, అభిన్నమా (౨) జీవులు పరమాత్మకన్నను భిన్నమగు నెడల జీవులతిశీఘ్రమున పరమాత్మ దివ్యసాన్నిధ్యము లభించి సుఖింప నుపాయమెద్ది (౩) దేహావసానమున భగవన్నామస్మరణ సాయుజ్యప్రాప్తి కుండియే తీరవలెనా? (౪) సాయుజ్యప్రాప్తి జీవుల కెప్పుడు కల్గును (౫) ఈ అయిదు అంశములకున్ను భగవానుల అభిప్రాయమున్ను, దాసుడు దేవరవారి సన్నిధిలో పంచసంస్కార సంపత్తి లభింపనియ మనమున్ను లభించి రండని ప్రార్థించిరి. అపుడు శ్రీ కాంచీపూర్ణులు "అయ్యా మీరడుగుమన్న యైదు అంశములను అడుగుదునుగాని పంచసం

స్కార విషయమై యడుగుటమాత్రముచితముగాదు. ఏలయన చతుర్థవర్ణుడనగు నాకు అనాదిసిద్ధమగు వర్ణాశ్రమ ధర్మపేతువు దెంచి భగవన్నిగ్రహమునకు పాత్రుడనుగా బూనుటతి సాహసము. మా ఆచార్యులును యిందు కంగీకరింపరు." శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞాయస్తాముల్లం ఘ్యవర్తతే।ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీమద్భక్తోపిన వైష్ణవః(శ్రుతిస్మృతులు నాయొక్కయాజ్ఞ వాటినతిక్రమించి నడచుకొనునట్టివాడు నాయాజ్ఞ నుల్లంఘించినవాడగును. అందుచే నావిషయమై ద్రోహముచేసినవాడు. అట్టివాడు నన్ను భక్తిచే ప్రేమించినను నేను నావానినిగా వానిని తలంపను.) అనియు "మనీషీవైదికాచారం మనసాపి నలంఘయేత్" (బుద్ధిమంతుడు వైదికాచారమును మనసానైనను అతిక్రమింప తలంపగూడదు) అని భగవంతుడే అనుగ్రహించి యుండుటచేత పంచసంస్కారవిషయమై మీ అభిప్రాయమును భగవత్సన్నిధిలో విజ్ఞాపనం బొనర్పజాలను అనిరి. అటులైన దాసుడు మరెచ్చట ఆశ్రయించి పంచసంస్కారము లభింపవలసియుండనో తెలిసికొనుడు అని శ్రీ రామానుజులు విజ్ఞాపనం బొనర్పగనే తప్పక తెలిసికొని చెప్పెదను అనుచు అదిగో గంట మ్రోగుచున్నది. పెరుమాళ్లసేవాకాలము కాబోలు. సన్నిధికి పోదమురండు అని శ్రీ కాంచీపూర్ణులు శ్రీ రామానుజులను వెంటగొని సన్నిధిలోని కరిగిరి. పాఠకమహాశయులారా! మనము మానసిక ప్రయాణముచే శ్రీరంగక్షేత్రమున వెలయు ఆచార్యశిరోమణి యనందగు శ్రీ శ్రీ యామునాచార్యులవారిని మరియొక పర్యాయము దర్శించి

కృతార్థులగుదమురండు. మన మనోరథము సంకల్పహయములచే నతిశీఘ్రముగ లాగబడుచుండుటచేతనే ప్రణమవిమానము గోచరమగుటయు ప్రత్యక్షవైకుంఠమునకొచ్చి చేరుకొనగల్గుటయు నేర్పడినది. అదిగో ఆయాస్థానమంటపమున శ్రీ శ్రీ యామునాచార్యులవారు మృద్వాస్తరణోపవిష్టులై వేంచేసి యుండుట భావనేత్రమునకు గోచరమగుచుండలేదా! శ్రీమద్రామాయణములోని కొన్ని శ్రీసూక్తు లాశ్రిత బృందమున కనుగ్రహించుచు శ్రీ శఠగోపయోగీంద్రుల తిరువాయ మొనలోని కొన్ని పాశురములను సమయోచితముగ నీ శ్రీసూక్తులకు సమన్వయమొనర్చుచు చున్నారు. కాలక్షేపముబహుభోగ్యముగా నుండుటను అంతేవాసుల హసన్ముఖములే చెప్పకయజెప్పుచున్నవి. శ్రీమద్రామాయణమున నయోధ్యాకాండమున శ్రీ వసిష్ఠసుమంత్రులు శ్రీరామనిర్దిష్ట కోసలరాజ్యమును పరిపాలింప శ్రీరామానుజులను (భరతులను) తోడితేర చారులనంపు సందర్భము తటస్థించెను. అత్తరి యాకస్మికముగ శ్రీమద్యామున మునులు శ్రీ కోశమున కంజలి జోడించి యించుక తడవునిమీలిత నేత్రులై కన్నులువిచ్చి రామానుజులను గురించిన విశేషాంశము లేమైన నిటీవల మరల దెలియ వచ్చినవాయని అంతేవాసుల నడిగిరి. శ్రీ కాంచీపురి నుండి యాత్రార్థమై వచ్చియుండి శ్రీమద్యామున మునులను సేవించుకొనవచ్చి కాలక్షేపము వినుచుండిన శ్రీవైష్ణవులిరువురు అంజలి జోడించి శ్రీ రామానుజులు యాదవప్రకాశకునికడ విద్యమానుకొని శ్రీ కాంచీపూర్ణుల సన్నిధిని చేఱుకొని వారు నియమించిన

శ్రీ కరిగిరీశుని తీర్థకైంకర్యమొనర్చుచు భగవద్భాగవత గుణాను భవ మొనర్చుచున్నారని విన్నవించిరి. శ్రీ యామున మునీంద్రు లావార్తవిని సంతసించి యా శ్రీవైష్ణవుల నిరువురిని సుచితరీతి సత్కరించి పంపి శ్రీ పరాంకుశదాసులంగని మీరు శ్రీ కాంచీపురి కరిగి శ్రీ రామానుజులకు పంచసంస్కారాది హితవులన్నియు గావించి రండని బల్కగనే వారు ధన్యోస్మియని స్వాచార్యాజ్ఞ శిరసావహించి మఱుదినమే శ్రీ కాంచీపురి కరిగిరి. ఇట కాంచీ పురి నొకదినము శ్రీ రామానుజులు ప్రాతఃకాల కృత్యములు దీర్చుకొని శ్రీ వరదరాజస్వామిని దర్శించి యాస్థానమండపమున శ్రీ కాంచీపూర్ణుల సన్నిధి కరిగి వినయవినమితోత్తమాంగులై యంజలి జోడించి తామదివఱకు విన్నవించుకొని యుండిన విషయములకు భగవానుల యభిప్రాయము దెలియవొచ్చినదా యని యడిగిరి. అందుకు శ్రీ కాంచీపూర్ణులు స్మితాననులై యా విషయమే యిప్పుడు మీకు దెలుపదలచియుండ మీరేయడిగితిరి. నిన్ననే మీరడిగిన యంశములకు భగవాన్లు తగిన సమాధాన మనుగ్రహించిరి. "అహమేవపరం తత్వం, దర్శనం బేధమేవచ, ఉపాయేషు ప్రపత్తిస్స్యాత్, అంతిమస్మరణ వర్జితం దేహావసానే మోక్షస్స్యాత్, పూర్ణాచార్యం సమాశ్రియ (నేనేపరతత్వము, జీవ పరమాత్మలు భిన్నము, నన్నుపొందుటకు ఉపాయము ప్రపత్తి, అంతిమస్మరణ యుండవలసినవిధి యేమిన్నిలేదు. దేహాంతమందే ముక్తి, మహాపూర్ణుల నాశ్రయించవలసినది.) అను సూక్తులను గ్రహించిరి. గావున మీరు శీఘ్రముగ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి

కరిగి అందు నాకు సహాధ్యాయులును, మహాభాగవతోత్తములును, అస్మదాచార్య యంతేరాసియు నగు శ్రీ పరాంకుశ దాసులను నామాంతరముగల శ్రీ మహాపూర్ణుల నాశ్రయించి సుఖింపుడు అని పల్కిరి. శ్రీ రామానుజులు ధన్యుడను, కృతజ్ఞుడనని వారి శ్రీ సూక్తులు శిరసావహించి వారి యాజ్ఞగాని, శ్రీ కరిగిరివరదుని ప్రార్థించుచు మఱుదినమే శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి పయన మైరి. పాఠకమహాశయులారా ! గమనించితిరా శ్రీ రామానుజుల వారి కుండు ప్రాప్యత్వర యెట్టిదో ? కాటికికాళ్లు చాచుకొని యుండు వారు నైతము ప్రపంచమస్థిరమని దెలసియు, అంగనాపుత్రగేహా రామాదుల మూలమున సుఖింపగోరి కన్నవారి నాశ్రయించుచు కాలముద్రోసి పుచ్చుచుందురుగదా ! "రక్షాపేక్ష మపేక్షతే" (ఎవరు నన్నురక్షింపమని గోరుదురా) యని రక్షింప నెదురు చూచుచుండు శ్రియఃపతిని అనన్యభక్తిచే నాశ్రయించు వారరుదు గదా ? ముముక్షువుల కాదర్శప్రాయులగుటచే గాబోవు పురుషా ర్థమునకు మురియుచు శ్రీ కరిగిరివరదుని కారుణ్యాది కళ్యాణ గుణములను స్మరించుచు శీతవాతాతపములు సరకుసేయక శ్రీ రామానుజులు దూరప్రయాణము సాహసమున జేయుచున్నారు. పగలేగాక రేయంతయు నడచి నడచి తుదకొకనాటి యుదయము నకు నొకానొక పురపరిసర తటాకమువద్దకువచ్చి చేరుకొని చెరువు చేరువనొక శీతలతరుచ్ఛాయ నించుక విశ్రమించి గమనశ్రమ బాపుకొనుచుండిరి. వీరిందు జేఱుటకు మునుపే యెందఱో భూసురులు కాల్యకృత్యములు దీర్చుకొనుచుండిరి. కొందరు

శిరోవేష్టములతో జందెము చెవికిజుట్టి లోలోకాభిరామముగ మాటలాడుకొనుచు దంతధావన మొనర్చుకొనుచుండిరి. కొందఱు ధోవతులు శుభ్రముగ నుతుకుకొనుచుండిరి. ఒక భూసురుడు ద్వాదశోర్ధ్వపుండ్రాలంకృతుడై మంత్రరత్నానుసంధానమొనర్చు కొనుచు శ్రియఃపతి తిరుమంజనార్థమై కాబోలు రజితకలశముతో ఆ తటాకమునుండి తీర్థముగొనిపోవు చుండుటనుగని శ్రీ రామా నుజులు వినయమున అంజలి జోడించి స్వామీ యీ గ్రామము పేరెయ్యదియని యడుగ శ్రీ మధురాంతకమనిజెప్పి యఱిగెను. ఓహో చక్రవర్తి తిరుమఘనార్లు అర్చామూర్తియై వేంచేసియుండు శ్రీ మధురాంతకమా యిదియని యానందించుచు చెరువులోనికి దిగి, స్నానసంధ్యాద్యనుష్ఠానములు దీర్చుకొని భగవత్సన్నిధికి బోవ నుద్యుక్తులై యుండిరి. ఇంతలో చెరువుగట్టున నొక వృద్ధ వైష్ణవ శిఖామణి యగపడి చిరపరిచితునివలె శ్రీ రామానుజులతో నాయనా నీవిచ్చటి కెప్పుడు వొచ్చితివి? యని చిరునగవుతో బ్రశ్నించిరి. శ్రీ రామానుజులవారికి వారిని జూచిన జ్ఞాపకము లేకున్నను అంజలి బద్ధులై స్వామీ దాసుడితఃపూర్వము రెండు ఘడియల క్రిందనే యిచ్చటికి శ్రీ కాంచీపురి నుండి వొచ్చినాడు. ఈదాసునియెడ అవ్యాజకృపచే హెచ్చరించిన దేవరవారు నియ తముగ నెచ్చట వేంచేసియుందురో, ఏ భాగవత శిఖామణి తిరు వడి సంబంధులో తెలుపదగునేని దెలుప వేడెదననిరి. అపుడా శ్రీవైష్ణవులు "నాది ప్రత్యక్షవైకుంఠమని బ్రఖ్యాతిగాంచిన శ్రీరంగము శ్రీ శ్రీ ఆళవందారు దివ్యతిరువడి సంబంధిని నన్ను

పరాంకుశ దాసుడందురు. మా యేలినవారితోగూడ నొకప్పుడు శ్రీ వరదరాజ పెరుమాళ్ల సన్నిధికి వచ్చినపుడు యాదవశిష్య బృందమున నిన్నుజూడనయ్యెను నీవు రామానుజుడవుగాదా? అనిరి. రామా: భాగ్యము, ఇతఃపూర్వమే దాసునిపై దేవరవారి యవ్యాజ కరుణాకటాక్షము కరిగిరివరదుని సన్నిధిలోనే ప్రసరించినందున కెంతయోదన్యుడను. పంగోరు పరిభాగీరధియన్నటుల ఆకస్మికముగ దేవరవారి దర్శనమందు లభించినది. దాసుడే శ్రీశ్రీ వరదుని నియమనముచే శ్రీ కాంచీపూర్ణుల తీవ్రప్రోత్సాహమున దేవరవారి కొరకై శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి రానుద్యుక్తడనై మార్గ మధ్యమున శ్రీ శిరియతిరువడికి శ్రీరామదర్శనము లభించినట్లు యాదృచ్ఛికమున ఈ దివ్యదేశమున దేవరవారి దివ్యదర్శనము లభించినది." "పరాంకుశులు" నాకొరకే వచ్చుచుంటివా? అదేల? "శ్రీ రామానుజులు" దేవరవారి సన్నిధిని దాసుడు పంచసంస్కారాది హితములన్నియు లభింప శ్రీ కరిగిరివరదుని యాజ్ఞయు, శ్రీ కాంచీపూర్ణుల ప్రోత్సాహమును లభించియే పయనమై వచ్చుచుండి నాడీదాసుడు (శ్రీ పరాంకుశులు) హాశ్చర్య సంభ్రమానందములు ముప్పిరిగొన "భగవత్కృపా ప్రవాహము ఘనసింధువు జేరెడి గంగభంగి నిటులగదా తదీయులపై ప్రవహించును. నేను మా ఆచార్యనియమనమునముచే నీకు పంచసంస్కారాది హితములన్నియు నొనగూర్ప బంపబడిన వాడను. రామానుజా ఇంచుక నాగుము. నేనును అనుష్ఠానము దీర్చుకొని వచ్చెద. శ్రీ రామానుజులు ."భాగ్యము భాగ్యము." శ్రీ పరాంకుశ దాసులవారు

అమందానందమానసులై తటాకమునదిగి తీర్థీకరించి నిత్యకర్మా నుష్ఠానము దీర్చుకొని వచ్చిరి. ఇరువురును ఫలపుష్పాది పూజా ద్రవ్యములు సేకరించుకొని భగవత్సన్నిధి కరిగిరి. దారిలో శ్రీ రామానుజులు ఆర్యా దాసుడీ దివ్యసన్నిధిలో దేవరవారి దివ్యతిరువడి నాశ్రయింప వచ్చునుగదా యనిరి. అందుకు వారు నాయనా ఆకార్యము శ్రీ కాంచీపురిలోగావచ్చు ననగనే దేవర వారినియమనానుసారమే నడుచుకొనదగినదిగావి జీవితములు బుద్బుదములవలె క్షణభంగురములం దాసునివంటి వారికి చిత్త వృత్తులు శరదంబుదములవలె చంచలములు కలకాలము కాల చక్రమొకరీతి నడవదుగదా ? శుభస్య శీఘ్రం అను నార్యోక్తి ఇట్టి విషయములలోనే ముఖ్యముగ పాటింపదగినది యనిరి. శ్రీ పరాంకుశదాసుల వారాశ్చర్యమున శ్రీ రామానుజులవంకజూచి వారి విమలాశయమున కలరి నాయనా నీవు బహుమేధావివి, దీర్ఘదర్శివి, ఆదర్శప్రాయుడవని ప్రత్యక్షమునగూడ నేడు దెలియవచ్చుచున్నది. అర్తులకు నీమార్గమే అను సరణీయము నీవు కోరినటులనే నెరవేరును లెమ్ము అని వారివి భగవత్సన్నిధికి గొని పోయిరి. అవ్వల యిరువురును శ్రీ బలిపీఠ ధ్వజస్తంభముల కడమ్రొక్కి విమానమునకు ప్రక్రమంబొనర్చి భగవత్సన్నిధి లోని కరిగి శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేతులగు శ్రీ శ్రీ చక్ర వర్తి తిరుమఘనార్లను సేవించి స్తుతించి పూజాద్రవ్యము లర్పించి భగవదారాధనానంతరము యిరువురును అర్చకులొసంగు తీర్థ, శఠగోప ప్రసాదములు పొందిరి. మఱుదినమును వారిరు

వురును కోవెలకరుదెంచి భగవత్సేవ యొనర్చుచుండుతరి. శ్రీ పరాంకుశదాసులు తమ పవిత్రోద్యమము నెరవేర్ప శ్రీ సీతాపతిని ప్రార్థించి శ్రీ రామానుజులవారితో నీయుద్యమము నెరవేర్ప శ్రియఃపతిని బ్రార్థింపుమనిరి. వారును అటులనే యొనర్చుచుండ నీరాజనము సమర్పించబడు సమయమున భగవదంగీకార సూచకముగ ఈ ప్రసూనదామమును బోలిన రామానుజులు ఈ విభూతిలో నీ పరమవైదిక సిద్ధాంతము వ్యాపింపజేయ నిదిగో వచ్చుచున్నారను వార్త దెల్పురీతి శ్రీ సీతారాముల కోమలకంఠమున నలంకరింపబడిన దివ్యసౌరభ సుమదామ మొకటి శ్రీ శఠారిని వేంచేపుచేసి యుండు తట్టలో బడిన శ్రీ మహాపూర్ణ రామానుజు లిరువురికిని అత్యంతామోదము గూర్చెను. భగవన్నియమనమును, భాగవతనియమనమును బొంది శ్రీ మహాపూర్ణులు శ్రీమద్రామానుజుల వారికి పంచసంస్కారాది హితవులన్నియు యథావిధి నెరపి పరిపూర్ణమనోరథులైరి. పిమ్మట శ్రీ రామానుజ ప్రార్థనచే శ్రీ పరాంకుశదాసులవారు శ్రీ కరిగిరివరదుని కాంచీపూర్ణులను కన్నుల కఱవుదీర కనుగొన కాంచీపురి కరుగనుద్యుక్తులై శ్రీ సీతారాముల నియమనమును పొంది పయనమై కతిపయదినంబులకు శ్రీ రామానుజులతోగూడ శ్రీ కాంచీపురి జేరుకొనిరి.

పదమూడవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## పదునాల్గవ గుచ్ఛము

శ్రీ మహాపూర్ణులును, శ్రీరామానుజులును శ్రీ కాంచీపురికి విచ్చేసి శ్రీ శ్రీ కరిగిరివరదుని కన్నుల కఱవుదీర శ్రీ పుణ్యకోటి దివ్యవిమానమున సేవించుకొనిన వెనుక శ్రీ కాంచీపూర్ణులను వారిరువురు స్వామివారి యాస్థాన ముఖమండపమున దర్శించిరి. శ్రీ కాంచీపూర్ణులును వీరిరువురినిగని సంభ్రమచిత్తులైరి. అపుడు వారు శ్రీ మహాపూర్ణులతో దేవరవారి యాకస్మికసేవ దాసుని కత్యానందము గూర్చుచున్నది. ధన్యుడను అని సాష్టాంగవందనం బాచరించిరి. అటుపిమ్మట చెంత అంజలి బద్ధులై నిలుచుండిన శ్రీ రామానుజులవంకజూచి ఈ మహాత్ముని మూలమున మీరింత శీఘ్రముగ పంచసంస్కారాది హితములన్నియు లభించి యుందురని యనుకొని యుండలేదు. మీరు శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి కలిగినటుల యగపడదే. ఈ మహాత్ములు మీకెక్కడ సేవ యనుగ్రహించిరి? యనిరి. అపుడు శ్రీ రామానుజులు

శ్రీ శ్రీ వరదునికృప, దేవరవారి మంగళాశాసనముదప్ప మరె ద్దియు యిందుకు కారణముగా నుండుట కవకాశములేదు. ఆచా ర్యులవారి అవ్యాజ కటాక్షము శ్రీమధురాంతకపు చెఱువుచేరువనే ప్రసరించినను ధన్యునిగావించినది. ఆ దివ్యక్షేత్రమున శ్రీ శ్రీ చక్రవర్తి తిరుమహానార్ల సన్నిధియందే దాసుని నాశ్రయింప జేసుకొనిరనిరి. శ్రీకాంచీపూర్ణులు ఆ సువార్తకలరి శ్రీమహాపూర్ణు లను ఉచితరీతి సత్కరించి శ్రీ ఆళవందారు యోగక్షేమమును తక్కిన భాగవతుల యోగక్షేమములును, శ్రీరంగనాధుని దివ్యా లయ కైంకర్య సమృద్ధియు విచారించి ఆనందించి, ఆర్యా తామిచ్చట కొంతకాలము వేంచేసి మీ శిష్యరత్నమగు ఈ రామా నుజులకు మన ఆచార్యులనుగ్రహించిన దర్శన రహస్యములనను గ్రహింపవలెనని దాసుని ప్రార్థన యనగనే శ్రీ మహాపూర్ణులు శ్రీ రామానుజులును అటులనేకోరి నన్నిటకు గొనివచ్చిరి. ప్రత్యక్ష వరదరూపమునున్న మీ పురుషాకారమును యిందుకు తోడ్పడినది. మన ఆచార్యులవారికి దాసుడు శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి విడిచినది మొదలు యిచ్చట మీ దర్శనము లభించినంత వఱకు యావద్విశిష్టము తెలియపరచి మరికొన్నిదినములు లుండ వారి నియమును పొందు టుచితముగదా యనిరి. వారందుకు సంతసించిరి. అపుడు దాసులవారు సంగతులన్నియు విశదముగా అనాదే తమ అచార్యులకు తెలియపరచి వారినియమనము కొరకై నిరీక్షించుచుండిరి. శ్రీమద్యామున మునులును శ్రీ కాంచీపురి నుండి దాసులవారిచే వ్రాయబడిన అమూల్యాంశములన్నియు

ఆశ్రితబృందముకడ వివిపించి అమందానంద మానసులై మరల తాము నియమన పత్రికవ్రాయు వరకు శ్రీ రామానుజులకు దర్శనరహస్యములనుగ్రహించుచుండుమని శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధినుండి తెలిపిరి. ఆ శ్రీముఖము శిరసావహించి, శ్రీ కాంచీ పూర్ణులకును శ్రీ రామానుజులకును ఆ నియమన పత్రిక జూపి శ్రీ దాసులవారు వారిని సంతసింపజేసిరి. ఆనాడు మొదలు శ్రీ మహాపూర్ణులు కొంతకాలము నిర్విచారముగ శ్రీ రామానుజులకు దర్శనరహస్యములనుగ్రహించుటతోను శ్రీ కాంచీపూర్ణులతో భగ వద్భాగవత గుణానుభవము సల్పుటతోను, శ్రీ శ్రీ కరిగిరివరదుని అనుదినమును సేవించుటతోను కాలక్షేపమొనర్చుచుండిరి. మధ్య కాలములో శ్రీ రామానుజులకు మాతృవియోగము తటస్థించి యుండినది. తమ ధర్మపత్నియే గృహకృత్యములు నిర్వహిం చుకొనుచు పతి శుశ్రూషా పరాయణయై యుండినది. గాని ఆ సాధ్వీమణికి ఆచారమున మితిమీరిన పట్టుదల భర్తకు ఆ కారణ ముచే కొన్ని ఇబ్బందులు కలుగుచుండెను. ప్రశాంతచిత్తులగు శ్రీ రామానుజులు గమనించియు గమనించనట్లు ఎటులనో మొక విధమున ప్రతిబంధకములను తొలగించుకొని కాలముత్రోసి పుచ్చుచుండిరి. "ఆచారాత్ప్రభవోధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః" అను శ్రీసూక్తి సత్యమేగాని ఆత్మనియమముల కనుగుణముగ శారీరక నియమము లుండకతీరదు. అవి విరోధించినపుడొక ప్పుడు స్వరూపమునకు హానిదెచ్చుటయుకద్దు. శారీరిక నియమ ములు మితిమీరినపుడే సహజముగ నిట్టిది తటస్థించును. కేవల

వస్తుతంత్రములే గమనించి జ్ఞానభాగముదాసీనము జేయువా రెందఱొకలరు. మైల మడి అను పద్ధతులు సనాతనపద్ధతులలో పట్టుదలగల స్త్రీలలో పురుషులకన్నను యెక్కువగ గానవచ్చుచుండును. యుక్తాయుక్త విమర్శనాశక్తికి వలయు విద్యాభావముచే కొందఱు స్త్రీలకు పట్టుదల మాత్రమే మిగిలియుండును. ఇది ఒక్కొక సమయమున ఆత్మస్వరూపమున కౌజ్వల్యకరమగు భగవద్భాగవతానుగ్రహమునకే వెలియగునట్లొనర్చుట వింత గాదు. అందుకొఱకే న్యాసదశకమున "నిత్యం నిరపరాధేషు కైంకర్యేషు నియుంక్ష్వమాం" అని ప్రార్థింపబడినది. వెనుక పేర్కొనినరీతి మన రామానుజులవారి దేవిగారికి అచారపట్టుదల విమర్శనాశక్తి కెడమివ్వక పోవుచుండినది. ఒకనాడు శ్రీ పరాంకుశ దాసులవారి దేవిగారు తీర్థము గొనివచ్చుటకై చేరువనున్న బావికడ కరిగి యుండి మరల యిల్లుజేర తడవయ్యెను. ఏల ఆలస్యమై యుండునని దాసులవారించుక యోచించుచుండ శ్రీ రామానుజుల దేవిగారును, వీరి దేవిగారును బావికడ కలహించుచు న్నారను వార్త యిరుగుపొరుగు వారివల్ల దెలియవచ్చెను. ప్రపన్నులు అంతపురంధ్రీరత్నములవలె భయభక్తులతో వర్తించుచు స్వరూపము గాపాడుకొనవలసినవారు అను అంశము బాగుగ నెఱింగి యుండినవారు గాన శ్రీ రామానుజులవారి సతీమణియెడ తమభార్య యేమియపచారము గావించెనో యని శంకితచిత్తులై దాసులవారు స్వయముగ బావివద్దకు వేంచేయ నుద్యుక్తులై యుండ తమ దేవిగారే తీర్థముగొని ఖిన్నవదనులై విచ్చేసిరి. దాసుల

వారు జరిగిన సంగతులన్నియు దాచక తెల్పుమని భార్యతో బల్కిరి. తీర్థము చేదుకొనునపుడు పొరబాటున నొకటి రెండు బిందువులు శ్రీ రామానుజుల భార్య తంజమాంబ త్రాటిపై బడిన వని యామె కోపగించుకొని. "నేను మడిగట్టుకొని తీర్థము గొని పోవుటకై వచ్చియుండు టెఱింగియు నిర్లక్ష్యముగ నిట్లు నానెత్తిన నీరుచల్ల జూచెదవేల నీ కంటికి మేమంత చులకనగ గానవచ్చు చుంటిమిగాబోలు, ఇదేమికండగావరమా, ఉదాసీనమా, దురభి మానమా నాకర్థముగాలేదు. పండిత పత్నివైనందుకు కొంచె మైన వివేకముండనక్కరలేదా?" యని యింకను ఏమేమియో పురుషవాక్యము లాడబోవుచుండ అపుడు వినయమున అమ్మా పొరబాటున ఒకటి రెండు చుక్కలు మీత్రాటిపై పడినను పడి యుండ వచ్చును. ఈ మాత్రమున కింతనోరు జేసుకొనవలయు నాతల్లీ పొరబాటుకు క్షమింపుమని మృదువుగా దాసిమందలించి నను, యిరుగుపొరుగువారును పాపమామెను అంత పరుషముగ మాటలాడరాదని జెప్పినను వినక వారినిగూడ అనరాని దుర్భాష లాడి గొనుగుకొనుచు రిక్తకలశముతో యింటికరిగెను యని భర్తతో భార్య కన్నీరు గార్చుచు నవనత వదనయై బల్కెను. అపుడు మహాపూర్ణులు భార్యతో స్నానము చేసినవారు చేరువ నుండ గమనింపక పోవుట నీదేతప్పు అయినను అపరాధ క్షమా పణ చేసుకొంటివిగదా యనిరి. క్షమాపణ ప్రార్థించకున్న స్వరూపము దక్కవలదాయని యామె బల్కెను. యింతలో నొక విద్యార్థివచ్చి మహాపూర్ణులకు నమస్కరించి ఒక వుత్తర

మొసంగిపోయెను. అదిజూచి తమ ఆచార్యులవారు శ్రీ నంబెరుమాళ్ల సన్నిధినుండి వ్రాసిన శ్రీముఖముగ అగపడ కన్నులకద్దుకొని సావధానముగ చదువుకొనుటలో కలహవిచారము నంతటితో విరమింపవలసి వచ్చినది. శ్రీ రామానుజులవారికి కలహవార్త ఆవంతయు దెలియదు. ఎప్పటివలె మధ్యాహ్నము ఆచార్యసన్నిధిని కాలక్షేపముజేయ విచ్చేసి సాష్టాంగముగ నమస్కరించి అంజలి బద్ధులై నిలచిరి. ఆచార్యులవారును శిష్యునకు కలహవార్త దెలుపక అయ్యా మా ఆచార్యులవారి నుండి నన్ను రమ్మని యిదిగో ఈ శ్రీముఖము వచ్చియున్నది. తిరుమేనంచుక అస్వస్థముగ నున్నదట వారిని దర్శించి బహుకాలమైనది గనుక రేపుదయముననే పోకతీరదు అని వుత్తరము జూపిరి. అపుడు రామానుజులు పరమాచార్యులవారి అనారోగ్యమునకు, స్వాచార్య విశ్లేషమునకు వ్యాకులతజెందియు ఓర్చుకొనవలసి వచ్చెను. మహాపూర్ణులది గమనించి మీరేమియు వ్యాకులపడవలదు ఏలన వారి ఆరోగ్యము చూచుకొని శీఘ్రముగ మరల వత్తును. మీకింకను దర్శన రహస్యములు తెల్పవలసియున్నవి అనిరి. శ్రీ రామానుజులు "భాగ్యము దాసునియెడ దేవరవారి అవ్యాజ కటాక్షమెంతయో ప్రసరించి నందుకు ధన్యుడను అనిరి. పిమ్మట పెరియనంబిగారు శ్రీ శ్రీ కరిగిరివరదుని సన్నిధికరిగి ఆ దివ్య దంపతుల యాజ్ఞగొని శ్రీ తిరుక్కచ్చి నంబిగారితో తామరుగవలసిన కారణముదెల్పి శ్రీ రామానుజుల పురోవృద్ధికై శ్రద్ధతో గమనించుచుండుడనిపల్కి వారినియమనము బొంది నిజమంది

రమునకు విచ్చేసి ప్రయాణ సన్నాహమొనర్చుకొని మఱుదినము వేకువజాముననే శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి కఱిగిరి. శ్రీ రామానుజులును స్వాచార్యులను కొంతదవ్వు సాగనంపి వారి యనుమతిని నిజనివాసమునకు విచ్చేసిరి. శ్రీ మహాపూర్ణులు శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి కొన్నిదినంబులకు చేరుకొని కావేరియందవగాహనమొనర్చి నిత్యకర్మానుష్ఠానములు దీర్చుకొని స్వాచార్యమఠమున కరిగి మృద్వాస్తరణమున నాసీనులైయున్న వారిని దర్శించి నమస్కరింపగనే శ్రీ శ్రీ ఆళవందార్లు వారినిగని అత్యుత్సాహమున తమవద్ద గూర్చుండ బెట్టుకొని వారడుగులోపులనే అయ్యా నా దేహారోగ్యము నిన్నటివఱకు తృప్తికరముగ నుండ లేదుగాని కస్తూరి రంగని కరుణాకటాక్షముచే నేడుదయము నుండి అనుకూలముగనున్నది. నిన్ను గనుకొనగనే మరింత నెమ్మదిగ నున్నది. రామానుజుడు నెమ్మదిగ భగవద్భాగవత సేవ యొనర్చుచున్నాడా ? శ్రీ కాంచీపూర్ణుడు శ్రీ కరిగిరివరదుని యనుగ్రహము కొదవలేక లభించి సుఖించుచున్నాడా, ఆయా దివ్యసన్నిధులలో భాగవతులు భగవత్కైంకర్యములం దప్రమత్తులై మెలంగుచున్నారాయని యడిగిరి. అందుకు దాసుల వారంతయు విలక్షణముగ జఱుగుచున్నది. శ్రీ రామానుజులు దేవరవారి ప్రస్తాపన వచ్చినపుడంతయు ఆనందింపని దినము లేదనిరి. నన్నుజూడనిదే నాయందంత మక్కువ గల్గుట కేవలము శ్రీయఃపతి కటాక్షముగాక వేరేమున్నది. అతనిని మరియొకమారుజూడ నేనును ఆతురపడుచునే యున్నాను. ఉత్త

మోత్తరాభివృద్ధి కుపకరించు బ్రహ్మవిద్యకు విఘ్నము వచ్చు నేమోయను భయముననే నిన్నింతవఱకు అచ్చట నుండ నియమించితిని. నాకు పరిపూర్ణ స్వస్థత కల్గిన వెంటనే శ్రీ శ్రీ కాంచీపురి కఱిగి యతనిని తోడ్కొని రావచ్చును లెమ్ము" అని బల్కిరి. శ్రీ రామానుజులవారి సుగుణసంపత్తికిని, ఆచార్యాను వర్తనకును, యచ్చటనున్న యాశ్రితబృందమంతయు నమందానంద మానసులైరి. శ్రీ మహాపూర్ణులు శ్రీ కాంచీపురి విడిచి శ్రీరంగనగరమున కఱిగిన బహుకాలమునకు శ్రీ రామానుజులకు, స్వపత్నియు, స్వాచార్య పత్నియు బావికడ కలహించుకొనిన కఠినవార్త కర్ణాకర్ణిగ దెలియవచ్చెను. అపుడు వారు భార్య గావించిన మహాభాగవతాపచారము తీవ్రవేదన గావింప ఆచార్య పత్నితో బావివద్ద కలహించిన విషయములో యథార్థపరిస్థితు లిప్పటికైనను దాచక జెప్పుమని భార్యను భయపెట్టిరి. ఆమెయు తన భర్తకాచార్యాభిమానమధికముగ నుండుటచే తన్ను తీవ్రముగ దండించునని గాబోలు జరిగిన సంగతి యింతవఱకు దెలియపరచినదిగాదుగాని భర్తయే అడిగినపుడు చెప్పకతప్పినదిగాదు. భర్తయాత్మస్తుతియు, పరనిందయు, అసత్యము నావంతయు నోర్చువారుగాదని తెలిసియుండుటచే జరిగినది జరిగినటుల జెప్పి తీవ్రకోపమాపజాలక పలికి నందుకాటినుండి యనుతాపపడుచుంటిననెను. భార్యవల్ల జరిగిన వృత్తాంతమంతయు విని ఆచార్యులవారు తమ్ము విడిచి శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి వేంచేయుటకిదియే ముఖ్యకారణమై యుండునాయని మొదలు శంకించి పరమాచార్యులవారి నుండి

వచ్చిన శ్రీముఖమువారు జూపియుండుటచే ఇది సహకారి కారణము కాకపోయియుండదని యూహించివ్యాకులపడిరి. ఆచార్యులు దైవస్వరూపులు దివ్యదంపతులగు శ్రియఃపతులే చేతనుల నుద్ధరింప మధ్యమలోకమున మానవరూపమున సంచారము చేయుచుందురని సకల శాస్త్రములు ఘోషించుచున్నవని నీకెన్నిపర్యాయములో జెప్పియుండియు సాక్షాత్ లక్ష్మీస్వరూపిణి యగు ఆచార్యపత్నిని తూలనాడుటేగాక ఇంతకాలము ఆ విషయము నాకుతెల్పకనే దాచితివి. ఇట్టి విముఖావలోకనము మహాపాతకహేతువు అని ముఖము చిట్లించుకొని యరుగుచుండ పతివిగ్రహము మహాపాతకహేతువను వాక్యము స్మరణకు దెచ్చుకొని శ్రీమతి చిదాసి అపరాధము క్షమింపుడు; దేవరవారి శ్రీపాదమురే శంజిమని శ్రీమతి తంజమాంబ భర్తగారి తిరుపడిత్తామరలపై వ్రాలెను. దయార్ద్రహృదయులగు శ్రీరామానుజులు నీవు చేసిన యపరాధమునకు అనుతాపపడు చుంటివిగాన నిప్పటికి క్షమించితిని. ఆచార్యపత్ని మరల తటస్థించినపుడు మాత్రమామె శ్రీపాదములుబట్టి క్షమాపణ ప్రార్థింపక తప్పదుసుమా. ఈలాటి యపచారములు కర్ణత్రియముల సోక నివ్వక స్వరూపము గాపాడుకొనుము. హెచ్చరిక యని బల్కి కార్యాంతర తీవ్రతచే నరిగిరి. ఆనాడు మొదలు శ్రీమతి తంజమాంబ గండముదప్పి గట్టుచేరినదానివలె సంతసించుచు భర్తృచిత్తానుసారిణియై కొంతకాలము వర్తించుచుండెను.

పదునాల్గవ గుచ్ఛము—సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## పదునైదవ గుచ్ఛము

శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిని శ్రీ యామునమునీంద్రు లొకనాటి యుదయము నిత్యకర్మానుష్ఠానము దీర్చుకొనియుండ ఏలకో చింతాక్రాంతులై యుండి నటుల వారిని దర్శింప వొచ్చిన స్వాశ్రిత బృందమునకు దోచెను. అపుడు శిష్యులందరు స్వాచార్యుల సన్నిధిని దండము సమర్పించి యంజలి బద్ధులై నిలచిరి. వారిలో నొకరు స్వామీ దేవరవారి తిరుముఖ మండలమున నేడేలకో సహజప్రసన్న దీధితులు గానరాకున్నవి. దేవరవారి తిరుమేను అస్వస్థతగానున్నదాయేమి? అని యడుగ, తమకు గడచిన రాత్రి వచ్చిన నొక విచిత్రస్వప్న వృత్తాంతమును గుఱించియే తలంచుచుంటిని. యని పెరియ నంబిగారివంక కటాక్షించి మన రామానుజులనుజూచి కొన్ని యంశములు ముచ్చటింప నామనంబు తీవ్రపడుచున్నది. నీవు శీఘ్రముగ శ్రీ కాంచీపురికరిగి రామానుజులను బంప కాంచీపూర్ణ పురుషకార

పురస్సరముగ కరిగిరి వరదునిఁ బ్రార్థించి యెటులనైనను యాజ్ఞలభించి. యతనిని వెంటగొని రాగలవా" యనిరి అపుడు శ్రీ పరాంకుశదాసులవారు "రామానుజునివంటి యమూల్యవస్తువునుగొని రావలయునన్న మఱియొక యమూల్యవస్తువు శ్రీ వరదునికి సమర్పించియే గొనిరావలసియుండునుగదా" యనిరి. శ్రీ యామునమును లించుకయోచించి నీవుఁ బలికినది సత్యమేగాని. శ్రీ గీతాశాస్త్రమున "పత్రం పుష్పం. ఫలం. తోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి। తదహం భక్త్యుపహృతం. అశ్నామి ప్రయతాత్మనః॥ (అందరికి సులభముగ లభించు నొక పత్రముగాని. పుష్పముగాని. ఫలముగాని. వీటికన్నను సులభముగ లభించు జలముగాని నాకెవడు ప్రియముచే నర్పించునో దానిని నేనును ప్రియముచే స్వీకరింతును.") అని సాయించి యుండిరిగాని నీవని నటుల శ్రియఃపతికి మనవంటి యంకించనులు సమర్పించదగిన యమూల్యవస్తువేది కలదనే యోచింపదగినది. ఆత్మసమర్పణ మొనర్చిననాడే యంతయు శ్రియఃపతి వశమైనది గదా" యనిరి. అపుడు శ్రీ పరాంకుశదాసులవారు ఆత్మసమర్పణ మొనర్చిన పిదప శ్రియఃపతి ప్రేరణచే నార్జింపబడిన దెద్దియైన నుండకపోదుగదా? అందును దేవరవారు. శ్రియఃపతికి తగిన యమూల్య వస్తువునే యార్జించి యుంటిరి. కరిగిరివరదుదు కానుకగా స్వీకరించుటకే గాబోలు ప్రకృతమది దేవరవారి కరస్థమై యున్నది. అది సమర్పింపుడని ప్రార్థించిరి. శ్రీ యామునమునులు శ్రీ పరాంకుశదాసులవారి బుద్ధికుశలత కలరి "పెరి

యనంబియను నామము నీయెడ నేడుసార్థకమైనది. ప్రపన్ను లికమీద నిన్నటులనే బిలుతురుగాక" యని మంగళాశాసనంబొ నర్చి తమ శ్రీహస్తముననున్న స్తోత్రరత్నమును దాసులవారి శ్రీహస్తముననునిచిరి. ఆ శ్రీకోశమును దాసులవారు కన్నుల కొత్తుకొని స్వాచార్యులతో శ్రీగీతాశాస్త్ర శ్రీసూక్తి కనుగుణ ముగ నాలుగు కానుకల విలువ యీ శ్రీకోశమందేయిమిడి యున్నది. ఇది పత్రమువలె పదలాలిత్యయుతముగను, పుష్ప మువలె విజ్ఞాన సౌరభయుతముగను, ఫలమువలె వాగ్మాధుర్య యుత యుతముగను, తోయమువలె స్వచ్ఛమై ప్రశాంతమై సంతాపోపశమనముగను నగపడుచున్నది గదా. ధన్యోస్మి యికదాసుని కాజ్ఞనొసంగుడని యాచార్యాజ్ఞగొని మఱుక్షణమే శ్రీకాంచీపురి కఱిగిరి. శ్రీకాంచీపురిని శ్రీరామానుజులును స్వాచార్యులరాకకై చంద్రచకోరన్యాయమున వెదురు జూచు చున్నందుకు, షోడశకళా పరిపూర్ణులగు చంద్రుని పగిది షోడశ కళా పరిపూర్ణులగు శ్రీమహాపూర్ణులును కతిపయ దినములకు కాంచీపురిజేరి వారికి దర్శనమొసంగిరి. శ్రీరామానుజులపుడా కొన్నవాడు సిద్ధాన్నమునుగని నటుల స్వాచార్యులఁగని యంజలి ఘటించి సాష్టాంగ వందనం బాచరించి నిలుచుండి చెంతనున్న తమదేవిగారగు శ్రీమతి తంజమాంబ వంకజూచిరి. ఆమెయు భర్త్రయింగితము గుర్తెఱింగి శ్రీస్వాచార్యులవారి శ్రీపాదములకు నమస్కరించుచుండ శ్రీమహాపూర్ణులతో "అజ్ఞురాలు, మాతృ సమానయగు స్వాచార్యపత్నియెడ మహాపరాధ మొనర్చిన

పాపాత్మురాలు చంద్రుని నాదరించిన చంద్రికల నాదరించుట
వలె దేవరవారు మీ దాసి తప్పు క్షమించి రక్షింపుడు." అని
దైన్యమున బ్రార్థించిరి. అపుడు శ్రీ పెరియనంబిగారు మోము
పైకెత్తించుక యోచించి "ఓహో! యానాడు బావికడ జరిగిన
కలహమును గుఱించి యా నీవు చెప్పుచున్నది. సరిసరి దీని
కింత వేడవలెనా మే మిరువరము యావిషయ మానాడే మఱచి
తిమి." "నకశ్చిన్నాపరాధ్యతి" యని శ్రీ సీతాపిరాట్టియే శ్రీ
సిరియ తిరువడితో యానాడే పల్కియుండలేదా? అమ్మా
లెమ్ము నీ అనుతాపమే చాలును. "పశ్చాత్తాపేన శుద్ధ్యతి"యని
నటుల సర్వాపరాధములకు యనుతాపము మొంది యట్టివి మఱల
తటస్థించకుండునటుల శ్రియఃపతిని ప్రార్థించుటే స్వరూపము.
అని పలికి శ్రీ రామానుజులను కటాక్షించి "మీరందఱు క్షేమ
ముగ నున్నారా? శ్రీ కాంచీపూర్ణులును, కరిగిరీశులును పల్లాండుగ
వేంచేసి యున్నారా?" యని యడిగిరి. అందుకు శ్రీ రామాను
జులు దేవరవారి కటాక్షమున నందఱము నెమ్మదిగ నున్నారము.
వారు ప్రశంసిన భగవద్భాగవతులు వైభవమున వేంచేసి
యున్నారు. దేవరవారియొక్కయు పరమాచార్యులవారి యొక్క
యోగక్షేమములరయుట స్వరూపమైయుండ మీదాసి మొనర్చిన
యపచారము క్షమింప దేవరవారిని వేడుటలో యడుగవలసిన
యంశము లడుగ మఱచితిని." పరమభాగవతుల పాదదూళి
సమస్త తీర్థసారమనుచు దెలియలేనివారి వారివారి జేరినవారి
తొలుత గట్టితెందు దూతలారా" యను శ్రీ యమవాక్యము దలచి

తల్లడిల్లకున్న వారికి స్వరూపము దక్కునా మహాత్మా యనుచు స్వాచార్యుల వారిని పాదప్రక్షాళణాది సకలోపచారముల సత్కరించి శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి శ్రీ పరమాచార్యులగు శ్రీ మద్యామునమునుల యారోగ్యమరసి సంతసించి భగవద్భాగవత యోగక్షేమములు విచారించుచు పథశ్రీమవాయ పాదములు మెల మెల్లగ నొత్తుచుండిరి. శ్రీ తంజమాంబయు తాళవృంతము చేబూది భర్తగారి నియమనముచే భయభక్తులతో నాచార్యుల వారికి విసరుచుండెను. ఇటుల ముహూర్తకాలము గడవగనే శ్రీ పరాంకుశదాసులవారు "భగవత్సన్నిధికి బోయివత్తును. మీరును గృహారాధనకు వలయు కార్యములిక చూచుకొనుడు. రాసురాను పొద్దెక్కుచుండలేదా" యని శ్రీ రామానుజులతో బలికి తోడ్తో భగవత్సన్నిధి కఱిగిరి. శ్రీమతి తంజమాంబయు శ్రియఃపతి కటాక్షముచే యాకస్మికముగ స్వాచార్య దర్శనము లభించి యపరాధక్షమాపణవేడి ధన్యతగాంచుట కలరి గృహ కృత్యములఁ జూచుకొన నఱిగెను. దాసులవారు భగవత్సన్నిధి కఱుగుటకు పూర్వము శ్రీ కాంచీపూర్ణులను దర్శించి కొంతకాలము పరస్పరము భగవద్భాగవత యోగక్షేమములు ముచ్చటించుకొని, అవ్వల నిరువురును, భగవత్సేవ యొనర్చి ముఖమండపమున మఱి కొంతకాలము ముచ్చటించుకొనుచుండుటలో తమ యాగమనము నకు కారణము శ్రీ కాంచీపూర్ణులకు దెలిపి యిట్టి కైంకర్య మొనర్పబూన మీపురుషకార మత్యంతావశ్యకమనియు, యిది మన యాచార్యాజ్ఞయనియు విజ్ఞాపనంబొనర్చిరి. శ్రీ కాంచీ

పూర్ణులను నందుల కంగీకరించిరి. ఆనాడు శ్రీ మహాపూర్ణుల కభ్యవహారాది సకల సత్కారములును సంతృప్తికరముగ శ్రీ రామానుజులవారింట జఱిగినవి. శ్రీ రామానుజ, శ్రీ తంజ మాంబగారి యాదరణకు శ్రీ దాసులవారు మిక్కిలి సంతసించిరి. మఱుదినముదయమున శిష్యాచార్యు లిరువురును, నిత్యకర్మాను ష్ఠానములు దీర్చుకొని సన్నిధికి కఱుగ నుద్యుక్తులై ఫలపుష్పాది పరికరములతో కోవెలలోని కఱిగి తమ యిరువురికొఱకు నిరీ క్షించుచున్న శ్రీ తిరుకచ్చినంబిగారిని దర్శించి మువ్వురును బలిపీఠ ధ్వజస్థంభముల కడకు విచ్చేసి మ్రొక్కి శ్రీ కరిగిరీశుని సన్నిధానమున కరిగిరి. అప్పుడపుడే భగవానునకభిగమ నారా ధన జఱుగుచుండు సమయమది. సకాలమునకే కరిగిరివరదుడు తమ్ము కరుణచే రప్పించుకొనెననివారు మువ్వురును సంభ్రమ సంతసములచే శ్రీ పుణ్యకోటి విమానమునకు ప్రదక్షిణ మర్పించి శ్రియఃపతికి సాష్టాంగవందనం బాచరించి తాము గొనివచ్చిన పూజాద్రవ్యములు భగవానునకు నివేదనంబొనర్ప అర్చకులకడ నర్పించిరి. వారును వీరుగొనివచ్చిన పూజాద్రవ్యములు స్వీక రించి యందు తులసీపుష్పహారములం శ్రీ వరదరాజస్వామివారి కంఠసీమ నలంకరించుచుండ తులసీదామ మర్పించుతరి ఇతఃపూర్వ మలంకరింపబడి యుండిన తులసిదామ మాకస్మిక ముగ కరిగిరీశుని కంఠసీమ నుండిజాఱి శ్రీ శఠారివేంచేపు చేయ బడియుండు తట్టలో బడెను. అర్చకులుగాని పెక్కురు భాగవ తులుగాని యాసన్నివేశమును గమనించినట్లులేదు. వారలంకార

వైఖరినే గమనించుచుండిరి. శ్రీ రామానుజులవారదిగని చకి తులై శ్రీ తిరుక్కచ్చి నంబిగారివంక నొకమాఱును, స్వాచార్యు లవంక నొకమాఱును చూచిరి. ఆ భాగవతు లిరువురును ఆ వింత గమనించుచునే యుండిన వారగుటచే నొకటి మొగమొకరు జూచుకొని దైన్యభావమున దలవంచుకొనిరి. భగవన్నివేదన, ఉత్తర నీరాజనము, మున్నగునవి యథావిధి జఱిగిన వెనుక తమ ఆచార్యు లొసంగిన స్తోత్రరత్నమునంతయు దాసులవారు భగవద్భాగవతుల సమక్షమున యను సంధించి శ్రీ కోశమున ర్చకముఖముగ భగవత్సన్నిధిలో నర్పించి శ్రియఃపతికి సాష్టాంగ వందనం బాచరించిరి. ఆలయాధికారి నియమనమున శ్రీ పరాం కుశ దాసులవారికి తిరువరిపట్టు, తీర్థ, శఠగోప ప్రసాదము లర్చకులొసంగిరి. అటుపిమ్మట యథావిధి నందఱకు క్రమముగ తీర్థ, శఠగోపము లొసంగబడెను. శ్రీ దాసులవారును, శ్రీ నంబి గారును, శ్రీ రామానుజులును, భగవదాజ్ఞవడసి సన్నిధి నుండి విచ్చేసిరి. భావికాలగతులిదమిత్థమని నిర్ణయింప సాధ్యముగామి కాబోలు భగవత్సంకల్ప పరిణామమునకై నిరీక్షింపవలసివచ్చెను. శ్రీ పరాంకుశదాసులవారును, శ్రీ కాంచీపూర్ణులును భగవత్సన్ని ధానమున జఱిగిన పరిస్థితులు మందలించుకొని యుండిరిగాని యవి శ్రీ రామానుజులవారికి దెల్పుటి కిరువురును శంకించిరి. మఱుదినమాచార్యులవా రనుష్ఠానము నెరవేర్చుకొని స్తోత్రరత్న మను సంధించుకొనుచు శ్రీ శ్రీ కరిగిరీశుని సన్నిధికి వేంచేయు చుండిరి. శ్రీ రామానుజులవారు శాలిక్కిణర్ నుండి తిరువంజన

తీర్థముగొని వచ్చుచు సన్నిధికఱుగుచుండు తమ యాచార్యుల వాఱిని శీఘ్రమున గలసికొని యంజలి జోడించివారను సంధించు కొనుచుండిన కొన్ని శ్లోకములు వీనుల విందుగవిని "స్వామీ! యీ శ్లోకములు పరమాచార్య ప్రణీతములని నిన్ననే తెలియుటచే దాసుఁడ నానందాంబుధి మగ్నుండనైతి. పరమాచార్య దర్శన భాగ్యమెప్పుడు లభించునోయని మనంబాతురపడుచున్నది. అంతయు దేవరవారి కరుణాకటాక్ష ప్రసరణపైననేగదా ఆధారపడి యుండును" అనిరి. అపుడు దాసులవారు సస్మితాననులై నిన్ను మా యేలినవారి సన్నిధికి బిలుచుకొని రమ్మని యాజ్ఞయై యుండుటచేతనే నిచ్చటికీ పర్యాయము వచ్చి యుండుట. నీవును పరమాచార్య పదాంబుజములు సేవింప నాతురపడుచుండుట ఆనందదాయకముగ నున్నది. ఇక శ్రీ కాంచీపూర్ణుల పురుషకారమును, శ్రీ శ్రీ కరిగిరీశుని నియమనమేయ వశిష్ఠముగాన నీవు శీఘ్రమున నీవొనర్పదగిన తీర్థ, కైంకర్యము ముగింపు జేసుకొని శ్రీ కాంచీపూర్ణుల సన్నిధికి రమ్ము. నేనును నీవు వచ్చుపఱకందే యుండెద ననగనే భాగ్యము, భాగ్యమని శ్రీ రామానుజులు తీర్థకలశముతో సన్నిధిలోని కరిగిరి. శ్రీ రామానుజులిటుల సన్నిధిలోని కఱుగ శ్రీ దాసులవారు శ్రీ కాంచీపూర్ణుల సన్నిధి కఱిగి వారితో ముచ్చటించుకొనుచుండగనే శ్రీ రామానుజుల వారచ్చటికి విచ్చేసిరి. అవ్వల వారు ముప్పురును ఫల పుష్పాది పూజాద్రవ్యములతో భగవత్సన్నిధి కఱుగ నుద్యుక్తులై బలిపీఠ ధ్వజస్తంభములకడ మ్రొక్కి శ్రీ పుణ్యకోటి విమానమునకు

బ్రదక్షిణ మాచరించి శ్రీ కరిగిరీశుని సన్నిధికి విచ్చేసి సాష్టాంగ వందనం బాచరించి తాము గొనివచ్చిన పూజాద్రవ్యములు యర్చక ముఖముగ భగవత్సన్నిధిలో సమర్పించిరి. అర్చక పరిచారకులు వాటిని స్వీకరించి శ్రియఃపతి కర్పించిరి. అభిగమ నారాధన యథావిధి ముగిసిన వెనుక తాము ఆచార్యాజ్ఞమేరకు శ్రీ రామానుజులను శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి భగవన్నియమను బొంది గొనిపోవనలుదెంచి యుంటినని సన్నిధిలో విజ్ఞాపనం బొనర్ప శ్రీ కాంచీపూర్ణుల నిదివఱకే పురుషకార భూతులుగ నుండుడని ప్రార్థించి యుండుటచే శ్రీ కాంచీపూర్ణులును, సమయము గుర్తెఱిగి శ్రియఃపతి నించుక ధ్యానించి శ్రీ మహాపూర్ణుల మనోరథంబు నెరవేర్ప బ్రార్థింపబోవుచుండ శ్రియఃపతియే యర్చక ముఖముగ వారితో మీ యిరువురి విమతాతిశయములు గ్రహించితిని. కలకాలము కాలచక్ర మొకేతీరుగ నడవదను సంగతి మీరెఱుంగ నిదిగాదు. శీఘ్రమున శ్రీ రామానుజులను శ్రీరంగమునకు శ్రీ పరాంకుశదాసులు గొనిపోవచ్చునని బలికి వారందఱకు తీర్థ, శఠగోపప్రసాదము లిప్పించి యనుగ్రహించిరి. వారును భగవన్నియమనమును బొంది విచ్చేసిన పిదప శ్రీ మహాపూర్ణులును, శ్రీ రామానుజులును శ్రీ కాంచీపూర్ణుల నియమనమును బొంది యానాడే శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి పయనమైరి.

పదునైదవ గుచ్ఛము—సంపూర్ణము.

—✱—

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## పదునాఱవ గుచ్ఛము

శ్రీ పెరియనంబిగారిని కాంచీపురి కనిపిన వెనుక శ్రీ యామున మునులు స్వాశ్రిత బృందముఁగని "రామానుజుని తోడితేర పెరియ నంబినంపు తొందఱలో నిన్నటిరేయినేగవిన స్వప్నవృత్తాంతముఁ జెప్పమఱచితిని. ఆస్వప్నమున ద్వాదశోర్ధ్వ పుండ్రాలంకృతులును, యాజానుబాహులును, తులసీనళినాక్ష మాలాలంకృత విశాలవక్షులును, సస్మిత సుందరాననులును నగు నలుగురు పురుషులు యీ మఠములోని కఱుదెంచిరి. వారినిగని నేను సంభ్రమ చిత్తుడనై వందనం బాచరింప నాతో వారు "అయ్యా నీవీలోకమున నొనర్ప నియమింపబడిన కైంకర్యము లన్నియు ముగియ వచ్చినవి. ఆనందనిలయమునకు పయనము గావలసిన దినములాసన్నములగుచున్నవి. మీకీవార్త దెల్పి హెచ్చరిక యొనర్పిరా శ్రియఃపతి నియమనంబొనర్చి యుండు టచే వచ్చియుంటిమి." అని బలికి తమ శ్రీ హస్తముల నుందు

దివ్యపరిమళమును వెదజల్లు పుష్పములు నాపైజల్లి యదృశ్యులైరి. మఱుక్షణమే నాకు మెలకువ గల్గినది. ఇది గోవిసర్జన వేళలో వచ్చిన స్వప్నగనుక దీనిఫలము తోడ్తో యనుభవమునకు రాకపోదు" అని పలికిరి. అపుడు కొందఱు శిష్యులు దైన్యభావము వెలిబుచ్చుచు తలవంచుకొనిరి. కొందఱికి గుడ్లనీరు గ్రిమ్మినది. కొందఱు బాష్పసన్నిరుద్ధగద్గద కంఠులై యేమియో చెప్పబోయి చెప్పజాలకుండిరి. ఇటుల యాచార్య విశ్లేషమోర్వజాలని వారిలో శ్రీ తిరుకొట్టియూరు నంబిగారు మున్నగు కొందఱు భాగవతోత్తములు శ్రీ తిరువరంగ పెరుమాళరయరను మఱియొక భాగవతోత్తముని పురుషకారముగగొని స్వాచార్యులఁగని "మహాత్మా తమ విశ్లేష దుఃఖమెటుల నికమీద భరింపఁగలయునో తోపక దాసుల కందఱకు మనంబు మిక్కిలి వ్యాకులపఱచుచున్నది. ఏదేని హితంబుపదేశించి దాసులకాత్మతాపోప శాంతి యొనర్చినగాని తాళజాలమనిరి అపుడు శ్రీ యామున మునీంద్రులు" మీకుపదేశింపదగిన హితంబిదివఱకే యుపదేశింపబడినది. ఇక నీ దివ్యదేశమందే మీరు నిత్యనివాసంబేర్పరచుకొని శ్రీ రంగధాముని నిత్యకైంకర్యములం దప్రమత్తులై త్రివిధాపచారంబు లించుకైన నొనర్పక కాలము దోసిపుచ్చుడు. శ్రీ పాణియోగీంద్రుని పగిది శ్రియఃపతి ననుదినంబు నా పాదమస్తక మాళదీర యనుభవించుటే నిత్యనియమముగ పాటించుచు రాగ పర్వకలి కలుషంబు లడంగి ధన్యులయ్యెదరు. ఇట్టి నిత్యానుష్ఠాన నియమమునందాదర్శ ప్రాయులు, తిరుమలలో శ్రీ శ్రీనివాసుని

భజించుచుండిన శ్రీ కురుంబిరుత్తనంబియు, శ్రీ శ్రీ కరిగిరీశుని భజించుచుండు శ్రీ తిరుకచ్చినంబియునై యుందురు. ఇదిగాక మఱియొక విషయము మీరు ముఖ్యముగ గమనింపదగిన దొకటి యున్నది. అది యెద్దియన భగవదధీనంబగు అత్మయాత్రయు, కర్మానధీనంబగు దేహయాత్రయు, పరాధీనంబు లగుటచే మీ వంటి ప్రపన్నానుష్ఠానపరులకు వాటియందన్వయ ముండగూడదు. అటులగాక అన్వయమున్నదని దలంచితిరా యాత్మసమర్పణము నిరర్థకము. అనన్య ప్రయోజనులగు శ్రీవైష్ణవ స్వాముల శ్రీ పాదపద్మంబులే ప్రాప్యప్రాపకంబులని యుండవలయు" సకృత్త్వ దాకార విలోక నాశయా తృణీకృతాఽనుత్తమ భుక్తిముక్తిభిః। మహాత్మభిర్మామవలోక్యతాం నయక్షణే పితేయద్విరహోతి దుస్సహః॥ అని స్తోత్రరత్నమున దెల్పియుండు యమూల్యాంశమును మఱువకుడు. ఇంతకన్నను మీబోటి వారికిఁ దెల్పదగిన దేమున్నది ? అని పలికి శ్రీ శ్రీ రంగదాముని సేవింప నిజాశ్రిత బృందముతో కోవిలలోని కఱిగిరి. శ్రీ శ్రీ రంగధామునకు తిరువంజనము జఱుగుచుండు సమయమది. శ్రీ యామున మునీంద్రులు, బలిపీఠ, ధ్వజస్థంభ విష్వక్సేనుల సన్నిధులలో సేవించుకొని ప్రణవవిమానమున కంజలి జోడించి, ప్రదక్షిణంబాచరించుచు, సన్నిధిలోని కఱిగి తిరువంజన సేవగని ప్రహృష్ట మానసులైరి. భగవదారాధన ముగిసిన వెనుక శ్రియఃపతి యర్చక ముఖముగ "ఆళవందారే ! నీవీ విభూతిలోన నుత్తమ కైంకర్యము లాచరించి సిద్ధాంత గ్రంథములు రచించి స్వాశ్రిత

బృందమునకుఁజెప్పి, పరమ వైదికమత వ్యాప్తిగావించితివి. కొ
అతబడిన కైంకర్యములు నీ వభిమానించినవారి మూలమున
తప్పక నెరవేరునుగాన నీవాసంశయము మనంబున నుంచుకొని
కొఱతబడకుము. ఆ కార్యములన్నియు ప్రోత్సహించి నిర్వ
హింపజేయ మేముంటిమిగదా. ఇక నీవు నిత్యవిభూతి కఱిగి
సుఖింపు"మనిరి. అపుడు శ్రీ ఆళవందార్లు "దివ్యదంపతుల
ముఖోల్లాస కైంకర్యమే దాసుడు సర్వకాల సర్వావస్థలందును
నభిలషించునది. దేవరవారి నియమనము శిరసావహింపవలసి
నదేగాని యిక స్వల్ప కాలవ్యవధి ననుగ్రహింపయని యింక
నేమియో విజ్ఞాపనం బొనర్పబోవ శ్రియఃపతి" నీ విమలాశయము
గ్రహించితిని. ఇంకను రెండుదినములవకాశమిత్తునుగాని ము
న్ముందు నీవు నెరవేర్పదలచుకొని యుండిన కైంకర్యములకు
"నాసమక్షముననే మఱియొకఱిని నియమింపకఁ బోవలసివచ్చెనే
యని మాత్రము కొంచెమైన కొఱతబడక నిర్భరనిర్భయుడవై
యుండుము." అని బలికి వారికి తిరుపరి వట్ట, తీర్థ, శఠగోప
ప్రసాదములను గ్రహించి, వారి శిష్యబృందమును,నుచితరీతి సత్క
రింపజేసి బంపిరి. ఇటుల భగవన్నియమును బొంది శ్రీ యాళవం
దార్లు స్వమఠము బ్రివేశించి స్వప్నవార్త కనుగుణమగు భగవా
మని శ్రీ సూక్తులను సంధించి యమందానంద మానసులయ్యు
నేనీ దేహము వదలులోపుల రామానుజులు నన్ను గలసికొనుచే
సందేహమనుకొని వారి కొఱకనుక్షణమును నిరీక్షించుచుం
డిరి. ఇటుల రెండు దినములు గడచినను శ్రీ పెరియనంబి

రామానుజులజాడ గానరాదయ్యెను. మూడవదినముదయమున నిత్యకర్మానుష్ఠానానంతరము తిరుమేనున నించుక బడలిక గాన వచ్చెను. అపుడు నిజాశ్రిత బృందముతో నీ పరమవైదిక సిద్ధాంతవ్యాప్తికై జీవితాంతము వఱకు కాలము సక్రమముగ వినియోగించుచు భగవద్భాగవతులయెడ భయనయముల మెలంగుచు కాలము గడుపుచుండుడు. స్వాచార్య విశ్లేషము సహింపజాలక కైంకర్యోప యుక్తముగ నుండు దేహమును త్యజింప సాహసించు వారలు సమస్త పూర్వాచార్య నిగ్రహమునకుగుఱియై చెడుదురని హెచ్చరిక యొనర్చిభగవదారాధనయు శ్రీనాథముని, ఉయ్యక్కొండార్, శ్రీరామమిశ్రాద్యాచార్య శ్రీ పాదుకారాధనయు సమర్పించి భగవద్భాగవతాచార్య శ్రీ పాదతీర్థప్రసాదము స్వీకరించిరి. కడసారి స్వాచార్య శ్రీ పాదతీర్థము శిష్యులద్వారా స్వీకరించి వైశాఖమాస శ్రవణ నక్షత్రమున నభిజన్మహూర్తమున తిరుమేను వదలి దివ్యలోకము జేరిరి. వీరీవిభూతిలో నూట ఇరువదియైదు తిరువర్షంబులు వేంచేసి యుండిరని ప్రతీతి. ఆచార్యులు పరమపద మలంకరించిన పిదప శ్రీ తిరువరంగప్పెరుమాళరీయరు మున్నగు భాగవతోత్తములు స్వాచార్యుల కల్యాణ గుణములు వేమారు దలచిదలచి కన్నీరు గార్చుచుండిరి. కొంత కాలమటుల గడవ "ఎంతవగచిన నేమిలాభము, మున్ముందు కర్తవ్యమూహింపవలదాయని కొందఱు హెచ్చరికజేయ శ్రీ యామునాచార్య పుత్రులగు పిళ్లైకరశు నంబితోడంగూడి స్వాచార్య చరమకైంకర్యము లుపక్రమించి, చరమవిగ్రహమును

శాస్త్రోక్తముగ పూజించి బ్రహ్మరథంబుపై వేంచేపుజేసి తిరు వీధులగుండ మంగళవాద్య బ్రహ్మఘోష పురస్సరముగ ప్రదక్షిణ మాచరించి తీర్థఘట్టమునొద్ద ధ్యానానుసంధాన పూర్వకముగ భూశుద్ధిగావించి బ్రహ్మరథంబు నుండి చరమ విగ్రహమును క్రిందికి వేంచేపు జేసిరి. అటుపిమ్మట యతిసంస్కారప్రక్రియ ననుసరించి బ్రహ్మమేధ సంస్కార మొనర్పబోవు నవసరమున, శ్రీ మహాపూర్ణులును, శ్రీ రామానుజులును, శ్రీరంగనగర బాహ్యోద్యానమువంక కడు వడిగ నరుగు కొందఱ భాగవతో త్తములఁగని శ్రీ మద్యామున మునీంద్ర మరణవృత్తాంతము దెలిసి మిగుల వగచుచు తాము నుత్తరకావేరీతీరమునకు గొని పోబడిన యాచార్య విగ్రహము చెంతజేరి ప్రదక్షిణ ప్రణామము లర్పించి యంజలి బద్ధులై కన్నీరుగార్చుచు నిలుచుండిరి. శ్రీ రామానుజుల వారికి శ్రీ యామునాచార్య శ్రీ హస్తమున నంగుళి త్రియము మాత్రము ముడిచి యుండుటగపడినది. అందుకు కారణ మచ్చటనున్న దేశికోత్తముల నడుగ వారు స్వాచార్య వియోగజనిత దుఃఖభారమున గమనించిన వారు గాకపోవుటచే స్వాచార్యోద్దేశ మవగతంబుగాక నిర్విణ్ణులైరి. అపుడు శ్రీ రామానుజులు, చరమవిగ్రహము చేరువ నంజలి బద్ధులైనిలిచి మహాత్మా! దేవరవారితో ముచ్చటించు భాగ్యమీదాసునకు లేకపోయెనే యని కడుంగడు వ్యాకులత నొందుచున్నాడను. శ్రీ బాదరాయణ మహర్షిప్రోక్త, సకలామ్నాయ తత్వావబోధక బ్రహ్మ సూత్రములకు భాష్యంబొందు లేకపోయెనే యను కొఱంత

యుండిన దాసుడు దేవరవారి మంగళాశాసనబలంబున దీర్చును. అనగనే సంకుచితాంగుళిత్రయములో నొకటి తెరవబడెను. శ్రీ విష్ణుపురాణ నిర్మాతయగు శ్రీ పరాశరభగవానుని, శ్రీ భాగవత నిర్మాతయగు శ్రీ వేదవ్యాస భగవానుని నామములు పరమోప కారస్మృతిచే పరమభాగవతులందఱనుదినంబును స్మరించు నటుల వారిరువురి తిరునామము లిరువురు శ్రీవైష్ణవ ప్రపన్నుల కుంచి పిలుచునటులోర్చెద ననగనే ద్వితీయాంగుళి తెరవబడెను. ప్రపన్న జనకూటస్థులును, ద్రావిడామ్నాయ కర్త యునగు శ్రీ శ్రీ శఠగోపయోగీంద్రునియావాస భూమియగు కురుకాపురి నను దినంబును కృతజ్ఞతచే స్మరింప ప్రపన్నులలో నొకఱి నాపేర బిలువ నేర్పాటు గావించెద ననగనే తృతీయాంగుళియు తెరవ బడెను. ఇటుల ప్రసారితాంగుళిత్రియముగని భాగవతోత్తము లెల్లరు శ్రీ రామానుజ ప్రభావమున కాశ్చర్య విమగ్నమానసు లైరి. ఆవల శ్రీ మద్యామున మునులకుయధావిధి చరమకైంకర్య మహోత్సవము లన్నియు జఱుపబడెను. శ్రీ రామానుజులును పరమాచార్య వియోగ దుఃఖభారముచే నందుండజాలక మరు దినమే శ్రీ కాంచీపురి కరిగిరి.

పదునాఱవ గుచ్ఛము—సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## పదునేడవ గుచ్ఛము

పరమాచార్యులగు శ్రీ మద్యామున మునీంద్రుల విభూతిలో
వేంచేసియుండ సేవించి కృతార్థుడనగుట కవకాశము లేకపోయెనే
యని శ్రీ రామానుజులవారు మిగుల వగచుచు శ్రీ కాంచీపురిజేరి,
యీ విషాద మరణవార్త శ్రీ కాంచీపూర్ణులకడ, కన్నీరు గార్చుచు
దెలిపిరి. శ్రీ రామానుజులు తలవని తలంపుగ నంత శీఘ్రముగ
శ్రీ నంబెరుమాళ్ల సన్నిధినుండి వచ్చుటయు, వచ్చినవారాచార్యుల
వారి యారోగ్యవార్త దెల్పుటకు మారుగ పిడుగుబోలిన నిట్టి స్వా
చార్య మరణవార్త దెల్పుటయు, శ్రీ కాంచీపూర్ణులను దురంత
దుఃఖాంబుధిని ముంచెను. ఆవార్త వినిన మఱుక్షణమే వారు
విస్మృతులై నేలకొఱిగిరి. శ్రీ రామానుజాచార్యుల వారు వారికి
యధోచితోపచారములు నెఱపిన కొండొక వడికి వారు కన్నులు
విచ్చిచూచి సంతతధారగా గారు నశ్రుకణములఁ బలుమారు చేలాం
చలముచేనొత్తుకొనుచు "అయ్యో నేడెట్టి దుర్దినము. నిక్షేపము

వంటి యాచార్యరత్నమును గోలుపోయి నిర్భాగ్యుడనైతిని. నూట యిరువదియైదు తిరువర్షంబులు నిండియున్నను యువకునివలె నత్యుత్సాహపూరితులై శ్రీవైష్ణవ సిద్ధాంత ప్రచారము గావించు చుండిరే. ఇట్టి యాచార్యరత్నము నెన్నిజన్మము లిక తపస్సు జేసినను సంపాదింపనగునా. శ్రీ పరాంకుశదాసులు నన్ను శ్రీరం గమునకు తమవెంట రమ్మని ప్రోత్సహించి యుండిన నేలిన వారిని కన్నుల కఱవుదీర కడసారి మనసార సేవించుకొని కృతార్థుడనై యుందునే పాపము వారికిమాత్ర మివ్విధముగ పరిణమించునని దెలియుటెట్లు అని పలువిధముల పరితపించి శ్రీ రామానుజుల వంకజూచి పాపము పరమాచార్య విశ్లేషము భరింపజాలక కాబోలు శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిని, భాగవత గోష్ఠివిడిచివచ్చితిరని పలుక వారును శోకభారమును కొంత నడంచుకొని గద్గదస్వరంబున తాము శ్రీ కాంచీపురిని దాసుల వారితోగూడ విడిచి నదిమొదలు తుదివఱకు జఱిగిన విషాద వార్తను విన్నవించుకొనుటలో పరమాచార్యులు పరమపదమునకు వేంచేయుతఱి వారి శ్రీ హస్తమున నంగుళిత్రయము ముడువబడి యుండుటయు, వారి తలంపు భగవదనుగ్రహముచే తమకు స్ఫురించి తాము వారి చరమ విగ్రహసన్నిధానమున విన్నవించు కొనిన విధమును, తదుపరి అంగుళిత్రయ మెప్పటివలె ప్రసారిత మగుటయు. సవిస్తరముగ విన్నవించుకొనిరి. అపుడు శ్రీ కాంచీ పూర్ణులు సంభ్రమచిత్తులై శ్రీ రామానుజ ప్రభావమున కచ్చెరు వంది" ఆచార్యులవారు పరమపదించినను వారికి మాఱు మిమ్ము

లను చూచుకొనియైనను నూఱడిల్లుటకు కరిగిరివరదుడు తన యపార కరుణాకటాక్ష మీదాసునిపై ప్రసరింపజేసి నందు కెంతయో కృతజ్ఞుడనై నూరడిల్లక తీరదని మఱికొంత కాలము స్వాచార్య గుణానుభముతోడనే గడపిరి. పిమ్మట శ్రీ రామానుజాచార్యులవారు శ్రీ కాంచీపూర్ణుల నియమను పొంది స్వగృహమున కరిగి శ్రీరంగమున జఱిగిన విషాదకర విషయములన్నియు భార్యకు దెల్పిరి. ఆమెయు కాలగతికి పరితాపము నొందెను. మఱుదినము నుండి శ్రీ రామానుజులు తమ కవకాశముజిక్కినపుడంతయు శ్రీ కాంచీపూర్ణుల సన్నిధియందే భగవద్భాగవతాచార్య గుణానుభవం బొనర్చుచు శ్రీ కాంచీపూర్ణులనే శ్రీ యామున మునులనుగ భావించి యనువర్తించుచుండిరి. శ్రీ కాంచీపూర్ణ రామానుజులు పరస్పర మట్టి పవిత్ర భావనకుజిక్కి యుండుటకు వారిరువురి పరిభావమును ముఖ్యకారణముగ నుండక పోదుగదా. వారిరువురకు ప్రేమవిశ్వాసములు శ్రీ కరిగిరీశుని కృపవలనను, శ్రీ యామున మునీంద్రుని మంగళా శాసనబలమువలనను నానాటికి వృద్ధియగుచుండెను. శ్రీ రామానుజాచార్యులవారి సన్నిధిలో విద్యనభ్యసింప వారి సన్నిహిత బంధువులలో కొందఱు తమ పుత్రులను బంపిరి. విద్యనభ్యసింప వచ్చిన శిష్యులును నాచార్యుల వారియెడ వినయవిధేయతలు గలిగి వర్తించుచు వారి విశేషానుగ్రహమునకు పాత్రులగుచుండిరి. గృహారాధనకు వలయు పరికరములును శిష్యులు వారికి కొదువలేక సమర్పించుచుండిరి. ఇట్లుండ నొకానొక దినంబున శ్రీ రామానుజులవారి

కర్తవ్యంగన కైంకర్య మొక విద్యార్థి యొనర్చుచుచు స్వగృహమున కలుగ కాలాతీతమయ్యెను. ఆ విద్యార్థి స్వగృహమున తానొక్కఁడే యుండుటంజేసి స్వయముగ పాకమొనర్చుకొనవలసి యుండెను. శ్రీ రామానుజులది గ్రహించి నాయనా యిప్పటికే కాలాతీతమైనది. యింటికఱిగి వంటజేసి భుజింప మఱింత ప్రొద్దుబోవును గాన మా యింటికఱిగి నాభార్య నడిగి పర్యుషితాన్నము బెట్టించుకొని భుజింపుమనిఁ బలికిరి. ఆచార్యాజ్ఞ మేఱకు శిష్యుడాచార్య పత్నినిఁగని యామె భర్తగారి నియమనము దెలిపెను. అపుడామె నేను స్నానముజేసి మడిగట్టుకొని యున్నాను. ఇంతప్రొద్దెక్కిన వెనుకనన్న మెందుండివచ్చును. అన్నములేదు, సున్నములేదని పలికి కవాటము దభీలుమని మూసి లోనికఱిగెను. స్వయముగ పాకముచేసుకోను శ్రమ యొకనాడైన తప్పిపోయేగదా యనుకొని కొండంతయాసతో వచ్చిన బ్రహ్మచారి బాలకుని మనోరథము బెండువలె చులకనయ్యెను. విఫలమనోరథుడై యాబాలుడాచార్య సన్నిధి కఱిగి వారి దేవిగారు పలికిని పలుకులన్నియు పూసగుచ్చినట్లు దైన్యమున విన్నవించెను. తమ యింట పర్యుషితాన్నము వలసినంత యుండుట యెఱింగి యుండియే విద్యార్థి బాలునిబంపి యుండుటచే శ్రీ రామానుజులు తమ భార్య పలికిన కఠినపు పలుకులు వీనుల ములుకులుగుచ్చినట్లయి మిగుల వ్యాకులపడి స్వయముగ ఆ విద్యార్థి బాలకుని తోడ్కొని స్వగృహమున కఱిగి వలసినంత పర్యుషితాన్నముండియు నిటుల ఆకలిగొన్న బాలుని విషయ

మున నసత్యమాడవలసిన దుస్థితి యేమియూడినదని భార్య యెడ కినుకబూని యడిగిరి. అపుడామె "నేను స్నానమొనర్చి మడిగట్టు కొని యుండుటచే నటుల జెప్పితి"ననెను. అపుడు వారు బొమ ముడివైచి" అసత్యము, పారుష్యము, వంచన యిత్యాదులే మడి యనుకొంటివి కాబోలు. దేహమునకు మలినము కలిగినటుల దోచిన స్నానముతో చరితార్థము జేసికొనవచ్చునుగాని, ఆత్మ నాశనకరమగు నిట్టి దుర్గణములకేమి ప్రాయశ్చిత్తముండునవి తలంచితివి? ఎట్టి వర్తనునైననే భరించెదగాని సత్యహీనుని మోపజాలననుచు పలుకదేతొల్లి భూదేవి బ్రహ్మతోడ" యను బలీయములగు బలివాక్యములు శ్రీ వామనావతార ఘట్టమున నున్న వని విన్ననేగదా ప్రస్తావవశమున బలికితిని. దుస్స్వభావ సంస్కా రణచే నడవడి దిద్దుకొనుట కుపయోగపడని వినికిడి భస్మహ వ్యము వంటిది. నీతో కాపురము యమపురమునకు దారితీయు నని యనుభవమున తెల్లమగుచున్నది. నీవొనర్చిన యపచార మునకు దండహస్తుని కడనేమి సమాధానముజెప్పి తప్పించుకొన దలచితివి? నీయత్యాచారములు సహింపనలవిగానివిగా పరిణ మించుచున్నవి. ఇది ప్రథమాపచారముగాదు సుమా. ఇంతకు పూర్వమే, ఆచార్యులయెడ నసహ్యాపచారము గావించి పతితురా లవై యుండ శ్రియఃపతి కటాక్షమున గండముగడచి గట్టెక్కితి వనుకొని యుంటిని. మరల నీ యత్యాచారముచే నీ యపచారము గావించితివి. ఇకమీద హెచ్చరికచే వర్తింపకున్న నీ వధోగతి నొందుదువుసుమా. జాగ్రతయని భయపెట్టి బ్రహ్మచారి బాల

కుని భుజింపజేసి పంపిరి. భార్యయు బాలకుని యెదుట భర్త తన్ను పరిభవించుటచే కాబోలు కంటనీరుగార్చుచు నోరు మూసు కొని మాఱుబలుకక లోనికరిగెను. మరల కొంతకాలము శ్రీమతి తంజమాంబ మెలకువతో కాపురము సాగించుచుండియు "స్వభావోదురతి క్రమః" అని పెద్దలు సాయించినరీతి మఱి యొక యపచారము తటస్థించెను. ఈ గండము గడచి గట్టెన పడుటయే సందేహముగ తోచును. ఇంతకాలము నుండి పరమ భాగవత శిఖామణియగు శ్రీ కాంచీపూర్ణుల యనుగ్రహము వలన నానాటికి స్వరూపజ్ఞానము వృద్ధినొందుచున్నందు కొకనాడైనను వారు తమయింట భుజింప నాహ్వానించి తదుచ్ఛిష్టశేష స్వీకార మొనర్ప నవకాశము లభింపకున్నందుకు కొఱత నొందుచుండిన శ్రీ రామానుజులవారు, యీనాడెటులైనను నీ కొఱత దీర్చుకొన వలెనని కృతనిశ్చయులైరి. ఆకారణముచే వారు శ్రీ కాంచీపూర్ణుల సన్నిధికరిగి వారితో "దాసునిగుడిసెకు దేవరవారు విచ్చేసి యాతిథ్యముగైకొని ధన్యునిగావింపుడని బ్రార్థించిరి." వారును శ్రీ రామానుజుల ప్రేమవిశ్వాసముల కలరి యటులనే గానిమ్మ నిరి. శ్రీ రామానుజులు భార్యకడ కరిగి "నేడు శ్రీ తిరుకచ్చి నంబిగారిని మనయింట నాతిథ్యము గైకొన నాహ్వానించితిని. భయభక్తులతో పాయసాపూపాది పదార్థపదార్థములన్నియు, పరి తృప్తికరముగ పాకమొనర్పవలసి యుండునని బలికిరి. శ్రీ తంజమాంబగారును భర్త యాజ్ఞ నౌదలదాల్చి శాల్యాన్న శాకా పూప పాయసాది పదార్థములన్నియు బహురుచ్యముగ సిద్ధపఱ

చెను. ఆచార్యులవారును నచ్యుతారాధన మొనర్చి నంబిగారి
కొఱకు చాలకాలము వేచియుండియు వారిజాడయే గానరాద
య్యెను. అపుడు శ్రీ రామానుజులవారు నంబిగారేలకొ రాకుండి
రని స్వయముగ వారికొఱకై యరిగిరి. శ్రీ కాంచీపూర్ణుల శ్రీ
రామానుజులవా రరిగిన మార్గమునగాక మఱియొక మార్గమున
విచ్చేసి, "అమ్మా మీ భర్తగారెచ్చట యని శ్రీమతి తంజమాంబ
నడుగ వీరే శ్రీ కాంచీపూర్ణులని మనంబున నూహించి" మావా
రింతవఱకు మీకొఱకే నిరీక్షించుచుండిరి. మీరెంతకాలము నిరీ
క్షించినను రాకుండుటచే యింతకుమునుపే మిమ్మలను స్వయ
ముగ తోడితేర నరిగిరి. అయిననేమాయె మీరు వారికొఱకు
కాచికొని యుండనవసరములేదు. ఇప్పటికే కాలాతీతమైనది.
మీరును ఆకలిగొని బడలియుంటిరి. లోనికి రండని పాద
ప్రక్షాళ నాదులకు తీర్థమొసంగి వారు గూర్చుండ నొక పీటవేసి
పీటముందుస్థల శుద్ధియొనర్చి వారొచ్చి పీటపై గూర్చుండగనే
నొక కదళీ పత్రమున భగవన్నివేదిత ప్రసాదమును తదితర
భోజ్యపదార్థములును గొనివచ్చి వారిముందిడి పెరుమాళ్ల తీర్థ
మొసంగి మిక్కిలి యాకలి గొంటిరి తృప్తికరముగ భుజింపుడని
బలికి లోనికరిగెను. వారారగించుచోటు శూద్ర సామాన్యులార
గించు చోటయ్యు వారందుకు కొంచమైనను సంకోచింపక మఱు
మాటాడక యా సతీమణి యొసంగిన యాతిధ్యము గైకొని యీ
దంపతులకు నేననవసర శ్రమగలిగించితినే యని మనంబున
వ్యాకులత నొందుచు, యామె మరల లోననుండివచ్చి మరేమి

యభీష్టమని యడుగక ముందే భుజించిలేచి తళిహాకు పరిహరించి శుద్ధియొనర్ప నుద్యుక్తులగు చుండిరి. అపుడు శ్రీమతి తంజ మాంబగారు లోననుండివచ్చి "అయ్యో మీకు యేమిగావలసి యుండెనో, నేనొచ్చునోపులనే యారగించి లేచితిరే"యని యుపచారవాక్యము బలుక వారందుకు అమ్మా నాకేకొదువయు లేదు తృప్తికరముగ భుజించితినన, వారొనర్పబోవు కార్యమునాపి నేనే తళిహాకు పరిహరించి శుద్ధియొనర్తును మీరాయాసబడ వలదు. ఇంచుక నిగ్రహింపుడని బలికెను. శ్రీ రామానుజుల వారింట లేనపుడు వచ్చిన కార్యము ముగిసిన వెనుక నందుండ నవసర మేమున్నదనుకొని "అమ్మా నేను కార్యాంతరము చూచుకొనవలసియున్నది. పోయివత్తునని"జెప్పి శ్రీ కాంచీ పూర్ణులు తామొచ్చిన మార్గముననే వేంచేసిరి. శ్రీ రామాను జులవారును శ్రీ కాంచీపూర్ణుల కొఱకు పలుచోటుల వెదకి యెందును గానక ప్రాయశః మార్గాంతరమున తమ యింటికే వేంచేసి యుందురేమో యని వారిని సత్కరింప సత్వరమున నింటికి వేంచేసిరి. శ్రీ రామానుజుల దేవిగారును శ్రీ కాంచీపూర్ణు లరిగిన పిదప ఆర్ద్రవస్త్రధారియై భుక్తపాత్రము పరిహరించి గోమయమున శుద్ధియొనర్చి మరల స్నానము జేయుచుండెను. శ్రీవారింటికి వచ్చిన తోడనే భార్య వైఖరిగని నంబిగారు వేంచేసి భుజించి యరిగిన సంగతి యామెవలన నెఱింగి యత్యంత సంతాపచిత్తులై యామె మరల స్నానమొనర్పవలసిన యవసర మును గుఱించి ప్రశ్నింప "శూద్రుడు భుజించి పోయినచోట

శుద్ధిచేయవలసి వచ్చుటచే మైలయై మరల స్నానము చేయు చుంటి"ననెను. అపుడు వారు మఱింత కటకటబడి "అయ్యో యవివేకురాలా! యెంత యపచార మొడిగట్టుకొంటివి. శ్రీ కరి గిరి వరదుని యపరావతారమగు శ్రీ తిరుకచ్చినంబిగారిని పరమ భాగవతులని యెంచక శూద్రసామాన్యునిగ నెంచిన నీ యస హ్యాపచారమున కేమిగతి యనుభవింపనుంటివి. "నశూద్రా భగవద్భక్తాః విప్రాః భాగవతాస్మృతాః। సర్వవర్ణేషుతే శూద్రాః యేహ్య భక్తాజనార్దనే" అను నార్యోక్తి మహాభాగవతులను శూద్ర సామాన్యులుగ భావింప రాదనియు, వారే బ్రాహ్మణులని, భాగవతులని భావించదగిన వారనియు, భగవద్భక్తిహీను లేవర్ణ మువారైననుసరే శూద్రులుగ నెంచదగిన వారనియు జెప్పుచుండ లేదా? ఇవి కేవలము నార్యోక్తులేగాక సాక్షాత్ భగవానులే యను గ్రహించిన శ్రీ సూక్తులుగదా. మహాభాగవతాపచార విమర్శ నీకెన్నిమారులంజేసి బాగుపరుప జూచినను నీబుద్ధి యత్యాచారము లచే పెడదోవనే త్రొక్కుచున్నది. నీవు చెడుటేగాక నన్ను గూడ చెరుపుచుంటివి. శ్రీ కాంచీపూర్ణ శ్రీహస్తమున తీర్థప్రసా దములు స్వీకరించి ధన్యుడనగుదునుగదా యని కొండంతయాసతో నున్నందుకు నన్ను విఫలమనోరథుం గావించితివి. ఇదివరకే నాకు ధారక పోషక భోగ్యముగ నుండు స్వాచార్యుల నిగ్రహము నకు గుఱియగు నంతటి మహాపచారము వారి పత్నియెడగావింప వారి నెటులనో ప్రార్థించి యపచారదోషము బాపుకొంటిమి. అంతకు మునుపే బ్రహ్మచారి బాలకునియెడ యొనర్చిన

యపచారము అసత్యలౌల్య యత్యాచార భూయిష్ఠముగా నుండి నను, నెటులనో ప్రథమాపచారమని సహించితిని. ప్రథమము, ద్వితీయము, తృతీయము నొకదానికొకటిద్విగుణీకృతత్రిగుణీకృత దోషావహ మగుచు నిక నెంతమాత్రము సహించినను నధోగతి పాలగు నటులజేయు ననుటలో నావంతయు సంశయములేదు. నీ పొత్తు రానురాను చిత్తవైకల్యమునకే కారణమగుచున్నది. యని విసుగుకొనుచు శ్రీకాంచీపూర్ణులను ప్రార్థించి యపరాధ క్షమాపణ వడయువఱకు నేను భుజింప నొల్లనని బలికి వారి కొఱకై శ్రీకరిగిరీశుని సన్నిధి కరిగిరి. ఈ పర్యాయము శ్రమ పడనవసరములేకనే శ్రీవరదరాజాలయ ముఖమండపముననే శ్రీకాంచీపూర్ణుల గనుగొనయ్యెను. శ్రీకాంచీపూర్ణులును దైన్యమున నంజలి బద్ధులై నిలుచున్న శ్రీరామానుజులవంక సంభ్రమాశ్చర్య చిత్తులై జూచి మీరింత త్వరితముగ వచ్చితిరేల? ప్రసాదమింకను నారగించి నటుల నగపడదే యనిరి. అపుడు వారు "దేవరవారియెడ దాసులు గావించిన యపరాధము క్షమింప వలయు, దాసుని యుపేక్షయు, మీదాసురాలి యజ్ఞతయు భాగవతాపచారమునకు కారణములయ్యెను. దేవరవారి మూలమున తీర్థ ప్రసాదములు స్వీకరించి కృతార్థులగుదుముగదా యని యాశగొని యుండ దేవరవారి యసదృశ పరిభావ మరయజాలక మీదాసురాలు దేవరవారియెడ మహాపరాధము గావించెను. ఇట్టి భాగవతాపచారమునకు దాసులక్షమింప దేవరవారిని ప్రార్థించుటకన్న వేఱొక మార్గము గానరామి తమ సన్నిధికి వెనువెంటనే రావలసివచ్చెను.

దేవరవారి యనుగ్రహము బడయక భుజింప నిచ్చవొడము నా మహాత్మా యని పలుకుచు శ్రీ తిరుకచ్చినంబిగారి తిరువడిత్తామరలపై వ్రాలిరి. అపుడు నంబిగారు కరుణాకటాక్షముచే శ్రీ రామానుజులవారినెత్తి కౌగలించుకొని," అయ్యా మీ విమలాశయము లనన్యసామాన్యములు. మీ స్వరూపమునుబట్టి భయపడుచున్నారేగాని మీ యిరువురియెడ నాకావంతయు దోషము గానవచ్చుటలేదు. నేను కార్యాంతరములచే సకాలమున మీ యింటికి రాజాలక మిమ్ముల ననవసరముగ నొప్పించితినే యని యనుతాపము నొందుచుంటిని. గావున మీరావంతయు సంకోచపడక యింటికరిగి మీ భార్యయెడ నాకావంతయు నిగ్రహభావములేదని నచ్చజెప్పి మీరిరువురును శీఘ్రముగ భుజింపుడు. దైవానుగ్రహముచే మీయింట నాకు దివ్యప్రసాదము లభించినది"అని వారిని సమాధానపరచి పంపిరి. శ్రీ రామానుజులు స్వగృహమునకు విచ్చేసి భార్యతో బ్రహ్మవేత్తయగు శ్రీ తిరుక్కచ్చినంబిగారియెడ నీవు గావించిన యపచారమునకు వారిని ప్రార్థించి ప్రసన్నులఁ గావించి వచ్చితిని. ఇకమీదనైన నీ స్వరూపమెటుల గాపాడుకొనియెదవో జాగ్రతయని బలికి భగవద్భాగవత భుక్తావసిష్ట ప్రసాదము స్వీకరించిరి. భార్య స్వభావ మిదివఱకే బాగుగ పరిశీలించి యుండినందున శ్రీ నంబిగారు భుజింపగా మిగిలిన ప్రసాదము నామె భుజించువఱకు కడుజాగరూకతతో గమనించుచునే యుండిరి. భర్తయాజ్ఞ విధిలేక యంగీకరింపవలసి వచ్చినదిగాని మనసారగాదని, యామె ముఖభావము

దెల్పుచుండినను నిట్టివారి స్వభావము సులభముగ మార్ప సాధ్య పడదని గాబోలు ఆచార్యుల వారావిషయమంతటితో విరమించిరి. మఱికొన్ని దినములు గడచిన వెనుక శ్రీ రామానుజులవారి దేవి గారి పుట్టినింటి నుండి నొకానొక శుభకార్యార్థ మాహ్వాన పత్రిక వచ్చినది. శ్రీ రామానుజులదియే తమ యుద్దేశ్యమునకు శుభ సూచకమని తలంచి భార్యకడ గరిగి యా శుభలేఖ చదివి పుట్టి నింట శుభకార్యము జూడ, బోయివచ్చెదవాయని యడిగిరి. ఆమె మందహాస వదనారవిందయై" మీరును నావెంట రాదలచుకొన లేదా ? యనెను. అపుడు వారు నేనిచ్చట తీవ్రమగు కార్యాం తరములు జూచుకొనవలసియున్నది. నీవు మాత్రము నిరభ్యం తరముగ వెళ్లవచ్చుననిరి. ఆవాక్య మామె వీనుల కమృతోప మానముగ నుండెను. గాని భర్తగారి వుద్దేశ్యము పుట్టినింటికి బోవనున్న సంతోషాతిశయముచే యామె గమనించినదిగాదు. నేనువచ్చి నిన్ను బిలుచుకొని వచ్చువఱకు నీ వచ్చటనే యుం డుము. యని జెప్పగనే తాను కాపురమునకొచ్చినదాది పుట్టినింటి మొగమెఱుగని యామెకా వాక్యములు మఱింత శ్రోత్రపేయము లయ్యెను. శ్రీ రామానుజులవా రామెను తగు సహాయముతోడను వలసిన పరికరములతోడను పుట్టినింటి కనిపి మఱుదినమే శ్రీ తిరుకచ్చి నంబిగారికి తమ మనోగతాభిప్రాయముదెల్పి వారి యనుమతి లభించి శ్రీ వరదరాజస్వామివారి సన్నిధి కరిగి ప్రక్రమ ప్రణామము లర్పించి స్తుతించి సన్యాస స్వీకారము

బ్రార్థించి యర్చ ముఖముగ శ్రియఃపతి యాజ్ఞవడసి శాస్త్రోక్త విధానమున సన్యాసాశ్రము గైకొనిరి.

శ్లో॥ ఉపవీతినమూర్ధ్వపుండ్ర వంతం, త్రిజగత్పుణ్య ఫలం, త్రిదండ హస్తం।
శరణాగత సార్థహమాదే శిఖయాశేఖరిణం పతిం యతీనాం॥

పదునేడవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ప దు నె ని మి ద వ గు చ్ఛ ము

శ్రీమద్రామానుజాచార్యులవారు సన్యాసాశ్రమ స్వీకార మొనర్చు నప్పటికి దాదాపు ముప్పదిరెండు వర్షముల వయస్సు గలిగియుండిరి. పలువురు వీరి సన్నిధి నిదివఱకే యాశ్రయించి సామాన్యశాస్త్ర గ్రంధములేగాక స్వరూప గ్రంధములు సయితము కాలక్షేప మొనర్చుచుండిరి. వారిలో వీరికి పూర్వాశ్రమమున భాగినేయులుగ నుండిన దాశరధసూరి యను వారొకరు. వీరినే ద్రావిడ నామమున ముధలి యాండాన్ యని బిలుతురు. శ్రీ కాంచీనగరమునకు తూర్పుభాగముననున్న పురుషమంగళమను గ్రామము వీరి నివాసస్థానము. ఆ భూసురాగ్రహారమున వేదాంత పారంగతులగు శ్రీ అనంతదీక్షితులను నొక శ్రీవైష్ణవోత్తముని పుత్రులు వీరు. శ్రీమద్రామానుజ మునీంద్రుల సన్నిధిలో పంచ సంస్కారము లభించినది మొదలు స్వాచార్య సన్నిధి నెడబా యక నిత్యనిరపరాధ కైంకర్యము లొనర్చుచు భయభక్తులతో

మెలంగుచుండిరి. శ్రీ యతీంద్రులకు పూర్వాశ్రమ సంబంధి శ్రీ అనంతభట్టను వారు, శ్రీ కాంచీనగరమునకు సమీపముననుండు కూరాగ్రహారవాసి., వీరును, తమ పుత్రుని వీరి సన్నిధానముననే నాశ్రయింపజేసి యుండిరి. వీరి పుత్రుల పేరు కూరేశులు. శ్రీ కూరేశులు స్వగ్రామము నుండి అప్పుడపుడొచ్చి ఆచార్యదర్శన మొనర్చి కొన్నిదినములు దర్శన రహస్యములు కాలక్షేపమొనర్చి బోవుచుండెడివారు. వీరి పవిత్ర చరిత్ర కొంత మున్ముందు పాఠకమహాశయులు గ్రహింపగలరు. శ్రీ యతీంద్రుల పినతల్లి కొమారులగు శ్రీ గోవిందమిశ్రులానాడు వింధ్యాటవిని విడిచి పోయినది మొదలు, మరల జూచుటకే అవకాశము లభింపకుం డుటచే వారిని తలంపునకు వచ్చినపుడంతయు, శ్రీ యతీంద్రులు సంతాపము నొందుచుండిరి. ఈయన, (గోవిందమిశ్రులు) శైవసి ద్ధాంత తత్పరులై కాళహస్తిలోశివాలయ కైంకర్య నిమగ్నులై యున్నారనువార్త కర్ణాకర్ణిగవిని చిరకాలము తమతో కలసిమెలసి యుండి వైదిక వైదికేతర మతములకుండు తారతమ్యము తెలిసి యుండియు యటులన్యమతమును పట్టుదలతో నవలంబించి యుండునాయను యనుమానము మాత్రము వీరికి కలుగుచుండక పోలేదు. తమమేనమామగారగు శ్రీ శ్రీ తిరుమల నంబిగారు (శ్రీ శైలపూర్ణులు) కాళహస్తికి సమీపమున నుండు, శ్రీ తిరుమల లోనే యుండిరిగదా. వీరిస్థితి యిటుల మాఱియుండిన వీరిని నింతవఱకు చక్కపఱుప యత్నింపకయే యుపేక్షించి యుండః రెన్నటికిని పొసగియుండదను ధైర్యముండుటచేతనే స్వయముః

నరిగి యథార్థపరిస్థితులఱయు కార్యాంతరపు తొందరలో సావకాశమైనది. ఎందరో సన్నిహిత బంధువులు తమ పుత్రుల నాశ్రయింపజేసి యుండుటయు, ఆశ్రయించిన వారు శ్రద్ధాభక్తులతో దర్శన రహస్యము లవకాశముండినపుడంతయు, వచ్చి, తెలిసికొని, కృతార్థులగుచుండుటయు, గోవిందమిశ్రులు మాత్రము చిరకాలము నుండి తమ్ము విశ్లేషించి యుండుటయు, తామాశ్రమ స్వీకారమొనర్చిన పిదప తలంప మనంబు నెక్కువగ గలంపసాగెను. ఆశ్రమ స్వీకారమునకు పూర్వమే వీరి పరిస్థితి తమ మేనమామగారి నుండి తెలిసికొని రమ్మని శ్రీ తిరుమల యాత్రకై పోవ నుద్యుక్తులైన నిరువురు శ్రీవైష్ణవులతో జెప్పి యుండిరి. ఆ శ్రీవైష్ణవ స్వాములును యథార్థపరిస్థితులఱయ తాము తిరుమలయాత్ర కరిగి నపుడు శ్రీ తిరుమల నంబిగారు కాళహస్తి కరిగియుండిరనియు, తాము వారిని గుఱించి విని నంతలో శ్రీ గోవిందమిశ్రుల యాశయములతి గూఢముగ నుండు టచే వాస్తవస్థితి తెలిసికొన నెవ్వరికి సాధ్యపడలేదనియు, బాహ్య వేషము, తదనుగుణమగు ప్రవర్తనము భ్రమించుటకు వలసి నంత యవకాశ మివ్వక పోలేదనియు తెల్పియుండిరి. అదివిని శ్రీ రామానుజులు మేనమామగారికి శ్రీ గోవిందమిశ్రులను గుఱిం చిన వార్త తెల్పమని విజ్ఞాపన పత్రిక వ్రాసుకొని యుండిరి. అందు కింకను ప్రత్యుత్తరము రాకుండుటచే డోలాయమాన మానసులగుచు ననుక్షణమును శ్రీ గోవిందమిశ్రులను గుఱిం చిన సువార్తకుగాను నిరీక్షించుచుండిరి. ఇక శ్రీ గోవింద

మిశ్రుల పరిస్థితు లించుక విచారింతము. తమ భాగియుడగు గోవిందమిశ్రుడు శ్రియఃపతి పరత్వమునుచాటు శ్రీవైష్ణవమత సంప్రదాయమునుమాని శివపరత్వమునుజెప్పు శైవమత సంప్రదాయము నవలంబించుటేగాక ప్రచారముగూడ నొనర్చుచున్నాడను వార్తానలము శ్రీ వెంకటేశుని ఏడుకొండలుదాటి శ్రీశైలపూర్ణుల కర్ణములుజొచ్చి తీవ్రవేదన గావింపజొచ్చెను. శ్రీ శ్రీనివాసుని చిద్విలాస మివ్విధమని తెలిసికొనజాలక తారుమారగుచు వారొకానొక దినమున భగవన్ముఖముననే, కారణము లఱయదలచి శ్రీ యానంద నిలయ విమానమునకు బ్రదక్షిణ మొనర్చి, సన్నిధిలోని కఱిగి యంజలి బద్ధులై "శ్లో॥ రేఖామయధ్వజ సుధా కలశాత పత్రవజ్రాంకు శాంబురుహకల్పక శంఖచక్రైః। దివ్యైరలంకృతతలైః పరతత్వచిహ్నైః శ్రీ శ్రీనివాస చరణౌ, శరణం ప్రపద్యే॥" యను శ్లోకమునందుగల భావమిమిడి యుండునటుల శ్రియఃపతిని శరణుజొచ్చి దేవా కలికలుష భూయిష్ఠమగు సమయముగని దుర్మత దావానలమును విలక్షణ విజ్ఞాన బోధామృతము చేనార్పి, జీవాంకురముల నెప్పటియటుల నుజ్జీవింపనెంచియేగదా నిత్యసూరి సత్తములలో శ్రీ యనంత, వైనతేయాంశజులగు రామానుజ గోవిందమిశ్రుల నివ్విభూతి నవతరింపజేసితివని యర్చకముఖమున పలుమారు వాక్రుచ్చుచుంటిరి. రామానుజుడు, యద్వైత మతావలంబించి యగుటకును, గోవిందుడు శైవమతావలంబియగుటకును, కారణమిహింపజాలక సంతత సంతాపమగ్నుడనగు నీ దీనుని సంశయముమాన్పి గావవేడెదనవి ప్రార్థించిరి.

అటుల బ్రార్థించిన రాత్రియే పరమపురుషుడు నంబిగారికి దివ్య దర్శనము స్వప్నమున నొసంగి పితామహా పరమ వైదిక శ్రీవైష్ణవ సిద్ధాంతమునకు పూర్వపక్ష సిద్ధాంతము గ్రహించిన గాని కుదృష్టి వాతావరణ మెగరజిమ్మ సాధ్యముగామి, రామానుజుని యద్వైతయతియగు యాదవ ప్రకాశకునికడ నద్వైత సిద్ధాంతము సాంతముగ తెలిసికొన ప్రేరేపించితిని. విష్ణువైష్ణవ విద్వేషమే స్వరూపమని భ్రమించి, సంతత తారకమంత్ర జప పరాయణుడగు నిటలాక్షుని నిగ్రహమునకే పాత్రులై నానాటి కధోగతి నొందుచుండు నాభాసశైవుల(జక్కదిద్ది, నశైవసిద్ధాంతము నెలకొల్పనెంచి "వేదాత్మవిహగేశ్వరః" యని విఖ్యాతిగాంచిన వైనతేయాంశజుడగు గోవిందమిశ్రుని తాత్కాలికముగ వైష్ణవమతవై ముఖ్యముగలవానివలె వేషభాషల గన్పట్ట బ్రేరేపించితిని. వీరి మనోభావములన్ననో మిక్కిలి పరిశుద్ధముగ నున్నవి. వర్తనములు మాత్రము, మఱికొన్ని దినములు విపరీతముగ గన్పట్టకపోవు నామాట విశ్వసించి కొంతకాల మోపిక బట్టియుండిన, యధార్థ పరిస్థితులు నీకే గోచరింపకపోవు. ఇంత మాత్రమునకు సంతాపపడనేల యని శ్రీశైలపూర్ణుల తిరుమేను తమ శ్రీహస్తముననిమిరి, యదృశ్యులైరి. సకల సంతాప శామకమగు శ్రియఃపతి శ్రీహస్తము, తిరుమేను సోకుటచే తిరుమల నంబి తిరుమేను పులకరించి, యనిర్వాచానందము గావించినది. అపుడు వారాకస్మికముగ మేల్కాని కన్నులు విచ్చిచూచి స్వప్నమున నగపడిన భగవద్దివ్య మంగళ విగ్రహమును, నమృతోప

మానమగు శ్రియఃపతి శ్రీ సూక్తులను పలుమాఱు స్మరించి యానందాబ్ధిం దేలి శ్రీ శ్రీనివాసుని యవ్యాజ కటాక్ష మన్యథా పరిణమించుట కించుకైన నవకాశము లేదని ధైర్యమూని యెప్పటి వలె నిత్యకైంకర్య తత్పరులై యుండిరి. ఈ పరిస్థితి యంతయు శ్రీ గోవిందమిశ్రులు వారణాసి నుండివచ్చి స్వగ్రామమునం దె శైవమత ప్రచారము గావించుచుండిన కాలమునకు సంబంధించి నది. మఱి కొంతకాలమునకు శ్రీ రామానుజులవారు, తమకు పరమమిత్రులును, తమవలెనే శ్రీ మద్యామునముని తిరువడి నాశ్రయించినవారును, పరమభాగవతోత్తములును, నగు శ్రీ పరాంకుశ దాసులవారి నాశ్రయించి పంచసంస్కారాది హితములన్నియు లభించిరనియు, శ్రీ కాంచీపూర్ణుల యభిమానమునకు సయితము పాత్రులైరనియు, దెలియ వచ్చుటచే స్వప్నముఖమున శ్రియఃపతి యనుగ్రహించిన శ్రీ సూక్తులు. వీరి విషయమై ఫలించినవని యానందించుచు, నటులనే శ్రీ గోవిందమిశ్రులను గుఱించి యనుగ్రహించిన శ్రీ సూక్తులు సహితము ఫలింపక పోవని కొంత ధైర్యము వహించి యుండిరి. కొంతకాలమిటుల జఱుగ శ్రీ గోవిందమిశ్రులు స్వగ్రామము వదలి కాళహస్తీశ్వరాలయ కైంకర్యము నిర్వహించుచు శైవమత ప్రచార మొనర్చుచున్నారని తెలియవచ్చెను. ఆనందనిలయచ్ఛాయ యితనిపై ప్రసరించి యుజ్జీవింప శ్రియఃపతి సంకల్పించియే దాదాపు తమ చెంతకే రప్పించుకొనెనవి మనంబున నలరుచు, శ్రీ శైలపూర్ణులు భాగినేయుని పరిస్థితి కనుగొనియైన వత్తమని శ్రియఃపతికి దం

దము సమర్పించి కాళహస్తి కరిగిరి. భాగినేయుడో బహుశిష్య
సమేతుడై. భస్మోద్ధూళిత సర్వావయవుండై రుద్రాక్షమాలాలంకృత
వక్షుడై సువర్ణముఖి నుండి కాలహస్తీశుని యాలయము వంక
బోవుచుండెను. వారాసన్నివేశము కన్నులారగని మిక్కిలి
యనుతాపపడి కర్తవ్యమూహింపజాలక కాలహస్తి నుండి ఖిన్న
వదనులై మఱలి తిరుమలవచ్చి చేఱుకొనిరి. శ్రీ గోవింద
మిశ్రులు కాళహస్తిలోని యాలయ కైంకర్యములు యోగ్యులగు
వారి మూలమున నిర్వహింపజేయుచు, తమ సంకల్పము మేఱకు
సత్వైవ సిద్ధాంత ప్రచారము గావించుచు, పలువుర నుజ్జీవింపఁ
జేయుచుండిరి. శ్రీ తారకమంత్ర జపపరాయణుండగు నిటలాక్షుని
నిగ్రహమునకు గుఱిగాకుండుటకును, మున్ముందు శ్రియఃపతి
యనుగ్రహము లభించుటకును తదీయులగు శ్రీవైష్ణవులయెడ
ద్వేషమావంతయులేక ప్రేమవిశ్వాసములతో మెలంగుటయే
చక్కని మార్గమని పలుమాఱునొక్కి చెప్పుచుండిరి. కొందఱీ
నూతన బోధలోని యౌచిత్యము గ్రహించినను, కొందఱు
మాత్రము శివపరత్వమునుఛాటు గ్రంధములు గొనివచ్చి, వారికి
జూపి వీటిపై మీయభిప్రాయ మేమని యడిగిరి. అపుడు శ్రీ
గోవిందమిశ్రులు "నాయనలారా భగవంతుని దృష్టిలో త్రిగుణ
స్వభావముగల జీవులుందురుగదా. వారవ్యక్త చైతన్యముగల
శిలాతరు, గుల్మలతాది జన్మములుబగడచి. చైతన్యశక్తి గానవచ్చి
యు విశేషకార్యకారిగాని పశుపక్షి మృగాది జన్మములెత్తి భగవద
వ్యాజ కటాక్షముచే మనుజులై జన్మింతురు. శాపోపహతులగు

కొందఱకుదక్క నితర జీవులకందఱకును మనుష్య జన్మము లభించిన వెనుకనే పుణ్యపాపముల ననుసరించి భగవంతుడు వారికి స్వర్గనరకానుభవము గలుగజేయుచుండును. మనుజత్వ మప్పుడపుడే లభించిన కొందఱకు యింకను తమోగుణము విరివిగా నుండుటనుబట్టి పరహింసాది పాపకార్యాసక్తి వదలిపోదు. శ్రియఃపతియు, పైపైజన్మలు లభించుటకై, త్రైగుణ్యమగు వేదములో వీరి రుచ్యను గుణముగ నందుండు క్షుద్రమంత్రములును, నందుకు దగిన ఫలములును, క్షుద్రఫలానుభవముగలవారి మూలమునఁ దెలియపఱచి, యవి వీరికి సులభముగ యలవడు నట్లొనర్చును. అవివారు జపించి ఆయా దేవతల మూలమున క్షుద్రఫలములే శీఘ్రమున లభింతురు. ఈ వేదగర్భితతాంస భాగము వలన ప్రత్యక్ష సిద్ధమగు మనుజుల కన్నను నత్యధికశక్తి సంపన్నులగు దేవతలు కొందఱు గలరనియు, కేవల మనుజుల మూలమున లభించు ఫలముల కన్నను, నధిక ఫలములీ దేవత లివ్వ సమర్థులనియు, యల్పకాలము వారి యుపాసన మొనర్చిన మాత్రముననే వారు ప్రసన్నులై తమ కోర్కులీడేర్తురనియు నమ్మకము గలుగును. యక్షిణీ, భైరవ, భేతాళా ద్యుపాసనలును, మఱికొన్ని గ్రామ్యశక్త్యుపాసనలును నిందుకై యేర్పడినవే. ఇట్టి తామసదేవతోపాసనలు తాత్కాలిక కార్యకారులై, పరిణామమున పలువిధబాధలు గలిగించి, దేహవిమోచనానంతరము యమయాతనలకే యాకరమగును. . కొన్ని సమయములలో రాజదండనలు సయితమిందే యనుభవింపవలసి యుండును.

ఇట్టి తామసదేవతోపాసనకును, సాత్విక భగవదుపాసనకును, పాపరకాయకును పనసతొళలకును నున్నంతరుచి భేదముండును. తమోగుణం బావరించి యుండుటచే భగవదుపాసనారుచి వీరికి వెగటుగదోచును. దుఃఖప్రారబ్ధ పరిణామమగు క్షుద్రదేవతో పాసనచే గలుగు బాధలనుభవించి విసిగి వాటికి కొంతవఱకైన విముఖులైనపుడే యింతకు పైతరగతి నరయమానవుడు యత్నించును. అపుడు వేదగర్భిత రాజస భాగములలోని యింద్రాది దేవతోపాసనగల తరగతి భగవంతుడు వీనికి గోచరింపజేసి యందు రుచికలిగించును. వాడును తత్ప్రయత్న మొనర్చును. తామసదేవతోపాసకులకువలె నీ యుపాసకులకు భగవదుపాసనలో కేవల విముఖతలేకున్నను వైలక్షణ్య జ్ఞానాభావముచే ఉపేక్షమాత్ర ముండకపోదు. తామసకార్య రుచివాసన లింకను కొంత శేషించియు, యింద్రాది దేవతోపాసన సల్పువారు తా ముపాసన మొనర్చు దేవతల మూలమున నైతము పరులను బాధించు వరములేవేడి యవి లభించి హిరణ్య, రావణ, బాణాసుర, భస్మాసురాదులవలె దుష్ప్రవర్తనకులోనై తుదకు ఇహపరముల కష్టములనుభవింతురు. తమోగుణము చాలవఱకుతగ్గి రజోగుణ ప్రాచుర్యతగలవారు యితరులకు బాధలేని ఫలితములే తమ యుపాసనా దేవతల మూలమున లభింపగోరి, యవి లభించి సుఖింతురు. రాజసము తామసభాగమున కొంక వంకను, సాత్వికభాగమున కొంకవంకను పొదువుగా నుండునది. సాత్విక భాగ మిందులో కొంత కలిసెనా తాముపాసించు దేవతల మూల

మున శాశ్వత సుఖానందమనుభవింప నిచ్చగలిగి యవ్విధమున నే నుపాసింతురు. పరవస్తు నిర్ణయజ్ఞానమింకను లేవితరగతికి చేరిన వారగుటచే ఆయా దేవతా సాయుజ్యమో లేక యల్ప యస్థిర ఫలమో లభింతురు. ఇట్టి ఫలములుగూడ జన్మపరంపర లకే కారణమైనందున నవిచవిజూచి వాటిపై జుగుప్స, వెగటు కొంతవఱకైన జనించువఱకు దీనిపై నుండు సాత్విక తరగతి నరయ యత్నింప రుచిపుట్టదు. తన్ను పేక్షించు దశలో నుండు వీరికి భగవంతుడని చూపనూ చూపదు. పుణ్యప్రారబ్ధ పరిణామ మగు నింద్రాది దేవతోపాసనా ఫలములు పరిమిత ఫలమే యిహ పరముల నొసంగి యింద్రాది దేవతాలోకముల కరిగినను "క్షీణే పుణ్యేమర్త్యలోకం విశంతి" యను శ్రుతివాక్యాను సారము మరల వారివారికర్మ తారతమ్యము కొలది జన్మమెత్తవలసి యుండును. ఇట్టి రాజసోపాసనకు, భగవదుపాసనకు పచ్చి మిరపకాయకు, పనసతొళకున్నంతరుచి బేధముండును. ఇట్టి రాజస దేవతోపాసనమందును విసుగుబుట్టి శాశ్వత సుఖములం బడయ కొందఱు యత్నింతురుగాని త్రిగుణములలో సత్వభాగ మింకను వలసినంత వారియెడ లేకుండుటచే పరతత్వ నిర్ణయ జ్ఞానాభావముచే తాముపాసించు నింద్రాది దేవతలే పరత్వమని భ్రమించి వారి సాయుజ్యమునే బొందుదురు. భగవద్భాగవత దూషణా తత్పరులకు మాత్రము తమ తమ యుపాసనామూర్తుల విగ్రహమే కొంతకాలమైనను నరకానుభవమున కాకరముగాక పోదు. అన్యదేవతల నుపాసించువారిలో పలవురీ యుగమున

భగవద్భాగవత దూషణమొనర్చుచే తాముపాసించు దేవతలకు ముఖోల్లాసమని భ్రమించి, యటులనే యొనర్చి, తమ యుపాసన దేవతానిగ్రహమునకు గుఱియైన వారగుదురు. ఇట్టి యపచారము లెవ్వియులేని వారియెడ తాముపాసించు దేవతా మూర్తులును ప్రసన్నులై, జాలిగొని సాత్విక తరగతి జూపుదురు. అపుడు వారు సాత్విక శాస్త్రాన్వేషులై పరతత్వ నిర్ణయ జ్ఞానముగలిగి తమ తమ యుపాసనా మూర్తుల మూలమున శాశ్వత సుఖమొసంగు భగవదుపాసనపై రుచిగల్గి క్రమముగ నుజ్జీవింతురు. ఈ తరగతివారియందు భగవద్భాగవత దూషణ సహజముగ గానరాదు. ప్రారబ్ధకర్మబలముచే బుద్ధిపూర్వకముగ గలిగిన, యమదండనచే దిద్దుబాటు నొందుచు సాత్విక తరగతికేఁ జేరి యుందురు. ప్రామాదిక దోషము లనుతాపముచే తొలగును. సాత్విక తరగతియందే వీరుండుటకు కారణము వారుపాసించుచుండు దేవతానుగ్రహముచే, పరత్వ నిర్ణయజ్ఞానము, భగవద్భక్తుల దూషణ, భగవన్నిగ్రహమునకే కారణమను జ్ఞానము, కలిగి యుండుటచే. ఇట్టి విలక్షణ జ్ఞానముండియు, విష్ణుదూషణము రవలేశమైనలేక, భగవవంతునిపై ప్రేమగాఢముగ నున్నను, భాగవత దూషణ యలవడి యుండినంత వఱకు, యమదండన తప్పదని దృఢముగా నమ్మెడు. దండనయు ఆయా జీవుల సత్వరోజ్జీవనమునకే యైయుండును. శ్రియఃపతి యుపాసనమందు రుచి పుట్టించుటకు పూర్వము ముఖ్యముగ శంకరోపాసన శ్రద్ధాభక్తులతో నొనర్చి, యా మహాభాగవతుని యనుగ్రహము

పొందవలసి యుండును. ఆయన విష్ణువైష్ణవద్వేష మెంత మాత్రమును సహించువాడుగాడు. మీయందు విష్ణువైష్ణవద్వేషము ప్రామాదికముగనైనను లేకుండఁ తొలగించి పైపై సాత్విక తరగతుల లభింపజేయుటకు శ్రీ శంకరుడు సంకల్పించి యుండ బట్టియే, మావంటి వారిబోధపై యద్వేషాభి ముఖ్యములు గలవారైతిరి. శ్రీ మహావిష్ణుసాయుజ్యము సుఖపరమావధి అది. సద్వారకముగ లభించుటకే మొదలు విష్ణువైష్ణవద్వేష రహిత శంకరోపాసన, ఇందుకు శివపంచాక్షరీ మంత్ర మత్యావశ్యకము. అది మీకెటులనో లభించినది. ఇది దివ్యౌషధము. ఇందుకు పథ్యము విష్ణువైష్ణవ ప్రేమయే యని దృఢముగ నమ్ముడు. దేవతలందఱు విష్ణుభక్తులే. భగవదాజ్ఞ శిరసావహించి యా బ్రహ్మరుద్రాది దేవతలందఱు తమ కాయన నియమించిన కార్యములం దప్రమత్తులై మెలంగుచుందురు. ఇటుల వేదోపబృంహణములగు సాత్విక గ్రంథము లెన్నియో నుద్ఘోషించుచున్నవి. "వైష్ణవానామ హంశంభుః" అను శ్రీ సూక్తినిబట్టి పార్వతీపతి శ్రియఃపతి కెంతప్రియ తమ భక్తుడో మీరే యూహింపుడు. గనుక శ్రీ శంకరముఖోల్లాసముగ వర్తించుటే సశ్శైవ సిద్ధాంత మవలంబించు వారికి విధి" అని యిటుల శ్రీ గోవిందమిశ్రులు "ఉళ్లంగైకొండ నయనార"ను ద్రావిడ బిరుదనామమున పిలువబడుచు తమ యాశ్రితుల కనుదినంబును బోధించుచు క్రమభక్తి సోపానమున నిలువ దృఢశక్తి వారికిఁ గలుగజేయుచుండెను.

పదునెనిమిదవ గుచ్ఛము—సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## పం దొ మ్మి ద వ గు చ్ఛ ము

---

శ్రీశైలపూర్ణులు, తమ భాగినేయులగు శ్రీ గోవిందమిశ్రు లాశ్రితులకు గావించుబోధ, కేవలము భగవత్ప్రేరితమేయని స్వప్నమువలన తెలిసియుండినను "అతిస్నేహపాపశంకీ" యను నార్యోక్తి కనుగుణముగ కేవలము శైవమతములోనే యతడు క్రమముగ జేరుకొనునేమో యని శంకించి, శ్రియఃపతి కరుణ చేతను, స్వాచార్య కటాక్షముచేతను, నతనిని తన్మార్గము నుండి తొలగించి పరమవైదిక సిద్ధాంత మవలంబించు నటులొనర్ప బూని భగవదాజ్ఞగైకొని, మరల నొక పర్యాయము కాళహస్తికిం బోయి సువర్ణముఖీనదీతీరస్థమగు నొక రమ్యారామముననుండిరి. బిల్వపత్రియు, మారేడుదళములును, పుష్పములును శివపూజా ర్థము గొనిపోవుటకై యనుదినంబును నాతోటలోనికే ఉళ్లంగై కొండనయనార్ (గోవిందమిశ్రులు) వచ్చువాడుకచే కాబోలు. యానాడును వారు శ్రీశైలపూర్ణులువేంచేసి యుండిన తోటలోనికి

వచ్చి మారేడు దళములు సేకరించుచుండిరి. అపుడు శ్రీశైల పూర్ణులు, స్వాచార్యానుగ్రహీత స్తోత్రరత్నములోని శ్లో॥ కశ్శ్రీ శ్శ్రియః పరమ సత్వసమాశ్రయః కః, కః పుణ్డరీకనయనః పురుషోత్తమః కః, కస్యాయుతాయుత శతైకకళాంశకాంశే, విశ్వం విచిత్ర చిదచిత్ప్రవిభాగవృత్తమ్॥ (ఎవడు సకలలోక జననియగు శ్రీదేవికి సంపత్తైనవాడో, యెవడు తమోగుణ రజోగుణ స్పర్శలేశమైనలేని శుద్ధసత్వగుణమున కాశ్రయమైనవాడో, యెవ్వడపుడపుడే వికసించిన తెల్లదామరల వంటి నేత్రములుగలవాడో, యెవడు పురుషసూక్తోక్త పురుషోత్తమత్వముగలవాడో, యెవనియొక్కయసంఖ్యాకములైన కోట్లసంఖ్యలలో నేకదేశాణు మాత్రమందనంత కోటిబ్రహ్మాండములలోని చిదచిత్తులు పరస్పర భేదములు గలవిగానేర్పఱుపబడియున్నవో, యటువంటినిన్నాసుర ప్రకృతులు దెలిసికొనలేరని ముందు తెల్పబోవు విషయములోని కన్వయము) యను శ్లోకమును నొక తాళపత్రమున లిఖించి గోవిందమిశ్రులు తోట నుండివచ్చు మార్గమధ్యమున నొక చోవైచి యాతని వైఖరి గమనించుచుండిరి. ఆ శ్లోకము, సకల కల్యాణగుణ పరిపూర్ణుండగు, శ్రీ శ్రియఃపతి పరత్వమును చాటునర్థముగలది. గోవింద మిశ్రులు, ఫలపుష్పంబులు సేకరించుకొని, యాలయమున కరుగుచు శ్రీశైలపూర్ణులు మార్గమధ్యముననుంచి యుండిన తాళపత్రముఁగని, యందుండు విషయములు గ్రహించి, దానివి కన్నుల కొత్తుకొని, శీఘ్రముగ శ్రీశైలపూర్ణులకడకు విచ్చేసి, "ఇది మీ చెంతనుండదగిన తాళపత్రమని దానిని వారి కర్పించి యంజలి

జోడించి, దేవపూజకు వేళయైనదని విన్నవించుకొని వెడలిరి. శ్రీ శ్రీ తిరుమల నంబిగారును, మేనల్లుని పరిస్థితిని గుఱించి యతనితో మందలించుట కవకాశ మించుకైన గలుగనందుకు వ్యాకులపడి "ఇతడు వీరశైవుడుగమాఱి నట్లగపడదు. అటుల మాఱియే యుండిన యీ తాళపత్రమును క్రోధావిష్టమానసుడై జింపివైచి పోయియుండును. ఇదిగాక, వీరశైవదీక్ష వహించు వారు, ముఖ్యముగ నీకాలములో తమ యవర్జనీయన సంబంధువులకు విష్ణువైష్ణవ సంబంధము లేశమున్నదని దోచినను సహింపరు. మీదుమిక్కిలి యసూయచే జాతురుగాని యితనివలె నప్రభావమున వర్తించరు. అట్టి విపరీత వర్తన మితనియెడ కానరాకపోవుట కానాటిస్వప్న సందేశమే సాక్షి. స్వప్నసందేశమే నిదర్శనమై నపుడు నేడుగాకున్న మఱొకనాడైనను నితని మనంబు మఱల్ప నవకాశ ముండకపోదు." అని యనుకొనుచు మరల తిరుమలకు విచ్చేసిరి. ఆ సమయముననే శ్రీమద్రామానుజులు యత్యాశ్రమ స్వీకారమొనర్చి యుండుటయు శ్రీగోవిందమిశ్రుల పరిస్థితి వరయ తీవ్రపడుచుండుటయు, యందుకొఱకై యిరువురు శ్రీవైష్ణవులను శ్రీశైలపూర్ణుల సన్నిధికఱిగి యథార్థ పరిస్థితులన్నియు తెలిసి కొని రండని పంపియుండుటయు,యిదివఱకే పాఠకమహాశయులు గ్రహించియుందురు. శ్రీ తిరుమల నంబిగారును శ్రీ గోవింద మిశ్రుల పరిస్థితియంతయును, తమ యుద్యమమును, శ్రీ యతీంద్రులకు తెల్పియుండిరి. శ్రీ యతీంద్రులును తామూహించి యుండినటులే శ్రీ గోవిందమిశ్రుల పరిస్థితి యేర్పడినటుల దెలిసి

శీఘ్రముగ శ్రీవైష్ణవ సిద్ధాంతమున నతడుజేరుకొని సుఖింప శ్రియఃపతిని ప్రార్థించుచుండిరి. శ్రీ శ్రీతిరుమల నంబిగారి తిరుమేను తిరుమలలో నుండినను భావవీచికలు భాగినేయుని వంకనేఁ బొఱలుచుండినవి. ఏది యెటులున్నను భగవన్మహోల్లాస నిత్యకైంకర్యములేమఱక నొనర్పవలసి యుండునుగదా. మఱి కొన్ని దినము లిటులగడవ భాగినేయుని విషయమైన, తీవ్రతహెచ్చెను. ఈ పర్యాయ మెటులనైన, శ్రీ శ్రీనివాసుని విశేషానుగ్రహము లభించి, కడసారి కాళహస్తి కరిగివత్తమని, భగవత్సన్నిధికి విచ్చేసి, తమ యుద్యమము నెఱవేర్పనా దయామయుని పలువిధముల ప్రార్థించిరి. అటుల ప్రార్థించునపుడు తమ దక్షిణనేత్ర సంచలన మొకింత ధైర్యము గూర్చినది. ఇందుకుతోడు శ్రీ తిరువేంగడముడయాను తిరుముఖమండలమును మఱింత సుప్రసన్నముగ గానవచ్చెను. ఇట్టిశుభసూచకములఁగని శ్రీశైలపూర్ణులు సంతసించుచు, కతిపయ శిష్యవర్గముతో కాళహస్తి కఱుదెంచి తాము మునుందు విశ్రమించి యుండిన యా రామముననకే మరల విచ్చేసిరి. ఆనాడును ధూమపావక శిఖవలె వెలుంగుచుండు శ్రీ గోవిందమిశ్రులు, యాశ్రితులకు శ్రీ శఠగోప ప్రబంధములోని రహస్యాంశములఁగ్గడించుచుండు తమ మేనమామ గారినిగని నమస్కరించి, తోటలోని కొన్ని ఫలపుష్పంబులు శివపూజార్థము సేకరించుకొనివచ్చి సమీపమున నుండు నొక మారేడు వృక్షమునెక్కి దళములుగోయుచు "వెనుక రెండు పర్యాయము లిమ్మహాభాగవతోత్తముని దర్శించు భాగ్యము లభించి యుండి

నది. నేడును నటులనే లభించినది. నన్ను మరల శ్రీవైష్ణవ దర్శనమునకు మఱల్ప యత్నించియే వీరు విచ్చేయు చుండిరని దెలిసియు కార్యతీవ్రతచే నంతగ గమనింపనైతి. శ్రియఃపతి నామూలమున నెఱవేర్పదలచిన కైంకర్యము లింకను కొఱతఃబడి యుండ నాకాసమయమున విమర్శించుకొన నవకాశమే లభింప దయ్యె. ఇదియునుగాక యాదృచ్ఛికముగ చేజిక్కిన తాళపత్రి నుపేక్షించిన వానివలె వర్తించి యిమ్మహాభాగవతునియెడ మహా పరాధం బొనర్చితి "క్షమాసారాహి సాధవః" యను నార్యోక్తి ననుసరించి వీరు విఫలమనోరథులైనను నాపై కోపగించుకొనుటకు మాఱుజాలిగొని యరిగిరి. ఈ పర్యాయమైనను నితని చిత్త వృత్తి మారదాయని కాబోలు కొండంత యాసతో నేడు కొండలు గడచి యిందు విచ్చేసి యుండనోపు. అట్లు గాకున్న నా పూర్వ స్థితిని దలచి నిర్వేదముచే నిన్నరేయి నేను శయనింప శ్రియఃపతి స్వప్నమున సాక్షాత్కరించి "నేసంకల్పించిన కార్యము నీ మూల మున నెఱవేఱినది. మఱి కొంతకాలమైనను, నీ బోధచే సశ్రైవ మతము కొందఱైన నవలంబించి కాలక్రమమున కడతేర నవ కాశమేర్పడినది. ఇక నీ వచిరకాలముననే నీ వారిని చేఱుకొని మున్ముందు పరమవైదిక సిద్ధాంతవ్యాప్తి నొనర్చుటలో శ్రీ రామానుజులకు తోడ్పడగలవని యేలదెల్పుదురు. వీరును సమయముననకే విచ్చేసిరి. ఇక కర్తవ్యోపాయము శీఘ్రముగ నఱయ వలయు" ననుకొనుచుండిరి. శ్రీ తిరుమల నంబిగారా సమయమున కనుగుణముగ శ్రీ తిరువాయిమొళిలోని ద్వితీయ

శతక మాశ్రితుల కనుగ్రహించుచు "తేపుమెప్పొరుళుంబదైక్క" యను పాశురమునకు వ్యాఖ్యాన మనుగ్రహించుచుండిరి. శ్రీ శఠగోప దివ్యప్రబంధము నంతయు నాంధ్రగీర్వాణములఁ బరి వర్తన మొనర్చిన శ్రీమాౕ మేడేపల్లి వెంకటరమణాచార్యులను నొక యాధునిక భాగవత శిఖామణి యీ పాశురమును సంస్కృత మున శ్లో॥ నాభీసరోజముకుశేచతురాననంయః ప్రాకృస్లష్టవాం స్తదను దేవగణాౕ మనుష్యాౕ।తంపుండరీకదళ దీర్ఘదృశం మదీశం త్యక్త్వాపరఃక ఇహపూజన భాజనంస్యాత్॥ యనియు, నాంధ్రమున తే॥గీ॥ వివిధమౌవస్తు జాతంబు విబుధతతివి సృష్టి సేయంగ దొలివిరించిని సృజించి, వేదసమితిని గరపెడు వేద వేద్యు, డంబుజాక్షుండు హరిదక్క నన్యులెవరు పూజనంబంద సర్హులు పుష్పములను॥ యనియు పరోజ్జీవన పరతచే ననుగ్రహించి యాంధ్రదేశ ముముక్షుపుల కత్యంత కృతజ్ఞతా పూర్వక స్తుతి పాత్రులైరి. ఇట్టి యమూల్య భావముగల పాశురములు వ్యాఖ్యాన మొనర్చుటేగాక తమ శిష్యులలో నొకరిని పూర్వపక్షిగాను, తామందుకు శాస్త్రీయ సమాధాన మొసంగు వారుగను నేకాంతమున నేర్పాటుగావించుకొని శ్రీ గోవిందమిశ్రుల కొక వేళ నీ భాగవత సంప్రదాయమున సంశయములు తోచియుండినచో నీ పూర్వపక్ష సమాధానంబులు గ్రహించియైన సంశయ రహితులై శైవసంప్రదాయము మానుకొని రావలయుననియే శ్రీ శ్రీ తిరుమల నంబిగారొక వ్యవస్థ యొనర్చి తదనుగుణంబుగ శిష్యులతో చర్చయొనర్చు చుండిరి. గావి గరుడాంశజులగు

గోవిందమిశ్రులకీ యంశములన్నియు కరతలామలకమేగదా. తామసమోహనార్థము, తదనుగుణమగు వేషము భగవదాజ్ఞచే ధరించిన నిటలాక్షునివలె వీరును భగవదాజ్ఞాబద్ధులై కొంతకాలమటుల గడపవలసి వచ్చినది. ప్రకృతమునన్ నియమిత కైంకర్యము నెఱవేటి యుండుటచే నీ పాశురము చెవిసోకినంతనే మారేడు వృక్షము నుండి గుభీలునదుమికి నిజకంఠలగ్న రుద్రాక్షమాలలు త్రెంపివైచియు, నిజోత్తరీయంబుచే నొడలంబూసికొని యుండిన భసితంబునంతయుఁ దుడిచివైచియు, స్వమాతులుండగు శ్రీ శ్రీ తిరుమల నంబిగారి సన్నిధిఁజొచ్చి ప్రక్రమంబొనరించి "అన్యధాశరణంనాస్తి, త్వమేవశరణంమమ।తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష దయానిధే" యని గద్గద స్వరమున బలుకుచు వారి తిరువడిత్తామరలపై వ్రాలిరి. శ్రీ శ్రీ శైలపూర్ణులత్రు పూర్ణనయనులై "వత్సా లేలెమ్ము. నేటికి శ్రియఃపతి విశేషానుగ్రహము నీపై విరివిగ ప్రసరించుటచే నాయొద్ద నీవు మరల చేఱుకొనగలిగితివి." యని భాగినేయుని తమ శ్రీహస్తములతోనెత్తి తమ వద్ద గూర్చుండబెట్టుకొనిరి. ఇట్టి తరుణమున ఆలయమునుండి శిష్యులు తమ గురువుగారు యాకామమున నింతతడవునేయ గతంబెయ్యదియని, చింతించుచు నారామమునకువచ్చి శ్రీ గోవిందమిశ్రులకడజేరి యా విచిత్ర సన్నివేశమును చిత్రప్రతిమలవలెఁ స్తబ్ధులై జూడసాగిరి. శ్రీ గోవిందమిశ్రులను దివ్యారవిందాసవమును గ్రోలు నాసచేవ్రాలు భృంగములవలె నందు మూగియుండు శిష్యబృందముగని మేనమామగారి యాజ్ఞగొని

వారిని నావలకు గొనిపోయి, "నాయనలారా! నేను మీకు స్వైౘవ మత విధానము కరతలామలకముగ దెలిపితివి. గడచిన రాత్రియే శ్రియఃపతి తన సంకల్పము నెఱవేఱినదిగావ మీవారిని నీ వచిర కాలముననే జేరుకొనగల్గుదువని స్వప్నమూలమునఁ దెల్పెను. ఈ భాగవత శిఖామణి నా మేనమామగారుగాని మఱెవ్వరునుగారు. పరమ దయాళువగు శ్రీ శ్రీనివాసుడే నాకొఱకై వీరిని బంపెను. అని యనగనే శిష్యులలో నొకడు" ఆర్యా నాకును వారముదిన ముల క్రింద శ్రీ నిటలాక్షుడు స్వప్నమున సాక్షాత్కరించి యత్య ద్భుతా కారముగల నొక గరుడపక్షినిఁజూపి, "వత్సా! యీ పక్షికి ప్రదక్షిణ ప్రణామము లర్పింపుము. జాగుచేసితివేని యీ పక్షి యెగిరి పోవును." అని యనగనే సకల లోకవశంకరుడగు శ్రీ శంకరుని యాజ్ఞ చొప్పున నవనతవదనుడనై యంజలిచే పక్షికి ప్రదక్షిణ ప్రణామము లర్పించి మోముపైకెత్తి జూడ నా గరుడ పక్షి యక్షీణ తేజముచే, నా యక్షి యుగళము మూతలు బడెను. కొండొకవడికి కన్నులువిచ్చిజూడ, పక్షియందగుపడక, యా స్థానమున మీరగపడితిరి. అపుడు నివ్వెరపడి చూచుచుండు నన్నుగవి, శ్రీ శంకరుడు మీ భుజముపై చేయివైచి, వత్సా! నీ కగపడిన పక్షియే శ్రీ మహావిష్ణు వారు వమగువైన తేయుడు. అవైనతేయుడే యిపుడు నీయెదుట నిలిచియుండు నీగురువు యుల్లంగై కొండనయనారు. నన్నుపాసించు సత్పథము తత్వా న్వేషణ తత్పరులగు కొందఱు భక్తులకు బోధింప శ్రియఃపతి వియమనముచే నవతరించి కర్తవ్యాంశమంతయు నెఱవేర్చెను.

ఇతనిని మఱచినవాని కనర్థము వాటిల్లకపోదు. భగవత్పాదార విందము లుపేక్షించినవారి కెవ్విధమగు నధోగతియో వీరి నుపే క్షించిన వారికిని నవ్విధమగు నధోగతియే గల్గునుసుమా, జాగ్రత యని నావీపుపై తట్టి, హెచ్చరికజేసి నటులయ్యెను. మఱుక్షణమే నేను మేల్కాంచి, యీ యత్యద్భుత స్వప్నమున కాశ్చర్యానంద మగ్నుడనై, స్వప్నవార్త వీరి కందఱకు దెల్పితినిగాని యార్యా! వీరికిగాని, నాకుగాని, మీరింత శీఘ్రముగ మమ్మెడబాయు దురని తోచినదిగాదు. శ్రీ శంకరవాక్య మమోఘము" అని యశ్రు పూర్ణనయను డయ్యెను. శిష్యులలో కొందఱి హృదయదీర్ఘిక నుండి శోకరసముపొంగి వెలికి పొరలజొచ్చెను. వారు దాని నాపజాలక ఘోరుమని యేడ్చిరి. శ్రీ గోవిందమిశ్రులు శోక బాష్పాంబుజలధి సంశోషకంబులగు కటాక్షములచే వారినిగని యథోచిత మృదుమధుర వాక్యములవారి నూరడించి పంపి మరల మేనమామగారిచెంత చేరిరి. శ్రీ శ్రీ పెరియ తిరుమల నంబియు (శ్రీశైలపూర్ణులు) గతభాగదేయము మరల లభించినటువలె నుండు భాగినేయుని తోడను. తదితర శిష్యబృందముతోడను, తిరుమలకు విచ్చేసి శ్రీ శ్రీనివాసుని దర్శించి కృతజ్ఞతా సూచక ముగ వేమారు నుతించి ప్రణతు లర్పించి యర్చకు లొసంగు శ్రీ శఠగోప తీర్థప్రసాదములు గైకొని స్వస్థచిత్తులై నిజనివాసమున కరిగి, యింతవఱకు జఱిగిన వృత్తాంతమంతయు శ్రీ కాంచీపురిలో వేంచేసియుండు శ్రీమద్రామానుజ యతీంద్రులకుఁ దెలియ పఱచిరి. పందొమ్మిదవ గుచ్ఛము—సంపూర్ణము.

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఇరువదవ గుచ్ఛము

శ్రీమద్యామున మునీంద్రులు, నిత్యవిభూతికి వేంచేసిన పిదప, శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిలో నుండు భాగవతోత్తము లందఱు, నొకనాడు, శ్రీ రంగనాథ ముఖమండపమున, సమావేశమైరి. ఆ భాగవతోత్తములలో నొకరు వినయ వినమితోత్తమాంగులై యంజలి ఘటించి, యివ్విధముగఁ బలికిరి. "భాగవతోత్తములారా! మన యాచార్యులగు శ్రీ యాళవందార్లు, యానందనిలయమునకు వేంచేసిరిగదా. ఈ పరమవైదిక సిద్ధాంతము నా చంద్రార్కస్థాయిగ నాసేతుశీతాచలము నెలకొల్పవలయునని, వారు సంకల్పించి యుండిరి. కనుకనే, శ్రీ రామానుజులవారిని, శీఘ్రముగ నిటకు తోడితేర శ్రీ పరాంకుశ దాసులవారి ననుపుట యని మనమందఱు మెఱింగిన విషయమే. ఇరువురాచార్యులు, శ్రియఃపతి శంఖచక్రములవలె, బాహ్యకు దృష్టిమతముల నెల్ల, రూపుమాపి, యీ పరమ భాగవత సంప్రదాయమును, నెలకొల్ప

బూనినది మొదలు యముడు నిర్వ్యాపారుడగుననిఁ గాబోలు, శ్రీ రామానుజులు రాకమునుపే, శ్రీరంగనాథుడు, మనయాచార్యులను నిత్యవిభూతి కనుప నిశ్చయించి కృతార్థుడయ్యె. మనపై యాచార్యకటాక్షము విరివిగా బ్రసరించుటబట్టి, సమయమునాట నున్నతటి, శ్రీ రామానుజులు విచ్చేసి, శ్రీవారి సంకుచితాంగుళిత్రియముగని వారి మనోభిప్రాయము గుర్తెఱిగి తద్విమలాశయము నెఱవేర్తునని శపథము గావించి, కొఱతఁదీర్చిరి. శ్రీ రామానుజులవారి నిందుఁ బిలిపించి, శ్రీ విశిష్టాద్వైత దర్శన స్థాపన మొనర్ప, బ్రార్థించుట మీ కందఱకు సమ్మతిగ నుండు నవియే దాసుని నమ్మకము." యనగనే, "భాగ్యము, భాగ్యమదియే భాగవతులందఱకు సమ్మతమైన పద్ధతి. శీఘ్రముగ బిలిపింప యత్నింపదగినది"యని యైకకంఠ్యముననఖిలభాగవతులుత్సాహమునఁబలికిరి. అంత శ్రీయామునాచార్యపుత్రులు శ్రీతిరువంగప్పెరుమాళ్ రయరనుభాగవతోత్తములులేచి, "శ్రీ రామానుజులవారిటీవల యద్యాశ్రమస్వీకారమొనర్చిరనిగూడ నాప్తులవలన దృఢముగఁ దెలియవచ్చుచున్నది. సిద్ధాంత ప్రచారమున కనుగుణమగు నాశ్రమమది. ఇక మనకేకొఱంతయు నుండబోదు. మీరందఱంగీకరించివారినిచ్చటికి వేంచేపుచేసికొనివచ్చు కైంకర్యము దాసునికొసంగిన ధన్యుడనౌదు"ననిరి. "మీరే యీ కైంకర్యము నిర్వహింపదగినవారు. ఏలయన శ్రీ శ్రీ వరదరాజ పెరుమాళ్ల గాంధర్వ విద్యాలోలురు. మీరో యా విద్యయందసమాన శక్తి సంపన్నులు. మీ నృత్యగీతాభినయములచే మోటుమాత్రికులఁ

జిగిరింపజేయఁగలశక్తి మీకడనున్నది. అది యీ తరుణమునఁ దప్పక కార్యకారిగా గలదు." యని యొకరు బలుక, నందుకు సందియమేలేదని యందఱు కరతాళధ్వనులచే తమ సమ్మతి దెలిపిరి. ఇటుల వారంద ఱేకగ్రీవముగ దీర్మానించుకొని శ్రీరంగనాధుని సేవించుకొని తమ తమ గృహముల కరిగిరి. మఱుదినముదయముననే, శ్రీ తిరువరంగప్పెరుమాళ్ రయర్ కాల్యకృత్యములు నెఱవేర్చుకొని, శ్రీరంగనాధుని సేవించి యనుజ్ఞ వడసి శ్రీ కాంచీనగరమున కరిగిరి. శ్రీ కాంచీపురిని, శ్రీ రామానుజులవారు యత్యాశ్రమ స్వీకారమొనర్చి యుండుటచే, సంసార బంధము తొలఁగి, నిర్విచారముగ శ్రీ కాంచీపూర్ణులతో గలసి, భగవద్భాగవత గుణానుభ మొనర్చుకొనుచుండిరి. ఒకానొక దినమ, ప్రస్తాపవశమున, శ్రీమద్రామానుజ యతీంద్రులు, శ్రీ కాంచీపూర్ణులతో "ఆర్యా పరమాచార్యులతో వారి చరమ దశలో నైన సంభాషించి వారి శ్రీ సూక్తులు కర్ణానందముగవిను భాగ్యము దాసునికి లేకపోయెను గదాయని, యొక్కొక్క సమయమున దాసుని మనంబు కలతనొందుచు నెంత సమాధానపఱచుకొన జూచినను, సాధ్యముగాకున్నది. అదియునుగాక శ్రీ శ్రీ వరద రాజ స్వామివారి కోమలకంఠమున నలంకరింపబడిన తులసి దామము మనమానాడు గొనిపోయిన తులసిదామము నర్చకుల లంకరింపబోవ నిది సోకిన వెంటనే యదికంఠమునుండి జాఱి శ్రీ శఠారిచెంత బడుట యాశ్చర్య విషాదముల కాకరమయ్యెను. మఱుక్షణమే దాసుడు దేవరవారివంక జూచినది దేవరవారు గమ

నించియే యుందురు." యనగనే "యతీంద్రా! మీ మేధాశక్తి యు, యింగితజ్ఞానమును, దీర్ఘదర్శిత్వమును, నా సన్నివేశము నమునకు గారణము స్ఫురింపజేసి యుండకబోవు. ఇంతకును నీ యపూర్వ సంఘటన, శ్రీ పరాంకుశదాసులును మనమిరువురము దప్ప మఱెవ్వరును గమనించి నటులనే యగపడదు. మీకుఁ దెలియని దేమున్నది. మా యామున గురువర్యులే పూర్వాలంకృత తులసిదామ సదృశులు. మఱి మీరో, తరుణ తులసిదామ సదృశులు. నూతన తులసిదామము శ్రియఃపతి వక్షఃపీఠి నలంకరింపనున్నతఱి పూర్వ తులసిదామము భగవత్సంకల్పానుసారము చేరదగిన స్థానమునే చేరినది. పరమవైదిక నిర్ధారణ సార్వభౌమత్వము, నిర్వహించుటకై యధిష్ఠించు కనకరత్న సింహాసనము వంటిదిగదా కంజాక్షవక్షము. ఇట్టి యాచార్యపీఠమునధిష్ఠించిన వారికదగదా కైంకర్య సామ్రాజ్యలక్ష్మి నిత్యానపాయినియై యల రారు చుండును. ఒక సింహాసనమున నిరువురు సార్వభౌమ లధిష్ఠించుట సాధ్యమా? ఇదిగాక పరమాచార్య పదాంబుజముల యెడ మీకుండుభక్తియే కలవ్యభక్తివంటిదని శ్రియఃపతి గమనించియే, యట్టి సన్నివేశముఁగల్పించి చూపిరి." యని శ్రీ కాంచీపూర్ణులు వాక్రువ్వ శ్రీ యతీంద్రులు, "దాసుడును కొంతవఱకు దేవరవారి వలెనే తలంచి యుండియు నది యహంభావము నంకురింపజేయునేమో యని శంకించి, యా విషయ మంతటితో విరమింపవలసి నటులయ్యె. ఇపుడు దేవరవారి శ్రీ సూక్తులచే నా విషయము మఱింత విశదమైనది. కార్యకారణము

లును కొంతవఱ కటులనే పొసగినది. పరమాచార్య రచిత స్తోత్రరత్న మొకటియే బాహ్య. కుదృష్టి మతతమస్సుచే మఱుగు పడిన మార్గమును ప్రకాశింపజేసి శ్రియఃపతి సాన్నిధ్యమునకు దారిజూపును. ప్రపన్న శిరోభూషణమగు దానినెన్నిమార్లను సంధించినను నింకను ననుభవింపవలెననియే మనంబువ్విళ్లూరు చుండును. దాసునికి బూర్వాశ్రమమున మేనమామగారగు శ్రీశైలపూర్ణ హృదయ పేటికలోని యమూల్యరత్న మీస్తోత్ర రత్నము. వారికి ధారకపోషక భోగ్యమదియే" యనుచుండ శ్రీ కాంచీపూర్ణులు కంటతడి యెత్తుకొనుచు గద్గదకంఠులై, యా యమృతోపమాన శ్రీ సూక్తులు, యా యనన్య సామాన్య భావనా శక్తి, యాజ్ఞాన వైరాగ్య సంపత్తి, యా పరవాది భయంకర ప్రచండతేజము, నెట్లు మఱవనగునని యనుచుండు నంతలో నొక భాగవత శిఖామణి వారిచెంత కఱుదెంచిరి. శ్రీ కాంచీ పూర్ణులును, శ్రీ రామానుజులును, సంభ్రమచిత్తులై లేచి యంజలి ఘటించి దాసోహమనుచు దండము సమర్పించిరి. ఆ నూతన ముగ వేంచేసిన భాగవతోత్తములను నటులనే యొనర్చిరి. అపుడు శ్రీ కాంచీపూర్ణులు "అరయరే! దేవరవారి యాకస్మిక దివ్యసేవవలన ధన్యుడనైతిని. వేంచేయుడని తమ చెంత నొక మృద్వాస్తరణమున వారిని గూర్చుండబెట్టుకొని శ్రీరంగక్షేత్రమున భాగవతుల యొక్కయు, శ్రీ శ్రియఃపతుల యొక్కయు వైభవాదులన్నియు నడిగి తెలిసికొని సంతసించుచూ శ్రీ యతీంద్రు లతో" అయాః వీరు మాయాచార్యపుతులు. అదియునుగాక దాసుని

వలెనే శ్రీమద్యామున మునీంద్రుని దివ్యతిరువడి నాశ్రయించిన వారగుటచే బంగారుకు పరిమళము లభించినట్లయినది. వీరిని శ్రీ తిరువరంగప్పెరుమాళ్ రయరందురు. నృత్యాగీతశాస్త్రములం దసమాన పాండిత్యము గడించినవారు వీరు. దివ్యప్రబంధ పాశురములనుసంధించుచు శ్రియఃపతి సాన్నిధ్యమున నృత్యగీతాభినయములు సల్పుచుండునపుడు వీరి వైభవము నిలింపులకైన వర్ణింపనలవిగాదు." యని బలుక శ్రీ యతీంద్రులు "భాగ్యము. యిట్టి భాగవతోత్తముల సేవలభించి కృతార్థుడనగు భాగ్యము, దేవరవారి మంగళా శాసనబలము వలన లభించినదిగాని వేఱు విధమునగాదు. ఇట్టి వీరి నృత్యాభినయములు శ్రియఃపతి సన్నిధిలో ననుదినంబు ననుభవించు శ్రీరంగవాసులగు భాగవతోత్తముల భాగ్యమే భాగ్య"మనిరి. అపుడు శ్రీ కాంచీపూర్ణులరయరుతో "అరయరే! వీరే శ్రీ రామానుజ యతీంద్రులు. వీరి పరిచయము మీకెక్కువగ నున్నటులగపడదు. ఏలయన యాచార్యుల చరమ కాలమున స్వల్పకాలమేగదా వీరు శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిలో నుండినద"నిరి. అపుడరయరు "వీరందుండడము స్వల్పకాలమైనను, వీరి వైభవ మెన్నటికిని మఱచుట కవకాశములేదు. మన యాచార్యులవారి విమలాశయములు సఫలమొనర్తునవి శపథముగావించి, వారికాత్మ శాంతి యొనర్చియుండుట మీరెఱింగియే యుందుర"నిరి. శ్రీ కాంచీపూర్ణులు: "ఆచార్య చరమదశలో జరిగిన సంగతులన్నియు వీరివలన పూర్ణముగ దెలిసినవి. వీరి ప్రభావము నిక్కముగ నెట్టివారికైనను

నానందాశ్చర్య మగ్నులఁ గావింపక పోవుగాని యాచార్య చరమ కాలముననైన వారిని దర్శించు భాగ్యము లేకుండినందుకే యను తాపపడు చుంటిని. అనుతాపపడి చేయవలసినదేమి ? అన్నియును శ్రియఃపతి సత్యసంకల్పాధీనములు. మీవంటి మహనీయుల దర్శన మప్పటప్పటికి లభించుచుండిన నాచార్య వైభవము కొంత వఱకైన తలంపునకొచ్చి తాపోపశాంతి గలిగించుచుండునుగదా. శ్రీరంగనాధుని నిత్యకైంకర్యములు మన యాచార్యులానంద నిలయము చేరిన వెనుకగూడ నవిచ్ఛిన్నముగ నడచుచున్నవి గదా ? శ్రీ గోష్ఠీపూర్ణులు భాగవతగోష్ఠి నప్పుడపుడలంకరించు చుందురా ? శ్రీ పెరియనంబి మున్నగు భాగవతోత్తము లందఱు కుశలముగ వేంచేసి యున్నారుగదా యని యడిగిరి.

అరయరు; అన్నియు గోరంతయు కొఱంతలేక నడచుచున్నవి. మన యాచార్యులులేని కొఱంతదక్క మఱి దేనికిని కొఱంత లేదు. అని యతీంద్రుల వంకజూచి "యతీంద్రా మీరు యీ కాంచీపూర్ణ నిత్యసాన్నిధ్యమున భగవద్భాగవతాచార్య గుణా నుభవము సల్పుచుండు టానంద దాయకముగ నున్నది."

యతీంద్రులు; దేవరవారివంటి భాగవతోత్తముల కటాక్షమే దీని కంతకును మూలము. ఇట్టి యపూర్వ భాగధేయము దాసుని కబ్బినందుల కెంతయో మురియుచుందును.

అరయరు; శ్రీమద్యామున మునీంద్రులీ విభూతిలో వేంచేసియుండి నంతవఱకస్మదాదులకును, భగవద్గుణానుభవమావంతయు కొదువలేక జరుగుచుండినదిగాని ప్రకృతమో చంద్రసమ

యానంతరమున చకోరముల గతియైనది మావంటివారిగతి యనుచు నశ్రుపూర్ణనయనులై గద్గద స్వరమున బలికిరి.

శ్రీ కాంచీపూర్ణులు; మేమును నాచార్య విశ్లేషమును గుఱించే యితఃపూర్వము మాటలాడుకొనుచు వగచుచుంటిమని దైన్యమున బల్కిరి. శ్రీ రామానుజులు నవనతవదనులైరి. వారి నేత్రముల నుండి కొన్ని యశ్రుకణములు వ్రాలెను.

శ్రీ కాంచీపూర్ణులు; శ్రీ భీష్మాచార్యుల శరతల్పగతులై యుండు సమయమున నచ్చట వారిం జూడ వచ్చిన పాండుపుత్రులతో సంభాషించు నవసరమునం బల్కిన పలుకులు హృద్యముగ శ్రీకృష్ణద్వైపాయన మహర్షి శ్రీ భాగవతమునం దనుగ్రహించి యుండుట దాసునకిపుడు స్ఫురించుచున్నది. యని యింకను నేమియోం జెప్పబోయి యించుక తలయెత్తి యోచించు నవసరమున శ్రీ యతీంద్రులు నంబిగారుం జెప్పందలచిన శ్లోకములు శ్రీ భాగవతమునుండి నుడివి, యాచార్య విశ్లేష దావానలంబార్పగలది శ్రీభాగవత బోధామృత వృష్టిగాక మఱెయ్యది యనిరి. ఈ శ్లోకములలో నిమిడి యుండుసారమునే శ్రీ బమ్మెర పోతనామాత్యుడీ క్రింది విధముగ నాంధ్రీకరించెను.

ఉ॥ వాయువశంబులై యెగసి వారి ధరంబులు మింటగూడుచుం
బాయుచునుండు కైవడి ప్రపంచము సర్వముంగాలతంత్రమై బాయుచుం గూడుచుండు, నొక భంగిం జరింపదు, కాలి మన్నియుంజేయుచు నుండు, కాలము విచిత్రము దుస్తర
మెట్టివారికిం॥

ఉ॥ రాజట ధర్మజుండు, సురరాజసుతుండట ధన్వి, శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లట, సారధి సర్వభద్ర సంయోజ
కుడైన చక్రియట, యుగ్రగదాధరుడైన భీముడయ్యా
జికిఁదోడు వచ్చునట యాపద గల్గుటకే మచోద్యమో॥

ఆ॥ ఈశ్వరుండు విష్ణుదెవ్వేశ నెవ్వనికేమిజేయుఁ బురుషుడేమి
యెఱుఁగు।నతని మాయలకు మహాత్ములు విద్వాంసులడగి
మెలగుచుందు రంధులగుచు॥

ఈ శ్రీసూక్తులు నుడువగనే శ్రీ కాంచీపూర్ణులు దరహసిత వదనులై, దాసుని భావమీ యతీంద్రులు గ్రహించుటాశ్చర్య మనిరి. శ్రీ తిరువంగప్పెరుమాళ్రయరును నామోదమును సూచించుచు" సంకుచితాంగుళిత్రయమునుగని మన యాచార్యోద్దేశము నెఱింగిన వారికి దొకలెక్కయా. వీరు నిక్కముగ పరాభిప్రాయ తత్వజ్ఞులు. ఇట్టివారే మున్ముందాచార్య పీఠము నధిష్ఠించి యీ సిద్ధాంతమును సర్వతోముఖముగ వ్యాపింపఁజేయ సమర్థులు. శ్రీ యాళవందారుల యాశయమును నిదియే. ఇప్పుడు దాసుడీ సన్నిధి కఱుదెంచిన యుద్దేశముగూడ నీ విషయమును గుఱించినదియే. శ్రీ కాంచీపూర్ణులు: (ఆశ్చర్యమున) అదేమి? అరయరు మఱేమియులేదు. ఇటీవల శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి యందుండు భాగవతోత్తము లందఱు జేరుకొని మున్ముందు శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతము స్థిరముగ నెలకొల్ప నుద్దేశించి శ్రీ ఆళవందార్ల ముఖోల్లాసమునకై యీ యతీంద్రుని తోడితేర నైకకంఠ్యముగఁ దీర్మానించుకొని యీ కైంకర్యము దాసుని కొసంగి

ధన్యునిగావించిరి. ఇక శ్రీ శ్రీ వరదరాజ పెరుమాళ్ల యాజ్ఞయే యవశిష్టము. అందుకు మీ పురుషకార మావశ్యకముగదా. శ్రీ కాంచీపూర్ణులు: (స్వగతమున) "స్వాచార్యుల నింకజూచు భాగ్యము లేకున్నను వీరిని వారి మారుగ జూచుకొనుచునైన నూరడిల్లుచుంటిని. వరదప్రభూ! ఇక వీడుకాలముఁ ద్రోసి పుచ్చుటెట్లు?" దాసుని పురుషకార మిందు వ్యాజ మాత్రమే శ్రీ కరిగిరీశుని నిర్హేతుక కృపయే సర్వము నెఱవేర్పగలదు. ఆ కృపాఫలమే, దేవర వారి నిచ్చటికి రప్పించినది.

యతీంద్రులు: పరమాచార్య సంకల్పము, భాగవతోత్తము లందఱి యాశయము, శ్రియఃపతి నియమనమును, నానంద దాయకమేగాని, యీ ఘనకార్యము నిర్వహింప సమర్థులు భవాదృశులెందఱో యుండియు దాసునిపై నీ భారమేల వైచిరో యూహింప జాలకున్నాడను. ఏలయన ఊరపిచ్చుక మెడకు తాళఫలము గట్టిన నెగురజాలకున్నమానె. భరింపనైన భరింపగలదాయనియే సంశయము. ఊరబిచ్చుక తాళఫలమును భరింపజాలనపుడు ప్రాణహాని మాత్రమే. వీనికీ కార్యభారము నిర్వహింపజాలకున్న స్వరూపహాని తప్పక కలుఁగునని దాసుని యభిప్రాయము. శ్రీ కాంచీపూర్ణులు: యతీంద్రా! భగవదాజ్ఞయు, భాగవత మంగళాశాసనమును యింతకుపై పరమాచార్య పరమకృపయు, సత్యసంకల్పమును, నెట్టి ఘనకార్యమైన నవలీలగ నిర్వహింపఁ దోడ్పడును లెమ్ము. ఆరయరు: శ్రీ కాంచీపూర్ణులవంక సస్మితాననులై

చూచి, యవనిభార మాదిశేషున కావగింజంత మాత్రమే యని యింకను నెద్దియో జెప్పఁబోవుచుండ, శ్రీ కాంచీపూర్ణులు అదిగో శ్రీ శ్రీ వరదరాజస్వామివారి సేవాకాలమును సూచించు ఘంటమ్రోగుచున్నది. విశ్వమంగళ విశేషసూచకమగు నీ ఘంటానాదమిందుకుపశ్రుతి యేలగాదు. శ్రీ శ్రీ వరదరాజ స్వామిని సేవించుకొని వత్తము రండని కోవెలలోనికి వారిరువురిని తోడ్కొని ఫలపుష్ప తాంబూలాది పూజాద్రవ్యములతో నరిగిరి:

ఇరువదవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## ఇరువదియొకటవ గుచ్ఛము

---

శ్రీ తిరువరంగప్పెరుమాళరయర్ శ్రీ కాంచీపురమున ననుదినంబును శ్రీ శ్రీ వరదరాజస్వామిసేవ యొనర్చుకొనుచు, తమ నృత్యగీతాభినయములచే భగవంతుని, భాగవతులను నానందింపజేయుచు, శ్రీ కాంచీపూర్ణులతో కలసి భగవద్భాగవతాచార్య గుణానుభవము సలుపుచుఁ, గొంతకాలమివ్విధముగ గడుపుచుండిరి. తాము శ్రీ రామానుజ యతీంద్రులను శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి గొనిపోవుటకు శ్రీ శ్రీ వరదరాజస్వామివారి యనుమతి బొందఁదలంచియు, భాగవతులందఱు శ్రీ యామున మునీంద్రుల పుత్రులగు వీరిని శ్రీ యామున మునీంద్రుని సత్కరించు పగిది సకల విధముల సత్కరించుచు, తనివితీఱక మఱికొన్ని దినములుండఁ బ్రార్థించి యుండినందున వారినిఁ గాదనలేక యింతవఱకు గడపవలసి వచ్చినది. ఏ కార్యమునకైనను గాలకర్మముఁ గలసిరావలయునుగదా. ఇక నీ నగరమున శ్రీ యాదవ

సూరి పరిస్థితులు కొంత విమర్శింతము. ఈ యద్వైతయతితల్లి యనుదినంబును, భగవత్సేవాకాలమునకు శ్రీ శ్రీ వరదరాజస్వామి వారిని దర్శింపబోవు వాడుక. దాదాపెనుబది సంవత్సరముల వయస్సు యయ్యుఁ నీమెకు మనోదారుఢ్యమునకుఁదోడు దేహ దారుఢ్యము వృద్ధినొందుచుండుటయేఁ ప్రశంసనీయము. "కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి" (ఓ యర్జునా నాభక్తు డెన్నటికిని చెడడని నాకుగాను నీవేఁ బ్రతిజ్ఞఁజేయవచ్చును) యని శ్రీ గీతాశాస్త్రమున శ్రీ శ్రీ కృష్ణభగవానులు వాకుృచ్చి నందు కనుగుణముగ క్రమముగ భాగవత భక్తిసయిత మీమె కలవడుచుండినది. శ్రీ కాంచీపూర్ణులయెడ, నీమెకు భక్తివిశ్వాసములు నానాటికి వృద్ధియగు చుండెను. నాలుగు మంచిమాటలైనను వీరినుండి విననిదే యామె కోవెలనుండి కదలునదిఁ గాదు. ఒకనాడు శ్రీ కాంచీపూర్ణ సన్నిధానమున శ్రీ రామానుజ యతీంద్రులును మఱికొందఱు భాగవతులును భగవద్గుణానుభవము సలుపుచుండ, కొంతసేపాగి, వారి వాక్యామృత మామె వీనుల విందుగ గ్రోలి, ఇంటికరుగుచు, తన మనంబున "అహో ! యిట్టి గుణానుభ మనుదినంబును శ్రోత్ర పేయముగ ననుభవించు వారిదే భాగ్యము. నాపుత్రునివద్ద ఁజదువుచుండిన రామానుజులు సంసారబంధము దెగ్ంచుకొని యతియై యీ మహాత్మునితో భగవద్గుణానుభవము సలుపుచు నెమ్మదిగఁ గాలము ద్రోసి పుచ్చుచున్నాడు గదా. నాపుత్రునికడ చదువనొల్లక యీ కాంచీపూర్ణుల చెంతఁజేరి సకల వైష్ణవ రహస్యములు గ్రహించి తుదకు

సానదేఱిన వజ్రమువలెఁ బ్రకాశించుచున్నాడు. వరదప్రభూ! నాపుత్రుని సయితము నీవారిలో నొకనిగ జేర్చుకొని రక్షింపరాదా! అయ్యయో! యదేమి ఖర్మమో నాపుత్రునికీ పద్ధతియే గిట్ట దయ్యెనే. కన్నతల్లి నయ్యునాకే నాపుత్రుని వైఖరి నచ్చనపు డితరులకెట్లు రుచించును. ఇంతకును దేహసంబంధమున్న మాత్రమున నాధ్యాత్మికమున నైక్యతగూడ నుండునని దలంప గూడదుగదా. నాపూర్వజన్మ పుణ్యముననేగదా, పుణ్యకోటి విమానమున వెలయు పురుషోత్తమ సాన్నిధ్యము, తత్సేవాదు లందఱిరుచిగలిగి, స్వస్థలము వదలి యీ నగరముననే నిత్యవాస మేర్పరచుకొన నయ్యెను. గరుడోత్సవ దినమున నీ కోవెల మహాద్వారము నుండి భాగవతగోష్ఠి మధ్యమున భగవానుడు బయలు వెడలు వైభవముఁ జూచుభాగ్యము లేనివారి కన్నులు విక్కముగఁ గన్నులుగావు. అవి తనుకుడ్యజాల రంధ్రము లేయనిఁ జెప్పనొప్పును. ఏదియెటులున్నను మా యాదవ ప్రకా శునిపై నీ యదుకుల తిలకుని యనుగ్రహము విరివగా ప్రస రించి యతడు ధన్యతఁగాంచుటే నాకు గావలసినది" అని యను కొనుచు స్వగృహమునకొచ్చి జేరుకొనెను. ఆనాడు తాను గనిన శ్రీవైష్ణవ గోష్ఠియు, నందు నక్షత్రములమధ్య వెలుంగు చం ద్రుని పగిది వెలయు శ్రీ రామానుజ యతిచంద్రుడును, నామె హృదయ ఫలకమున దృఢముగఁ జిత్రింపబడియుండెను. నాటి రాత్రి తాను బవలుగనిన వైభవములన్నియు దలంచుకొనుచు నిద్రించుచుండ వేకువజామున శ్రీ వరదరాజస్వామి యామె

స్వప్నమున సాక్షాత్కరించి, "నేనద్వైతయతినను నభిమాన ముడిగి నీపుత్రి దిప్పటికైన రామానుజు నాశ్రయింప ధన్యుడగును. నాకుశయనకైంకర్య మొనర్చు నిత్యసూరి విర్వాహకుదే రామానుజ నామమున సర్వచేతనోద్ధార మొనర్ప నవతరించెను. ఈ విషయమును మఱువకుము, హెచ్చరిక" యని యామె వీపుపైతట్టి నటులయ్యెను. మఱుక్షణముననే యామె మేల్కాంచి యావిచిత్ర స్వప్నమునుఁ దలంచి, భగవంతునికి తనపైగల యవ్యాజకృపకానందించుచు, కొంతసేపు ధ్యానమొనర్చి, యుదయమునలేచి కాల్యకృత్యములు దీర్చుకొని పుత్రునిచెంత కరిగి పట్టరాని యానందమున తన స్వప్న వృత్తాంతమంతయు నతని కెఱింగించెను. శ్రీ యాదవసూరి, "అమ్మా యిదేమివిచిత్రముగ నున్నదే, నాకును గడచినరేయి, శ్రీ వరదరాజులు స్వప్నమున సాక్షాత్కరించిరి. తాము శయనించి యుండిన శేషతల్పమునుఁ జూపి" ఈ విజ్ఞానమూర్తియే సర్వచేతనోజ్జీవవార్థ మవతరించిన రామానుజులు. ఆనాడు బ్రహ్మరక్షస్సు జెప్పిన వాక్యములు నీవ నాదరించుటేగాక మీదు మిక్కిలి యితనియెడ నపచారపడితివి. నీమాతృదేవతకు నాయెడను, నాకుఁ బ్రియభక్తులలో నొకడగు శ్రీ కాంచీపూర్ణుని యెడను, గల భక్త్యతిశయమునకుఁ జిక్కి నీ యపరాధము క్షమించితిని. ఇకనైనను నీ యద్వైతాభిమానముడిగి శ్రీ రామానుజుల నాశ్రయించిననే నీవు నిజమైన సన్యాసిగ పరిగణింపఁ బడుదువు. కాలక్రమమున నా విశేషానుగ్రహమునకును బాత్రుడవై కడఁదేఱుదువు. లేకున్న నీ సన్యాస

మిట్టిదేయని, నేతిబీరకాయన బోలిన నొక వస్తువు నాపై విసరి వైచెను. నేను శయనింపబోవుతటి నా ప్రక్కన ముక్కాలు పీటపై నుండు కమండలమే కారణముననో క్రిందబడి, యుండి నీఱు నా క్రిందికివచ్చి కాషాయచేదడియుటచే నాకు మెలకువ వచ్చినది. కమండలమున్ను భిన్నమైనది. ఇది యొక విచిత్ర స్వప్నముగదా? ఎంతకాలమునుండియో నావద్ద నుండిన కమండలమునేడ నుపయోగముగ నేర్పడినది యనిరి. తల్లియు "కమండలమేగాదు, నీవు నమ్మియుండు సంప్రదాయమున్ను నిట్టిదే. లీలామతము లన్నియు వైదిక మతములని నమ్మట మిక్కిలి పొరబాటు. వైదికమత మొక్కటియేగాని పలువిధములాగ నెచ్చటనున్నది? లీలామతములే యుజ్జీవన సాధనములైన యాయా మతకర్తలగు యాచార్యులు తామామతమేల యవలంబించి యుండరు. లీలామతకర్తలగు యాచార్యులందఱు వైదికమత మవలంబించి యుండిరనియే పెద్దలు పలుమాఱు వాకుృచ్చుచుందురు. ఇందుకు శ్రీ భగవద్గీతా ప్రమాణము" "వ్యవసాయాత్మికాబుద్ధిః యేకేహ కురునందన। బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోవ్యవసాయినాం. అని" నీకు దెలియ నిదిగాదు" అని తల్లి బలుకగనే, భగవత్కటాక్ష మామెపై నెంతః బ్రశస్తముగ బ్రసరించినదియు, నామె యుక్తియుక్తమగు మాటలవల్లఁ దెలిసికొని సంతసించి "అమ్మా నీవుఁ జెప్పిన దంతయు దురభిమాన రహితముగ నాలోచించిజూడ మిక్కిలి సమంజసముగ నగబడుచున్నది. నేను కలలు కల్లలను పిడివాదముఁజేయు మూర్ఖుడను

గాను. శ్రీ కాంచీపూర్ణ పురుషకార పురస్సరముగ రేపే శ్రీ రామానుజుల నాశ్రయింప నిశ్చయించితిని" యన తల్లి: వరమ సంతోషము, "శుభస్య శీఘ్రం" యను నార్యోక్తి ననుసరించి నీ మనో నిశ్చయము సఫలము గావింపుము. అని పలికి శ్రీ యాదవసూరి తల్లి ఇంటికరిగెను. శ్రీ యాదవసూరియు, నాటిరాత్రి యం తయు తాను శ్రీ రామానుజులయెడ గావించిన యపచార పరంపరల కనుతాపపడుచు గడపి యరుణోదయముననేలేచి శ్రీ వేగవతీ నది కరిగి స్నానాది కాల్య కృత్యములు దీర్చుకొని జనని యను జ్ఞవడసి శ్రీ కాంచీపూర్ణుల దర్శింపఁ బోయెను. శ్రీ కాంచీపూర్ణు లును శ్రీ యాదవసూరినిగని నంతనే "అయ్యా శ్రీ కరిగిరివర దునియాజ్ఞ నెఱవేర్ప మీ కొఱకే కాచియున్నాను. రండు ఇటు వచ్చి కూర్చుండుడు" అనిరి. శ్రీ యాదవసూరి "నా కొఱకే కాచియుంటిరా ? అదేల ? యనిరి. శ్రీ కాంచీపూర్ణులు. "గడచిన రాత్రి నా స్వప్నమున శ్రీ కరిగిరివరదుఁడు సాక్షాత్కరించి యాదవసూరిని రామానుజులవద్ద నాశ్రయింప నియమించితిని. నీ వందుకు పురుషకార భూతుడవై యుండుమని పలికి యదృ శ్యులైరి. అందుకొఱకే మీ కొఱకై యింతవరకుఁ గాచికొని యుండుట యనిరి. శ్రీ యాదవసూరి, నాకును నాతల్లికిని శ్రీ వరదరాజస్వామి స్వప్న సాక్షాత్కారము లభించినది. తన పతితో ద్ధారక నామము సార్థక పఱుప నా దయామయుడు సంకల్పించె" నని తమకును, తమ తల్లికిని తెల్పబడిన స్వప్న సందేశమును

పూర్ణులు "కాలము నేటికి పరిపక్వమైనది. శ్రీ రామానుజులును వచ్చువేళయైనది. మీరును మీయుద్యమము సఫలమొనర్ప శ్రియఃపతిని బ్రార్థించిరండు." అని యతనిని శ్రీ వరదరాజ స్వామి సన్నిధికనిపి యేకాంతమున "వరదప్రభూ మీ యవ్యాజ కృపా ప్రవాహము యెట్టి పతితులనైన పావనుల జేయఁగలుగు చున్నదిగదా! యని యించుక కన్నులరమోడ్చి ధ్యానించుచు నానంద బాష్పములు గారకన్నులువిచ్చి చూచునప్పటికి శ్రీ రామానుజ యతీంద్రులంజలి బద్ధులై తమ యెదుట నిలచియుండిరి. అపుడు శ్రీ కాంచీపూర్ణులు సంతసమున శ్రీమద్రామానుజ యతీంద్రులను తమచెంతఁ గూర్చుండ బెట్టుకొని, యుదయము నుండి జరిగిన విషయములు ముచ్చటించు కొనుచుండ శ్రీ యాదవసూరి యు శ్రీ కాంచీపూర్ణుల నియమానుసారము శ్రీ కరిగిరీశుని సేవించుకొనివచ్చి వారిరువురికి సాష్టాంగ వందనంబాచరించి శ్రీ రామానుజుల వంకజూచి యంజలి జోడించి" సర్వాపరాధములు క్షమించి యేలుకొనుడని ప్రార్థించిరి. శ్రీ రామానుజులు, అపరాధ క్షమాపణ మొనర్చుటకు శ్రియఃపతియు, యీ కాంచీపూర్ణులవంటి భాగవతోత్తములును నర్హులు. ఇంతకును మీవంటివారియెడ నపరాధ క్షమాపణ వేడవలసినంతటి తప్పులేముండునులెండు" యనిరి. అపుడు శ్రీ కాంచీపూర్ణులు: ఎట్టి యపరాధములైనను పశ్చాత్తాపముతోఁ జాలవఱకు శుద్ధియగును" అని శ్రీ యతీంద్రులతో "యాదవసూరి మిమ్మాశ్రయించి పంచసంస్కారాది హితవులన్నియు లభించి శ్రీ వైష్ణవ యత్యాశ్రమ స్వీకారమొనర్ప

సంసిద్ధులై వచ్చియున్నారు: ఇందుకు మీ రంగీకరింపవలసి యుండుటకు కారణమిదివఱకే దెలిపియుంటినిగదా యనిరి. శ్రీ రామానుజులు: భగవద్భాగవత నియమన బద్ధుడను. కాని పూర్వాశ్రమమునవేకదండ సన్యాస స్వీకారమునకుఁ బ్రాయ శ్చిత్త మొనర్చుకొనవలసి యుండునుగదా? శ్రీ యాదవసూరి: యతీంద్రా! భూప్రదక్షిణమే యందులకుఁ బ్రాయశ్చిత్తమని నేనెఱుంగుదును. అవనిభారమునంతయు నావగించనువలె నవ లీలగ భరించియుండు యనంతమూర్తి యంశము మీరను విశ్చ యమున నఱుదెంచితిని. మీకు బ్రదక్షిణ మొనర్చుటే భూప్రద క్షిణ మొనర్చుట" యనుచు శ్రీమద్రామానుజ యతీంద్రులకు ప్రదక్షిణ మాచరించి సాష్టాంగవందనం బాచరించిరి. శ్రీ కాం చీపూర్ణులు యతీంద్రాయాదవసూరిఁ యౌచిత్యము గ్రహించి యాచరించిన నీ కార్యమత్యంత ప్రశంసనీయము. ఇక జాగు సేయక యనుమానముడిగి నీ యంతేవాసిగ స్వీకరింపుము. యతీంద్రులు: భాగ్యమని శ్రీ వరదరాజస్వామివారి సన్నిధికి శ్రీ యాదవ ప్రకాశులను ఫలపుష్పాది పూజాద్రవ్యములతోఁ దోడ్కొని చని శ్రియఃపతిని బ్రార్థించి యనుజ్ఞవడసి శాస్త్రోక్త ముగ పంచసంస్కారాది హితవులన్నియు నతని కొనర్చి శ్రీవైష్ణ వోచిత యత్యాశ్రమ మొసంగి తమ యంతేవాసిగ స్వీకరించిరి. అది మొదలు శ్రీ యాదవసూరియు శ్రీ గోవిందజీయరను నామ మున బిలువబడుచు నాచార్య మహోల్లాసముగ శ్రీవైష్ణవ యత్యా శ్రమ ధర్మప్రబోధకమగు యది ధర్మసముచ్చయమను నొక

గ్రంధము శ్రీయతీంద్ర నియమనమున రచించి వారికడ సమ
ర్పించిరి. శ్రీమదా్రమానుజ యతీంద్రులును నా గ్రంధము సాం
తము పరిశీలించి సంతసించి శ్రీవైష్ణవమత రహస్యము లెన్నియో
నాడు మొదలు శ్రీగోవిందజీయరుకు బోధించుచుండిరి. ఇటుల
కొంతకాలము గడవ, శ్రీ గోవిందజీయరు కడు వృద్ధులగుటనుబట్టి
రాను రాను నవయుపపాటముదప్పి తుదకొకనా డాచార్య శ్రీపాద
తీర్థము లభించి తన్నామస్మరణ మొనర్చుకొనుచు భౌతికదే
హము జీర్ణవస్త్రమువలె నవలీలగ వదల యానందనిలయముఁ
జేరుకొని సుఖించిరి.

ఇరువదియొకటవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఇరువదిరెండవ గుచ్ఛము

---

శ్రీ తిరువరంగప్పెరుమాళరయర్, శ్రీ కాంచీపురి నుండి శ్రీరంగమున నుండు భాగవతగోష్ఠి కిచ్చట తాముఁ జేరిన పిదప జరిగిన విషయములన్నియుఁ దెలుపు సందర్భమున, ముఖ్యముగ శ్రీ యాదవప్రకాశులు శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత మందభిరుచిగల వారై శ్రీమదారామానుజ యతీంద్రుల నాశ్రయించి పంచసంస్కారము వడసి త్రిదండ సన్యాసము స్వీకరించి యుండుటను గురించిఁ దెలుపుచు, శ్రీ వరదరాజ పెరుమాళ్ల నియమనమైన తోడనే శ్రీ యతీంద్రులను వేంచేపు చేసుకొని వత్తునని తెలిపిరి. శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిగల భాగవతోత్తము లందఱును శ్రీ రామానుజ మునిచంద్రుని రాకకై చకోరములవలెఁ నెదురుఁ జూచుచుండిరి. ఇట్టిస్థితి స్వరూపాను రూపమగుటచే సకల పాప క్షయకరమై యపవర్గప్రాప్తి కరతలామలకమగునటులఁ జేయును. భక్తులను రక్షించు సమయమున నిట్టి యార్తినిఁ గలుగఁజేయు

చుండుట భగవంతునికి నైజస్వభావము. అందుకు, విశ్లేషము, విరహము, విలంబము యిత్యాదులు సహకారి కారణములుగ నొనర్చును. శ్రీ రుక్మిణీదేవి విరహము, శ్రీ గోపికల విరహము, ।జానకీదేవికి శ్రీరామ విశ్లేషవిరహ, విలంబములు, నాయకీ వేషము ననుకరించిన శ్రీ నమ్మాళ్వార్ల విరహము, శ్రీ రాధాదేవి వలె ననుకరించిన క్షమాదేవి యంశజయగు శ్రీ యాండాళ్ విరహము, యివిగాక నింకను నెందఱో యార్తప్రపన్నుల యనుష్ఠానములు యిందు కాదర్శప్రాయములు. సహజముగ, ముముక్షువుల నిట్టి పరిపాకదశకు శీఘ్రముగ దెచ్చుటకే భగవంతుడును, పరమభాగవతులగు నాళ్వారాదులును నవతరించిరి. ముఖ్యముగ మన కథానాయకులగు శ్రీ యతీంద్రులవారు యిందు కొఱకే యనంతాంశమున నవతరించిరి. అద్వైతయతిగానుండిన శ్రీ యాదవ ప్రకాశులు శ్రీ మద్రామానుజ యతీంద్రుల నాశ్రయించి పంచసంస్కారములు వడసి త్రిదండ సన్యాసము సయితము స్వీకరించిన పిదప నొకానొకదినముదయమున సేవాకాలమున శ్రీ కరిగిరీశుల సన్నిధి నఖిలభాగవత బృందముజేరియుండ నందఱకు తీర్థ, శఠగోప ప్రసాదములు లర్చకముఖమున లభించిన వెనుక శ్రియఃపతి యర్చకముఖమున శ్రీ యతీంద్రులతో "యతీంద్రా! నీ కైంకర్య శ్రద్ధాభక్తులచే శ్రీ కాంచీపూర్ణాది నా భక్తులను సంతసింపజేసి తుదకు యాదవసూరిని సైతము వైష్ణవ యతిగా నొనర్చితివి. ఇందు కింకను మా విశేష కటాక్షమునకు పాత్రుడవై వర్ధిల్లుదువుగాక. ఇకమీద ప్రపన్నులెల్లఱు నిన్ను

"యతిరాజను" బిరుదనామమున బేర్కొందురుగాక ! యని మంగళాశాసన మొనర్చి విశేష సత్కారములందనిపి పంపిరి. శ్రీ తిరువరంగప్పెరుమాళరయరు తాము శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి నుండివచ్చి బహుకాలమగుటను మనంబునఁ దలపోసి, యిక శీఘ్రముగ స్వకీయ సంకల్పము నెఱవేర్చుకొనఁదలచి శ్రీ కాంచీపూర్ణుల సన్నిధి కరిగి శ్రీ రామానుజులను శ్రీరంగమున కనుప బ్రార్థించు నవసరమున పురుషకార భూతులుగ నుండఁ బ్రార్థించిరి. అందుకు వారంజలి జోడించి భాగవత నియము నకు బద్ధుడననిరి. ఆరాత్రి శ్రీయఃపతిని శీఘ్రముగ తమ యుద్యమమును నెఱవేర్ప బ్రార్థించుచు శయనించి కలత నిద్దురతో కాలముగడపి వేకువజామున వేగవతి కరిగి కాల్య కృత్యములు నెఱవేర్చుకొని శ్రీ కరిగిరీశుని సన్నిధి కరిగిరి. సీరచ్చటికి బోవుట ఇంచుమించు కరగడియముందే శ్రీమద్రా మానుజ యతీంద్రులును శ్రీ కాంచిపూర్ణుల సన్నిధిలో జేరియుం డిరి. పిమ్మట వారు ముప్వురును శ్రీ కరిగిరివరదుని సన్నిధికి పూజాద్రవ్యములతో నరిగిరి. అర్చకులును వీరు గొనివచ్చిన ఫలపుష్పాది పూజాద్రవ్యములు శ్రీయఃపతికి సమర్పించిరి. శ్రీ తిరువరంగప్పెరుమాళరయరుగారి దివ్యప్రబంధ నృత్యగానాభి నయము లారంభమై గంటకాలములో శ్రీయఃపతిని, యచ్చట గూడియుండిన భాగవతోత్తములను నానంద ప్రవాహమున నోల లాడించెను. అపుడు శ్రీ కరిగిరీశుడు శ్రీ అరయరుతో యర్చక ముఖమున, "అరయరేనేటి నీనృత్యగీతాభి నయనములు గడచిన

దినములకంటే యత్యంత యానందదాయముగ నున్నవని ప్రశం
సించి వారిపై తమ విశేష కటాక్షముఁ బ్రసరింపజేసి తీర్థ
శఠగోప ప్రసాదాదులఁ సత్కరించుటేగాక ఛత్ర, చామర, ఆ
దోళికాది విశేష సత్కారము లొసంగునటుల యాజ్ఞాపించుచుండ,
శ్రీయరయరుగా రంజలి ఘటించి దేవా! యీ బిరుదములు
దాసునికేల? దేవరవారి విశేష కటాక్షలేశ మీ దాసునిపైఁ బ్రస
రించిన జాలదాయనిరి. అపుడు శ్రీయఃపతి యరయరు భావము
గుర్తించి నీ యభీష్టము స్వరూపానురూపముగ నుండిన మతెద్ది
యైన సమకూర్ప సంసిద్ధుడనై యున్నవాడ, నీ యభిప్రాయము
దెల్పుమనిరి. అపుడరయరు శ్రీకాంచీపూర్ణులవంక జూచిరి.
శ్రీకాంచీపూర్ణులపుడంజలి జోడించి శ్రీయఃపతితో "ప్రభూ!
సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వాద్యనంత కల్యాణగుణ విశిష్టులగు
దేవరవారికి తెలియరానిదేమున్నది. అస్మదాచార్యులగు శ్రీ
యామున మునీంద్రు లానందలోకమునకు వేంచేసిన పిదప,
నీ యతీంద్రుని దర్శన స్థాపనాచార్యులుగ నుండ శ్రీరంగమున
గల భాగవతోత్తము లెల్లఱుఁ గోరియుండిరి. ఇది యాచార్య
ముఖోల్లాసముగను, నియమనముగను నుండుటనుఁబట్టి, వీరిని
మీయాజ్ఞవడసి వేంచేపు చేసుకొని పోవుటకై అస్మదాచార్య
పుత్రులగు శ్రీయరయరుగారిని బంపియున్నారు. పురుషకార
పురస్సరముగ దేవరవారిని బ్రార్థించుట స్వరూపనియెంచి దాసుని
నీ కార్యము నందు నియమించుటచే దాసుడు భాగవత నియమన
బద్ధుడనై యావిషయమే దేవరవారికడ విజ్ఞాపనంబొనర్చు చుంటి"

ననిరి. అపుడు శ్రియఃపతి కాంచీపూర్ణులతో "నీకెయ్యది సమ్మతమో మాకును నదియే సమ్మతమనిరి. శ్రీ కాంచీపూర్ణులపుడు "దేవా! దేవరవారి విషయమిదివఱకే సంకల్పించియుండకపోరుగదా. దాసునియందుగల యవ్యాజ కృపచే నిటులానతిచ్చుచున్నారేగాని వేఱుగాదు. శ్రీ యతీంద్ర విశ్లేష మోర్వరానిదయ్యును, సకలచేతనోద్ధరణరూప కైంకర్యము వీరి మూలమున నెఱవేర్ప దేవరవారు సంకల్పించియుండ నోర్వజాలని విశ్లేషమునైనను నోర్చుకొన నభ్యసించుటే స్వరూపముగదా." యనిరి అచ్చటఁ జేరిన భాగవతోత్తములందఱందుకు సంతసించి "దాసులమనంబుగూడ మన యతీంద్రులవారి నెటుల విడిచి యుండ నగుననే విషయమున డోలాయమానముగ నుండినది. దేవరవారి శ్రీసూక్తులచే స్వరూపజ్ఞు లిట్టి పరిస్థితిలో ననుసరింపవలసిన పద్ధతి విశదమయ్యె"ననిరి. అపుడు భగవానులు "శ్రీ కాంచీపూర్ణులన్నటుల నిక్కముగ రామానుజ విశ్లేష మట్టిదేగాని సంకల్పింపఁబడిన కార్యము నెఱవేర్పక తీరదు" అనుచు శ్రీ రామానుజ యతీంద్రులపై తమ సాంద్ర కరుణాకటాక్షములఁ బ్రసరింపఁజేసి, మంగళాశాసనంబొనర్చి శ్రీ తిరువంగప్పెరుమాళరయరును, శ్రీ రామానుజ యతీంద్రులను, శ్రీ కాంచీపూర్ణులను, తక్కుంగల భాగవతోత్తములను నుచితరీతి తీర్థ, శఠగోప, ప్రసాదాదులచే సత్కరింపఁజేసి పంపిరి. శ్రీ రామానుజ యతీంద్రులకు భగవద్భాగవత విశ్లేషము నోర్చుకొనుట కష్టసాధ్యముగ నుండెను. అందును తమకాది నుండియు ప్రాణపదముగ నుం

దిన శ్రీ కాంచీపూర్ణుల నెడబాసి యుండవలయునన్న మిక్కిలి కష్టసాధ్యముగదా. ఆకారణముచే మహాభాగవతోత్తమ విశ్లేష మున కెంతయో సంతాపము నొంది తుదకు మనంబును బదిల పఱచుకొని శ్రీ కరిగిరీశుని యాజ్ఞగొని సన్నిధినుండి మరలి శ్రీ పెరుందేవతాయారును, ఆళ్వారాచార్యులను క్రమముగా సేవించు కొని యనుజ్ఞవడసి, శ్రీ కాంచీపూర్ణ యరయరులతోగూడ ముఖ మండపము నొద్దకు విచ్చేసి, శ్రీ కాంచీపూర్ణుల నియమును బొంది శ్రీ అరయరుతో స్వమఠమునకు విచ్చేసిరి. శ్రీ తిరువరంగప్పెరు మాళరయరు కానాడభ్యవహారాది సత్కారములును, శ్రీ యతీంద్రుల మఠముననే సంతృప్తికరముగ జరిగినవి. శ్రీ యతీంద్రులు స్వమఠమునందుగల యమూల్యవస్తువులన్నియు శిష్యుల మూల మున శ్రీ వరదరాజ పెరుమాళ్ల సన్నిధి సమర్పించి, మఠమును, మఠమునందుగల వస్తువులన్నియు శ్రీ కాంచీపూర్ణులవారి వశ మొనర్చిరి. శిష్యులకును, తమ్ము దర్శింపవచ్చిన భాగవతోత్తము లకును కడసారి దెల్పదగు తత్వావబోధకమగు విషయములన్ని యు నానాడంతయు సాదర హృదయులై దెలిపిరి. మఱుదిన ముదయముననే నిత్యకర్మానుష్ఠానము శీఘ్రముగ నెఱవేర్చుకొని శ్రీ యరయరుగారితోగూడ శ్రీ కాంచీపూర్ణుల సన్నిధానమున కరిగి యంజలి ఘటించి శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి కరుగ నియమ నము వేడిరి. నంబి (శ్రీ కాంచీపూర్ణులు) గాయను స్వవత్స విశ్లేషమునకై పరితపించుగోవు పగిది యించుకసేపు విశ్లేష దుఃఖమనుభవించి, స్వాచార్య పుత్రులగు శ్రీ యరయరు సన్ని

ధిని సాష్టాంగ వందనం బాచరించి యంజలి ఘటించి, "శ్రీ రామా నుజ యతీంద్రులతిసుకుమారులను నది మీకు తెలియని విషయము గాదు. వీరికి పథశ్రమ మావంతయు సోకనివ్వక శ్రీ శ్రీ నం బెరుమాళ్ల సన్నిధిని జేర్పుడని ప్రార్థించి వారిరువురివెంట కొంత దవ్వనుగ మించిరి. వీరి ప్రయాణవార్త వినిన వారిలో పలువురు గుంపులుగాజేరి వీరివెంబ నంటివచ్చుచుండి, కొంత దవ్వరిగి శ్రీ యతీందర్ర నియమనమున దుఃఖభారముచే మరలిరి. శ్రీ కాంచీపూర్ణులును కడసారి శ్రీమద్రామానుజ యతీందురలకు మంగళాశాసనం బొనరించి విశ్లేష భారముచే కంటతడి యొత్తు కొనుచు, శ్రీ అరయరుగారి కంజలి ఘటించి నియమనముఁ బొంది మరలిరి. శ్రీ ముధలియాండాను మున్నగు భాగవతోత్తములు తమ తిరువారాధనమూర్తిని, పరికరములనుగొని వెనువెంటకొనిరాగా శ్రీ యరయరుతోగూడ శ్రీ యతీందురి లిటుల శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి పయనము సాగించిరి. శ్రీతిరువరంగప్పెరుమాళరయరు మృదుమధురాలాపములును, మార్గమధ్యమునగల సరిద్వన పర్వ తాదులచే చూపఱులకు నేత్రానందము గావించు ప్రకృతి సౌం దర్యమును, తమ కనుసన్నల వినయవిధేయతలతో మెలంగుచు వెనువెంటనే వచ్చుచుండు శిష్యబృందమును, మార్గాయాసమున కెడమివ్వకున్నను, శ్రీ కాంచీపూర్ణ, శ్రీ కరిగిరీశ విశ్లేష భారము మధ్యమధ్యశ్రీయతీంద్రులమనంబును గలంచుచుండినది. శ్రీరామా నుజవిశ్లేషముచే శ్రీకాంచీపూర్ణ, శ్రీకరిగిరీశులపరిస్థితులును నటు లనే యుండినవి. శ్రీయఃపతి సర్వశక్తి సంపన్నుడగుటచే నోర్పు

కొనగలదుగాని, మూర్తిగైకొన్న కరుణారసమోయని గన్పట్టు శ్రీకాంచీపూర్ణుల పరిస్థితిగదా పరితాపమున కాస్పదమైనది. అయినను శ్రీకరిగిరీశుడు తన యేకాంతానున యాలాపములచే వారి నూఱడిల్ల జేయుచుండెను.

ఇరువదిరెండవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## ఇరువదిమూడవ గుచ్ఛము

శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిఁ నొకనాటి ప్రాతఃకాల సేవాకాలమున శ్రీరంగనాధుని తిరుముఖ మండల మత్యంత శోభాయమానముగ నుండుటను భాగవతోత్తము లందఱు గమనించియు, కారణ మఱయఁజాలక, సంతస సంభ్రమములతో నొకరిమొగ మొకరు చూచుకొనుచుండిరి. అపుడు భగవాను దర్చకముఖముగ "మీరానాడు సిద్ధాంత వ్యాప్తికిగాను శ్రీ రామానుజ యతీంద్రు నెన్నుకొని యతని నిందుతోడితేర శ్రీ తిరువరంగప్పెరుమాళరయరును శ్రీ కాంచీపురికిఁ బంపియుంటిరిగదా? రేపటియుదయ మిదేవేళకు శ్రీ రామానుజులును, శ్రీ తిరువరంగప్పెరుమాళరయరును, నీనగరముఁ జేరవత్తురు. రేపటి సేవాకాలపు గోష్ఠిలో వారుందుర"ని బలికిరి. ఈ సువార్త నచ్చటఁ జేరియుండిన భాగవతబృంధమంతయువిని శ్రియఃపతి సౌశీల్య, సౌహార్ద, కారుణ్యాది కల్యాణగుణ సమృద్ధికానంద నిమిగ్న

మానసులై నుచితరీతి పూజించి స్తుతించి సన్నిధిలో తీర్థ, శఠ
గోప ప్రసాదాదాది సత్కారములు వడసి, భగవదాజ్ఞగొని తమ
తమ నివాసముల కరిగి, శ్రీమద్రామానుజ యతీంద్ర దర్శన
కుతూహలులై నిరీక్షించుచుండిరి. ఆనాటిరాత్రి కోవెలయధికారి
స్వప్నమున శ్రీరంగనాధులు సాక్షాత్కరించి, సీవరుణోదయమున
లేచి సకల మర్యాదలతోడను, భాగవతబృందముతోడను శ్రీ
కావేరీ దక్షిణతీరమున శ్రీ రామానుజ యరయరుల నెదుర్కొని
సత్కరించి సన్నిధికిఁ దోడ్కొని రమ్మని పలికి యదృశ్యులైరి.
కోవెల యధికారియు మఱుక్షణమే మేల్కాంచి, స్వప్నవృత్తాంత
మున కలరి, యరుణోదయమువఱకు భగవధ్యాన తత్పరుడై
యుండి, యవ్వలలేచి కాల్యకృత్యములు నిర్వర్తించుకొని యుద
యముననే భాగవతోత్తముల కందఱకు స్వప్నమున భగవాన్లు
దెల్పిన యంశములన్నియుఁ దెలిపిరి. వారును తమ తమ
యాప్తుల కావార్తఁ దెలుపుకొని శీఘ్రముగ ప్రాతరనుష్ఠానములఁ
దీర్చుకొని భగవత్సన్నిధిలోఁ జేరిరి. కోవెలయధికారియు శ్రీ
నంబెరుమాళ్ల యనుజ్ఞవడసి శ్రీ శఠారి నొక బంగారు పల్లకిలో
వేంచేపు చేసుకొని సకల మంగళద్రవ్యములఁగొని పంచమహా
వాద్యములతోను, నుభయ వేదాధ్యయన మొనర్చు భూసుర భాగ
వతగోష్ఠితోను, శ్రీ కావేరీ దక్షిణతీరమున యతీంద్రు నెదుర్కొన
వేంచేయుచుండ నా దివ్యసన్నివేశమంతయుఁ జూచువారి కెంత
యో యానంద దాయకమై నేత్రపర్వముఁ గావించుచుండెను.
శ్రీ కాంచీపురినుండి వేంచేయుచుండు మన యతీంద్రులవారును,

అరయరుగారును తక్కుంగల దాశరధ్యాది భాగవతోత్తములును, నరుణోదయమునకే శ్రీదక్షిణకావేరీ తీరముఁజేరి శీఘ్రముగ నిత్యకర్మానుష్ఠానములు నిర్వర్తించి భగవత్సన్నిధి కరుగ నుద్యుక్తులై యుండి, తమచెంతకు వచ్చుచుండు మంగళవాద్య బ్రహ్మఘోషరవము వినిరి. అపుడు శ్రీఅరయరు, శ్రీయతీంద్రులతో "మిమ్ముల నుచిత మర్యాదలతో సన్నిధికి గొనిపోవ సన్నద్ధులై స్వాములందఱు మంగళవాద్యయుభయవేదాధ్య యన పురస్సరముగ నెదుర్కొన వేంచేయుచున్నటు లున్నది" యనిరి. యతీంద్రులు: మనమీదినమే యిచ్చటికివచ్చి చేరియుండు సంగతి వారికెటుల తెలియవచ్చి యుండును? ఆశ్చర్యముగ నున్నదే. ఇంతకును మనముకూడ కోవిల కరుగుటకే సంధ్దులమై యుంటిమిగదా. భగవత్సేవా పరులకు మంగళవాద్యాది మర్యాదలతో నవసరమేమున్నది? శ్రీఅరయరు: అది సత్యమేకాని భగవన్నియమనముతో వారటుల వచ్చుచుందురని దలంతును. ఇటుల మాటలాడుకొనుచూ కొంతదూరమరుగు నప్పటికా మంగళధ్వను లతిసమీపమున నే వినవచ్చెను. మన అరయరుస్వాములను గ్రహించినటుల నిది శ్రీరంగనాధుని యవ్యాజ ప్రేరేపణవలెనే తోచుచున్నదని శ్రీనెడదూరాళ్వారనిరి. శ్రీకాంచీపురినుండి మన యతీంద్రుల నంపిన శ్రియఃపతియే మంగళవాద్యములచే నెదుర్కొన వీరిని ప్రేరేపించినాడని శ్రీముదలియాండారనిరి. ఇటుల మాటలాడుకొనుచు మఱికొంత దూరమరిగిన వెంటనే శ్రీశఠారిని వేంచేపుచేసుకొని వచ్చుచుండు పల్లకియు, పల్లకి ముందుశంఖకాహళాది

మంగళవాద్యములను నధ్యయనపరులగు భాగవతోత్తములను నగపడి, వీరిని కలిసికొనిరి. శ్రీ శఠారికి ప్రదక్షిణ ప్రణామము లర్పించి, భాగవతబృందములో శ్రీ పెరియనంబిగారినిగని శ్రీ యతీంద్రులు ప్రక్రమ ప్రణామము లర్పించిరి. వారును శ్రీమద్రామానుజ యతీంద్రులనుగని యమందానంద మానసులై మంగళా శాశనమొనర్చిరి. భాగవతులందరు నొకరికొకరు వందన ప్రతివందనము లొనర్చుకొని శ్రీరంగమునను శ్రీ కాంచీపురిని భగవద్భాగవత వైభవములన్నియు నత్యాదరమున విచారించుకొని సంతసించుచుండిరి. సన్నిధి యర్చక పరిచారకులు యధికారినియమనమున శ్రీ యతిరాజులవారిని, తిరుమాల తిరుపరివట్ట, తీర్థ, శఠగోపాద్యుచిత సత్కారములఁ దనిపి, శ్రీ అరయరుగారిని, మొదలియాండాళ్ నెడాదూరాళ్వాను మున్నగు భాగవతోత్తములను నుచితరీతి నదేవిధమున తీర్థ, శఠగోప, ప్రసాదముల సత్కరించిరి. అటుపిమ్మట వారందరును శ్రీ శఠారివెనుకను, ముందుగను, నుభయపార్శ్వములను బద్ధాంజలిపుటులై నడచుచుండ, మంగళధ్వనులును, నుభయవేదాధ్య యనవరమును మిన్నుముట్టి చెలంగ, తిరువీధులగుండ ప్రదక్షిణ మాచరించి శ్రీ శ్రీ నంబెరుమాళ్లసన్నిధి మహద్వారమున కంజలి ఘటించి కోవిలలోన ప్రవేశించిరి. శ్రీ యతీంద్రులును, భాగవతబృందమును శ్రీరంగనాధ ప్రణవవిమానమునకు బ్రదక్షిణమొనర్చి, బలిపీఠ, ధ్వజస్థంభ, విష్వక్సేనాధుల సన్నిధిని సాష్టాంగవందనం బాచరించి, శ్రీరంగనాయకీదేవిని సేవించుకొని, శ్రీ చంద్రపుష్క-

రిణీ తీర్థము స్వీకరించి సన్నిద్దరాళ్వార్లను దర్శించి, శ్రీ జయ విజయాఖ్య ద్వారపాలకులకుమ్రొక్కి భగవత్సన్నిధి గర్భాల యము వఱకు వేంచేసిరి. ఆనాడు యాత్రికులు, భాగవతులు, భక్తులు శ్రీరంగనాధుని దివ్యవైభము, శ్రీమదామానుజ యతి చంద్రుల యసదృశపరిభావము పలువిధముల కొనియాడుచు క్రిక్కిఱిసి కోవిలలో నెటువైపుజూచినను నిండియుండిరి. శ్రీమద్రామానుజ యతీంద్రులు భాగవతబృందముతోజేరి రజితాద్రి నావరించిన నీలజీమూతంబు పగిది శేషశయ్యపై వెలయు శ్రీరంగ నాధుని దివ్యమంగళవిగ్రహమును, నీలజీమూతంబులోని క్రొక్కా రుమెఱుంగుల తెఱంగున కన్నులకు మిఱుమిట్లు గొలుపు శ్రీ భూనీళాది దివ్యదేవేరుల మూర్తులను కన్నుల కఱవుదీర యా కొన్నవారు సిద్ధాన్నమునుగని నటులగని యానందాంబుధి నోల లాడిరి. శ్రీ యతీంద్రులపుడు శ్రీపాణి యోగీంద్రుని పగిది శ్రీరంగనాధ దివ్యమంగళ విగ్రహము నాపాదమస్తక మభి వర్ణించుచు సేవించి పులకీకృత సర్వావయవులై యానందాబుధిం దేలు చుండిరి. శ్రీరంగనాధుని యానాటి తిరుముఖ మండలసేవ గడచిన దినమునకన్న నత్యంత శోభావంతముగ నుండెను. శ్రీరంగనాధునికిని, దేవేరులకును, తిరువంజన, అలంకార, నివేదన, నీరాజననాదు లతివైభవంబున జరిగినవెనుక, శ్రీమ ద్రామానుజ యతీంద్రులకు తిరుమాల తిరుపరివట్ట, తీర్థ, శఠగోప ప్రసాదము లర్చకులర్పించిరి. శ్రీ యతీంద్రులవి "ధన్యోస్మి, కృతార్థోస్మి, అనుగృహతోస్మి" యనుచు స్వీకరించిరి. భాగ

వతులందఱకు తీర్థ, శఠగోప ప్రసాదము లుచితరీతి లభించిన వెనుక, శ్రీరంగనాథులు తమ సాంద్ర కరుణాకటాక్షములు శ్రీ యతీంద్రులపైఁ బ్రసరింపజేసి, యర్చక ముఖముగ "యతీంద్రా! శ్రీ కాంచీపురిని నీవు గావించిన యనన్యసామాన్య కార్యములచే మా మెప్పువడసి "యతిరాజ"ను బిరుదము వడసితివి. ఇచ్చటను నీవొనర్పవలసిన కైంకర్యము లెన్నియోగలవు. మాసన్నిధిలో మాకు జరుపవలసిన సకల కైంకర్య నిర్వాహకాధికారము నేడు మొదలు నీవశంబొనర్చితిమి. ఉభయవిభూతుల నిర్వహణ భారము నేడుమొదలు నీయందుంచబడినది. నిన్నేగాక, నీవారిని నీవారి వారిని నిరంతర వారికి ముక్తికరతలామలకము. నీవిమీద నీకొసంగబడిన సర్వకైంకర్యాధికార చిహ్నముగ ఉడయవర"ని సకల ప్రపన్న బృందముచేఁ బిలువబడుచు చిర కాలము వర్ధిల్లుచు, నీ పరమవైదిక శ్రీవైష్ణవ సిద్ధాంతము సర్వ తోముఖగఁ నవిచ్ఛిన్నముగ వ్యాపింపజేయుదువుగాక ! యని మంగళాశాసనం బొనర్చిరి. అటుపిమ్మట, కోవెలయధికారిని, భాగవతబృందమునుగని, మీరందరు వీరికి వలయు పరికరము లన్నియు సమకూర్చుచు, వీరి ముఖోల్లాసమే సకల పురుషార్థ ములకు మూలమనినమ్మి యపరాధ లేశమైన లేక ననువర్తించు చుండుడని యాజ్ఞాపించిరి. శ్రీ యతీంద్రులు శ్రీరంగనాథుని యవ్యాజకృప కళ్యాశ్చర్యానంద నిమగ్న మానసులై వేమారు నుతించి, నియమనము బొందిరి. భాగవతులందఱును నటులనే యొనర్చిరి. భాగవతబృందము శ్రీ శ్రీ యతిరాజులవారిని, వారి

కొఱకై యిదివఱకే నిర్మింపబడి యుండిన మఠమునకు వేంచేపు చేసుకొనిపోయి సకల సత్కారములదనిపి యనుజ్ఞవడసి తమ తమ గృహముల కరిగిరి. శ్రీమద్రామానుజ యతిచంద్రు లానాడు మొదలు భగన్మంగళాశాసన బలంబుచే శుక్లపక్ష చంద్రుని పగిది నలరారుచు శ్రీవైష్ణవ సంప్రదాయ రహస్యము లాశ్రిత బృంద మునకు దెల్పుచు, కోవిలకైంకర్యముల విచ్ఛిన్నముగ నడిపించుచు, పరమవైదిక విశిష్టాద్వైత సిద్ధాంతవ్యాప్తి సర్వతోముఖ ముగ గావించుచుండిరి.

ఇరువదిమూడవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఇరువదినాలుగవ గుచ్ఛము

పాఠక మహాశయులారా! శ్రీ కాంచీపురము నుండి శ్రీరంగనగరమునకు, శ్రీరంగనాథుడు శ్రీమద్రామానుజ యతీంద్రులను బిలిపించుకొని తమ సన్నిధిలోని సకల కైంకర్య నిర్వాకత్వ భారమును, నుభయవిభూతి నిర్వాహకత్వ భారమును వారివశమొనర్చి, "ఉడయవర్" యను బిరుదనామముచే మంగళాశాసనమొనర్చి యుండుటచే వీరి ఖ్యాతిలత నలుదిశలఁ బ్రాకి భాగవతోత్తములకును, భక్తులకును నామోదాశ్చర్యములఁ గూర్చుచుండెను. శ్రీరంగముచుట్టు ముట్టు గ్రామములలోని వారేగాక దూరమున నుండువారు సయితము వీరి దివ్యసన్నిధి నాశ్రయించి యశ్రుతపూర్వ శ్రీవైష్ణవ దర్శనరహస్యము లెన్నియో లభించి ధన్యులగుచుండిరి. మనమాకాలమునాటివారము గాకపోవుటనుఁబట్టి యంతటి భాగ్యము లభింపకున్నను, భావనావశముననైన వారి దివ్యమంగళ విగ్రహము నాపాదమస్తకము సేవించు

కొనుచు, వారి కల్యాణ గుణములనుఁ దలచి దలచి యానందిం చుకొనుచు నుండు నవకాశము శ్రియఃపతి యనుగ్రహించుటచేఁ నా దయామయుని యవ్యాజకృపను సయితమనుదినంబునను సంధించుచే స్వరూపముగదా? భగవదర్చామూర్తి ననన్య భక్తిచే సేవించుచు నారాధించుచురాగా, ఆయవ మనకుత్తమ భాగవతుల సాన్నిధ్యముఁ గలుగ జేయును. వారిని మనము భగవంతు నారాధించు విధమున ప్రేమవిశ్వాసములతో నారాధించుచురాగా భాగవతులే మనపై పరిపూర్ణానుగ్రహము ప్రసరింపజేసి భగవ ద్భాగవత సేవావిధానము కొంతదెల్పి యుత్తములగు నాచార్య సన్నిధి నాశ్రయింపజేర్చి యప్పటప్పటికి మన యోగక్షేమము లఱయుచుందురు. ఆశ్రయింపబడిన యాచార్యులును మనకు శీఘ్రముగ భగవత్సాయుధ్యానందము లభింపజేతురు. గనుక శీఘ్రముగ భగవత్సాయుజ్యానందముఁ జూఱగొను వారందఱకు భగవద్భాగవతాచార్యకృప లభింప జూచుచే తరుణోపాయము ఇందు కాదర్శప్రాయ లెందఱోగలరు. అట్టివారి వైభవ మించుకైన చవిచూచుటకు మనము మఱొక పర్యాయము భావ సావధానమున శ్రీకాంచీనగరమున కరుగుదము రండు. మన మనోరథము సుసంకల్పహయ సంయుక్తమై సుబుద్ధిసారథ్యముచే నడచుచున్నది. మనోరథవేగమునకు వైకుంఠదర్శనవాయు సం ఘములు తోడ్పడ తోడ్తో మన భావనేత్రమున కేదియో బాలా ర్కుని తేజముచేఁ బ్రకాశించుచు చూపట్టుచుండుటలేదా? అటు లత్యుజ్వల ప్రకాశవంతమై యలరారుచుండునదే శ్రీహస్తిగిరీ

ఖని పుణ్యకోటి విమానము. స్వాములందఱు, వేకువజామున లేచి పవిత్రవేదవతీ నదీతోయములఁ గ్రుంకి ధౌతవస్త్రధరులై ద్వాదశోర్ధ్వపుండ్రాలంకృతులై భగవదాజ్ఞావిధుల నెఱవేర్చు కొని శ్రీ శ్రీ వరదరాజ పెరుమాళ్ల సుప్రభాతసేవ ముగించుకొని మహాద్వారముదాటి వచ్చుచుండుటను గమనింపుడు. వారెద్దియో స్తోత్రమునను సంధికొనుచు వచ్చుచున్నటున్నది. ఆస్తోత్రము శ్రీ కాంచీపూర్ణ నిరచిత దేవరాజాష్టకము. "శ్లో॥ నిందితాచార కరణం, నివృత్తం కృత్యకర్మణః, పాపీయాంస మమర్యాదం పాహిమాం వరదప్రభో" యను కడపటి శ్లోకము మాత్రము వినవచ్చుచున్నది. అంజలి బద్ధులై మహద్వారమునొద్ద, నొక్కొక్కరును, శ్రియఃపతి కభిముగ నిలిచి సర్వాపరాధ క్షమాపణ వేడి నమస్కరించి యరుగుచున్నారు. స్వగృహములకా? అవి వార్యకార్యముండువారే స్వగృహముల కరుగుచుండినది. మిగత వారందరు శ్రీ కాంచీపురికి సమీపమున నుండుకూరాగ్రహారమున కని యచ్చటనున్న యిరువురు భాగవతులసంభాషణవలనఁ దెలియవచ్చుచున్నది. వారిలో నొకరిపేరు శ్రీనివాసాచార్యులు, మఱియొకరిపేరు వరదాచార్యులు. వాఱిరువురివ్విధముగ సంభాషించుచున్నారు. "శ్రీనివాసాచార్యా! ఈనాడుఁగూడ దేవరవారు కూరాగ్రహారమున కరుగదలచుకొంటిరా? దాసునికి శ్రీమద్రామాయణ వ్యాఖ్యానము దేవరవారి నుండియే వినవలయునని యిదివరకెన్నిమాఱులో విజ్ఞాపనఁజేసి యుంటినిగదా? అందులకే యడిగితిని. శ్రీనివాసాచార్యులు: "దాసుడది మఱవలేదుగాని,

ప్రకృత మాకైంకర్యముఁబూన సాధ్యపడలేదు. ఏలయందురా, శ్రీ కూరనాధాచార్యులవారు కూరాగ్రహారమున సాయించుచుండు శ్రీ స్తోత్రరత్న వ్యాఖ్యాన మింకను, పది శ్లోకముల వ్యాఖ్యానము కొదువయున్నది.

శ్రీనివాసాచార్యులు; ఆ స్తోత్రరత్నములోని భావములు, కొద్దికాలములో ముగియునవియా ? ఇంతకును, భాగవతారాధనానంతర మారంభింపబడి సూర్యాస్తమయ సమయమునకు రెండు శ్లోకముల వ్యాఖ్యానమే సాయించుచుందురు. వరదాచార్యా ! స్తోత్రరత్న వ్యాఖ్యానము సేవించవలయునన్న శ్రీ కూరత్తాళ్వాన్ సన్నిధియందే సేవించవలయును. వారి జిహ్వాగ్రసింహాసనమున శ్రీ హయగ్రీవమూర్తి యధ్యాసీనులై యుందురనుటకేలాటి సందియమునులేదు. శ్రీ కులశేఖరాళ్వార్ల ముకుందమాలలోని "శ్లో॥ బద్ధేనాంజలినానతేన శిరసాగాత్రైస్సరోమోద్గమైః కంఠేన స్వరగద్గదేన నయనేనోద్దీర్ణ బాష్పాంబునా" యిత్యాది శ్లోకములోని భావవైఖరి యంతయు మన శ్రీ కూరనాధాచార్యులవారియెడ సుస్పష్టముగఁ గావనగును. ఇక వ్యాఖ్యాన వైఖరియో వాచామగోచరము. ఆనందప్రవాహతరంగముల నొక్కొక్కరి నోలలాడించుచుండును.

వరదాచార్యులు: అటులైన దాసుడు గుడినెకువెళ్లి కాలక్షేప సమయమునకు రావచ్చునుగదా ?

శ్రీనివాసాచార్యులు; వేయారు భాగవతోత్తములకు నిత్య తదీయారాధన జరుగుచుండు నా సన్నిధిలో మీకేలాటి సత్కార

లోపముండదు. దేవరవారి తిరుమాళిఘలో పెరుమాళ్ల తిరువా ధనకు వలయు నేర్పాటులన్నియు గావించి శీఘ్రమునరండు. మీరొచ్చునంత వఱకు దాసుడు శ్రీరంగాచార్యులవారి తిరుమాళి ఘలో దేవరవారి కొఱకై నిరీక్షించుచుండును.

వరదాచార్యులు: భాగ్యము, భాగ్యము. ఇదే త్వరితమున నరుగుచున్నాడనని వారియాజ్ఞగొని స్వగృహమున కరిగిరి. కూరాగ్రహార నివాసులగు శ్రీ కూరత్తాళ్వాన్ నిదివఱకే భగవద్రామానుజ యతీంద్రుల నాశ్రయించి యుండిరని వెనుకటి గుచ్ఛములలో నొకచో విజ్ఞాపనం బొనర్చి యుంటినిగదా. వీరి తండ్రిగారు శ్రీ దామోదరాచార్యులవారనియు. తల్లిగారు శ్రీమతి పెరుందేవమ్మగారనియు, వీరి జననము కలియుగాది 4109 వది యగు శ్రీ సౌమ్య సంవత్సర పుష్య బహుళ పంచమీ గురువాసర యుత పుష్యమీనక్షత్రమునందనియు, వీరు శ్రియఃపతి శ్రీ వత్సాంశమున హారీతగోత్రమున జన్మించిరనియు వాడుక. వీరు నివసించు కూరాగ్రహారము తృణ, కాష్ట, జల, సమృద్ధిగల శ్రోత్రియ గ్రామము. ఈ గ్రామమున కేవల భగన్ముఖోల్లాస ముగ యజ్ఞయాగాదు లొనర్చుచు నిత్యాగ్నిహోత్రముల వ్రేల్చు చుండు శ్రోత్రియ శ్రీవైష్ణవ భాగవతోత్తము లెందఱోగలరు. నిఖిల శ్రీవైష్ణవోత్తమ జిహ్వాగ్రము నిత్యనివాసముగ నేర్పఱచు కొని వేదమాత యనుదినంబును నత్యంతా మోదము ననర్తనము సల్పుచున్నదో యనునటుల భూసుర భాగవత బృందమనుదినం బును సంతత వేదాధ్యయన సంపన్నులై యుండిరి. జారచోర

దుర్భిక్షాద్యుపద్రవములన నెట్టివో యా గ్రామవాసు లెఱుంగరు. ఆధివ్యాధులచే గాసినొందక యదృచ్ఛాలాభ సంతుష్టులై వారం దఱు కాలము నెమ్మదిగ ద్రోసిపుచ్చుచుండిరి. ఇట్టి విలక్షణాగ్రహారమున నొక భూసురోత్తముని గృహము వంశపారంపర్యముగ శ్రీ మహాలక్ష్మీ కటాక్షమునకు నిలయమై యుండినది. కూరాగ్రహారముననేగాదు, యా కాంచీమండలమున నైశ్వర్యముననేమి, యాభిజాత్యనేమి, యాధ్యాత్మిక విద్యయందేమి, యన్నిటినీ మించిన నఖిలభాగవతాను వర్తనముననేమి యా శ్రీవైష్ణవ కుటుంబతోతుల( దూగువారు మిక్కిలి యరుదనియే చెప్పక(తీరదు. ఈ కుటుంబమునకు( జేరినవారే మన శ్రీ కూరనాధాచార్యులవారు. శ్రీ పరకాలమహాముని యని సుప్రసిద్ధిగాంచిన శ్రీ తిరుమంగయాళ్వారులలోని కొన్నిసుగుణములు వీరియెడ వీరి పూర్వవయస్సుననే గానవచ్చుట పూర్వవిషయముగదా. ఆ సుగుణములలో ముఖ్యమైనది పరమ భాగవత నిత్యారధనాసక్తి. బహుమృదు స్వభావులీ కూరత్తాళ్వాన్ వీరియెడ "సుకుమారా మహాబలా" యను మహర్షి శ్రీ సూక్తికనుగుణమగు బలవత్తరమగు మతాభి నివేశమసదృశమని ముమ్ముందు మనకు( దెలియకపోదు. వీరు శ్రీ ఉడయవరులకు (శ్రీ రామానుజులకు) పూర్వాశ్రమ దేహబంధువులేగాక "జ్ఞానీత్వాత్మైవమే మతం" యను శ్రీ రామానుజ (శ్రీకృష్ణ) శ్రీ సూక్తి కనుగుణముగ వీరు శ్రీమద్రామానుజుల వారి కత్యంత ప్రీతిపాత్రులుగగూడ నుండినవారు. శ్రీమద్రామానుజ కల్పద్రుమ కీర్తిసౌరభము నాఘ్రాణించి

యునమ్మస్థకులైన వారిలో వీరు ముఖ్యులని చెప్పనొప్పును. శ్రీ రామానుజ సాన్నిధ్యమున నిత్య కైంకర్యము లభించిన వారెంత ధన్యులో యనియు తమకున్న యట్టి మహనీయుల మంగళాశాసన బలముచే తాదృశ కైంకర్య ప్రాప్తి యెప్పుడు లభింప నున్నదో యనియు, వాంఛ శ్రీవారు శ్రీరంగమునకు వేంచేసినది మొదలు నిత్యాను సంధానముగ నేర్పడి యుండినది. భగవంతుని విశేషానుగ్రహము లభించిన వారి కందఱకు నిది నైజమని శ్రీ సంకర్షణానువర్తియగు వృత్రాసుర ప్రార్థనలో నీయమూల్యాంశము లిమిడి యున్నవి. ఆ యమూల్యాంశములను సంస్కృత భాగవతము నుండి పరమభక్తుఁడగు బమ్మెర పోతనామాత్యుఁ డివ్విధముగ నాంధ్రీకరించెను.

చ॥ అరయగ భక్తపాలనములైన భవద్గుణజాల మాత్మసం
స్మరణముఁజేయ వాక్కు నిను సన్నుతిఁజేయ శరీరమెల్ల కిం
కర పరివృత్తిఁ జేయ మది కాంక్షయొనర్పదగాని యొల్లనే
నరిది ధ్రువోన్నత స్థలము నబ్జజుపట్టణ మిద్రభోగముల్.

ఉ॥ ఆకలిగొన్న క్రేపులు రయంబున నీకలురాని పక్షులుం
డీకొని తల్లికిన్ మఱి విదేశగతుండగు భర్తకంగజ
వ్యాకుల చిత్తయైన జవరాలును దత్తఱమందు భంగినో
శ్రీకర పంకజాక్ష నినుజేరగ నామది కోరెడుంగదే.

కం॥ నాకును సఖ్యము పుణ్య శ్లోకులతోగావి తత్వశూన్యులు సంసా
రైక విమోహులతోడన్ గాకుండ నొనర్పుమయ్య కంజదళాక్షా.

ఈ పద్యరత్నత్రయమే ప్రపన్నాశములకుఁ బ్రబలా

దర్శములై ప్రకాశించుచున్నవి. ప్రారబ్ధ కర్మానుగుణ్యాపగ్రస్తుడై యసుర శరీరము దాల్చిన శ్రీ చిత్రకేతునకే యిట్టి విమలాశయముఖండ నిత్యసూర్యంశమున నందును శ్రియఃపతి కసాధారణ యదృష్ట చిహ్నమగు శ్రీవత్సాంశమున నవతరించి యుండు మన శ్రీకూరనాథాచార్యులవారి విషయము వడుగవలయునా? దేనికైనను కాలకర్మ సంయోగ మావశ్యకమై యుండునుగదా! ఆదిశేషాంశులగు యతి చంద్ర సాన్నిధ్యమునకే చంద్రచకోరన్యాయమున వారును నిరీక్షించుచుండిరి. శ్రీ చిత్రకేతు మహారాజునకు నాదిశేష సంశ్లేషమునకుఁ గాల విలంబన మయినదిగాని, మన కూరత్తాళ్వాను కంతటికాల విలంబన ముండుట కవకాశములేదు. ఇట్టి పరమ భాగవత సాన్నిధ్యమున స్తోత్రరత్న కాలక్షేపమనుభవించుటకే, నాటియుదయమున భాగవతోత్తము లందఱరుగుచుండిరి. అదిగో! యనుకొనుచున్న వేళకే వరదాచార్యుల వారును వచ్చుచుండిరి.

ఇరువదినాలుగవ గుచ్ఛము — సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## ఇరువదియైదవ గుచ్ఛము

శ్రీ కాంచీపురమున నొకానొక దినమున రాత్రి వరదరాజ స్వామికి శయనోత్సవము జరుగుచుండెను. నృత్యగీతవాద్య పురస్సరముగ డోలోత్సవ మారంభమయ్యెను. భగవంతునకు భక్ష్యభోజ్యములును, పాలు పంచదార ఫలములు యధావిధిగా మంగళతూర్య రావములతో నివేదన జరిగిన యనంతరము యర్చక పరిచారకులు వరదరాజ పెరుమాళ్ళనుభయ నాచ్చి మార్లతోఁగూడ బంగారు గొలుసుల రత్నడోలికలో వేంచేపు చేసిరి. స్వామిసన్నిధికి చేరిన దేవదాసీలు మృదుమధుర స్వర ముతో గానమొనర్చిరి. వీణాగానము, భరతనాట్యమును శ్రోత్ర ప్రేయముగను నేత్రపర్వగము నుండెను. అధ్యాపకులు వేదోక్త మంత్రపుష్పముతో మంగళాశాసనము గావించిరి. పెరుమాళ్లను చందనాగరు ధూపవాసనలు వెదఁజల్లు పుష్పశయ్యపై వేంచేపు చేసి నీరాజనమర్పించి దేవోపచార రాజోపచారముతో (తీర్థ

నము సేయ) పూజ ముగించి యర్చక పరిచారకులును శ్రియఃపతి యాజ్ఞగై కొని నుద్యుక్తులై యుండ దూరమునుండి కంచుతలుపులు మూసిన శబ్దము సన్నిధిలో నుండు వారికందరకు వినవచ్చెను. భగవన్మూర్తియు దేవేరులును ఇంచుక చలించినట్లయ్యెను. శ్రియఃపతి యర్చక ముఖముగ అట్టి యపూర్వశబ్ద మెచ్చటిది యని భాగవతుల నడుగ, నపుడు వారిలో నొకరు దేవా! ఇది కూరాగ్రహారమున నుండు కూరత్తాళ్వాన్ గృహకవాట శబ్దము. వారు భాగవత తదీయారాధన నిప్పటికి ముగింపుచేసి కవాటములు బంధించి శయనించు సమయమని విజ్ఞాపనఁ జేసిరి. అదివిని భగవానులేమియు పల్కరైరి. కైంకర్యపరులు మున్నగు వారందరు తీర్మానము సేవ ముగించి భగవదాజ్ఞగొని తమ తమ నివాసముల కరిగిరి. ఉదయముననే కూరేశులవారికీవర్తమానమంతయుఁ దెలిసెను. వారదివిని, ఈ తదీయారాధన నెవరి ముఖోల్లాసమునకై జరుపుచుంటినో వారి యేకాంత సేవకే విఘ్నముగ నేర్పడినదిగదాయని మిగుల వ్యాకులత నొంది నాటినుండి ఈ తదీయారాధన నిర్వహణమునకు తగువారిని నియమించి నిజగృహక్షేత్ర విత్తాదులను శ్రీ వరదరాజస్వామివారి సన్నిధి కర్పించి పరమవిరక్తులై భగవత్సన్నిధి కరిగి యపరాధక్షమాపణ ప్రార్థించిరి. శ్రియఃపతియు అర్చకముఖముగ వత్సా! నీవింత వరకు జరుపుచుండు భాగవతారాధన ఫలమే నీకు తోడ్తో సదాచార్యాశ్రయము లభింపజేయును. నీవు చిరకాలమునుండి యపేక్షించుచుండిన యతిరాజసేవ శీఘ్రముగ లభించుగాకయని మం

గళాశాసనముచేసి పంపిరి. ఇక కూరత్తాళ్వాను ఆనందమునకు మేరయేలేదు. శ్రీ శ్రియఃపతుల యాజ్ఞవడసి వేకువజాముననే శ్రీరంగమునకుఁ బయనమైరి. "యత్రిమేసీయతే భర్తాస్వయం వాయత్ర గచ్ఛతి, మయాచతత్ర గంతవ్యమేష ధర్మస్సనాతనః" అను శ్రీ భారతములోని శ్రీకృష్ణద్వైపాయన శ్రీసూక్తి ననుస రించి శ్రీ కూరేశ ధర్మపత్నియగు ఆండాళమ్మ భాస్కరు ననుస రించు ఛాయవలె భర్తవెంట శ్రీరంగక్షేత్రమునకుఁ బయన మయ్యెను. పాఠక మహాశయులారా! కాంచీపురికిని శ్రీరంగ మునకు నిప్పటివలె ప్రయాణసౌకర్యములా కాలమునలేవు. కాలి నడకనేగదా ప్రయాణము సాగింపవలయును. భీకరారణ్యము లలో గమనశ్రమకును క్షుత్పిపాసలకును నోర్చిగదా యరుగవలసి యుండును. ద్రవ్యార్జనకై యెన్ని కడకండ్లనైనఁ బొందువారు వేనకువేలు కలిముదరుకొలది కాన్పించుచున్నారు. జేనెఁడు పొట్టను నింపుకొనుటకై కన్నవారి కాళ్ళబట్టి ప్రాణము లరచేతఁ బట్టుకొని యెట్టి సాహసకృత్యములనైనఁ జేయఁబూని తుదక శుద్ధమైన నరకమునఁ గూలఁదురుగాని శాశ్వతమగు ఆత్మరక్ష ణోపాయము వెదకి యందుకై సాహసకృత్యములకు వెనుదీయ నివారు కోటికొక్కరైన కానరావి ఈ కలికాలవేళ ఈ దంపతుల యపూర్వస్వార్థపరిత్యాగము నెంత కొనియాడినను తీరదుగదా. వారొక యరణ్యమార్గముగుండ పయనమై హరినామ స్మరణ మొనర్చుకొనుచు పోవుచుండ ఆండాళమ్మగా రెందుకో భీతి నొందినట్లు ఆళ్వాన్ గ్రహించి భయకారణమడిగిరి. సర్వాంత

ర్వామి యగు పరమపురుషుఁడు తన్ను నమ్మిన వారికే యుప
ద్రవము రానీయఁడను నమ్మకము మీ యనుగ్రహమున దృఢ
పడి యున్నదిగాని తాముపాలారగించుటకైన నొక పాత్ర యుండ
వలదా యనుకొని యీ స్వర్ణపాత్రను మాత్రము దాచియుంచి
దానిని వెంటగొని వచ్చితిని. అటవిక తస్కరుల కాటపట్టగు
నీ కారడవిలో నందును చీకటి పడవచ్చుచుండ నెవడీ పాత్రను
హరించునో యని శంకించి భీతనైతిననిరి. అపుడు ఆళ్వాన్
ఓసీ పిచ్చిదానా పాలారగించుటకు పాత్రగావలయునా? సహ
జంబునగు కరాంబుజము లేకున్నదే భోజన భాజనపుంజమేల
అను శ్రీశుక శ్రీసూక్తులు కేవలము చిలుకపలుకులా? ఆపాత్ర
నిటుదెమ్ము. నీభయమీక్షణముననే తొలగిపోవునని యా స్వర్ణ
పాత్రను గైకొని యావల దూరముగ పరిహరించి యికనిర్భ
యముగ నడవుమనిరి. ఆండాళమ్మగారు భర్త త్యాగశక్తికలరి
భయము తొలగి వడివడిగా నడవసాగెను. చీకటి పడునప్పటికి
నారాత్రి తలదాఁచుకొనుట కొక గ్రామము చేరుకొనిరి. ఇట్లా
దంపతులు కొన్నిదినములు పయనించి తుదకు శ్రీరంగక్షేత్రమున
కరిగి కస్తూరిరంగని కన్నుల కఱవుదీరఁగని ప్రదక్షిణప్రణా
మము లర్పించి కోవిలలో తీర్థ శఠగోప ప్రసాదాది సత్కార
ములు రంగని యనుగ్రహమునఁ బొందిఁ భగవదాజ్ఞగొని భగవ
ద్రామానుజ మఠంబున కరిగి యా కొన్నవారు సిద్ధాన్నము
లభించి నటులు, పెన్నిధిగన్న పేదచందమునను భగవద్రామా
నుజులవారిని సేవించి ధన్యులైరి. యతిరాజులవారు శ్రీ కూరే

ళులఁ గురించిన పూర్వాశ్రమ దేహబాంధవ్యమును వీరికి తమ యెడగల భక్త్యతిశయమును వినియుండినవారు గాన ఆ దంపతులను గనినతోడనే చిరకాలము దేశాంతరగతుఁడైన పుత్రుని రాకకలరు కన్నతండ్రివలె నఖండానంద పరవశులై వారిని తమ కటాక్షామృతముచేఁ దనిపి వారికే కొరంతయు కలుగనీయక కల్ప వృక్షమువలె కాపాడుచుండిరి. ఆ దంపతులును భగవద్రామానుజ కల్ప ద్రుమచ్ఛాయ నాశ్రయించి సకల సంతాపములు దొలంగి యుజ్జీవించిరి.

ఇరువదియెదవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఇరువదియారవ గుచ్ఛము

శ్రీ కూరత్తాళ్వాన్ కూరాగ్రహారము నుండి సతీసమేతముగ శ్రీరంగమునకు విచ్చేసి భగవద్రామానుజ పదాశ్రితులై ధన్యత నొందిరి. వీరివలె శ్రీ రామానుజులకు పూర్వాశ్రమమున భాగినేయులగు దాశరథి యను పండితోత్తములును యతీంద్రుల తిరుమేనిపై సీగవ్రాలినను సహింపఁజాలని కురుకేశులను భక్త శిఖామణియు యతీంద్ర పదాశ్రితులైరి. ఇట్లు శీఘ్రకాలమున నెందరో వారి నాశ్రయించి కృతార్థులగు చుండిరి. భగద్రామానుజుల వారికి తిరుమంత్ర ద్వయచరమములను మంత్రత్రయము నకు విశేషార్థములు ఆ మూలాగ్రముగ తెలిసికొనవలయుననియు అట్టి రహస్యరత్నములను తమ హృదయ పేటికలో నుంచుకొని యానందించుచుండు భాగ్యమేభాగవతమహానిధి నాశ్రయించిన లభించుననియు ఆతురపడుచుండ నిదివరలో శ్రీ పెరియనంబి గారు తమకు మంత్రోపదేశము నొనర్చు సందర్భమున నొక

నాడు యా దృచ్ఛికముగ ప్రశంసింపబడిన గోష్ఠి పూర్ణుల విషయ ము స్ఫురించెను. మరుక్షణముననే శ్రీ పెరియనంబిగారి యనుజ్ఞచే భాగవత పురుషకార పురస్సరముగ వారు వేంచేసియుండు తిరు కొట్టియూరు అను దివ్యదేశమున కరిగి గోష్ఠీ పూర్ణులను సేవించి మంత్రత్రియ రహస్యార్థములు తెల్పఁ బ్రార్థించిరి. శ్రీ గోష్ఠి పూర్ణులు సనాతన పరమ వైదిక ధర్మానుష్ఠాతలగుటచే "సంవత్స రం తదర్థం వామాసత్రియ మథాపివా, పరీక్ష్య వివిధోపాయైః కృపయా నిస్పృహోవదేత్" అనగా సంవత్సరముగాని, ఆరు మాసములుగాని, తుదకు మూడుమాసములైనగాని శిష్యుని ఆర్హత నానా విధములుగ పరీక్షించియే కేవల భగవన్మంగళా శాసన పరునిగా చేయవలయునను శ్రీసూక్తి ననుసరించి యతీంద్రులను యథాశాస్త్రవిధిగ పరీక్షింపవలయునను తలంపుతో నొక్కొక్క పర్యాయము కొంత కొంత ఆధ్యాత్మిక తత్త్వమును బోధించుచు పదునేడు పర్యాయములు త్రిప్పి పదునెనిమదవ పర్యాయము మంత్రరహస్యార్థములను మీరొక్కరే వినవలసియుండునని చెప్పిరి. ఆ చార్యనియమమునకు యతీంద్రులంగీకరింపక తప్పి నదిగాదు. పాఠక మహాశయులారా! పదునేడు పర్యాయములు ఆచార్యులవారు శిష్యహృదయపేటికలోఁ బదిలముగ నుంచిన ఆ తత్త్వరత్నములు ఉదారాశయులగు మహాభాగవతులు, అస్మ దాదుల పర్యంతము సంక్రమింపఁజేసిన విధిగో విప్పుడే తెలియ వచ్చుచున్నవి.

ప్రథమ పర్యాయము "ముముక్షువునకు సంసార బీజము

నశింపవలయును. అది నశించుటెట్లనగా పేడపురుగు పేడలోనే సంచరించుచున్నను పేడ తనకంటనట్లు ముముక్షువును సంసారమున మునిగితేలుచున్నను సంసారముతో సంబంధము లేకుండ ప్రవర్తించిన నది నశించును. శ్రీ భరతాళ్వాన్ శ్రీరామపాదుకారాధనఁజేయుతరి నుత్తరకోసలదేశవాసులీరీతి వర్తించి తుదకు భగవద్విశేషానుగ్రహమునకు పాత్రులైరి. రెండవ పర్యాయము బోధలో సంసార బీజము నశించిననే తప్ప అహంకార మమకారములు నశింపవు. అహంకారమనఁగా గర్వము. మమకారమనగా మాత్సర్యము. గాలి గొట్టుటచే దీపమారిపోవునట్లు అహంకార మమకారములు నివర్తింపవలయును.

మూడవ పర్యాయబోధ. అహంకార మమకారములు నశించిననే తప్ప దేహాత్మాభిమానము పోదను విషయమును గుఱించినది.

నాల్గవ పర్యాయబోధ. దేహాత్మాభిమానము పోయిననే తప్ప ఆత్మజ్ఞానము కలుగనేరదను విషయమును గురించినది.

ఐదవ పర్యాయబోధ. ఆత్మజ్ఞానము కల్గిననే తప్ప ఐశ్వర్య భోగాదుల విషయము విరక్తి కలుగదను విషయమును గుఱించినది.

ఆఱవ పర్యాయబోధ. ఐశ్వర్య భోగాదుల విషయమున వైరాగ్యముకల్గిననే తప్ప భగవంతుని విషయమున నితనికి ప్రీతికలుగదు అను విషయమును గుఱించినది.

ఏడవపర్యాయబోధ భగవంతుని విషయమున ప్రీతికల్గి

ననే తప్ప విషయాంతరములయెడ ఆసక్తి విడిచిపోదు. అను విషయమును గుఱించినది.

ఎనిమిదవ పర్యాయబోధ. విషయాంతరములయెడ ఆసక్తి విడిచిపోయిననే తప్ప భగవత్పారతంత్ర్యజ్ఞాన ముదయింపదను విషయమును గుఱించినది.

తొమ్మిదవ పర్యాయబోధ. భగవత్పార తంత్ర్యజ్ఞానము కల్గిననే తప్ప అర్థకామరాగద్వేషాదులు పోవనుటను గుఱించినది.

పదియవ పర్యాయబోధ. రాగద్వేషరాహిత్యమే శ్రీవైష్ణవత్వ సిద్ధికి మూలమనుటను గుఱించినది.

పదునొకండవ పర్యాయబోధ. శ్రీవైష్ణవత్వము సిద్ధించిననే సాత్వికగోష్ఠిలోని కర్హత యనుటను గుఱించినది.

పదిరెండవ పర్యాయబోధ. సాత్వికగోష్ఠి కర్హతగల్గిననే భాగవతగోష్ఠి కర్హతయనుటను గుఱించినది.

పదుమూడవ పర్యాయబోధ. భాగవత యంగీకారము లేనిదే భగవదంగీకారము కాఁజాలదనుటను గుఱించినది.

పదునాల్గవ పర్యాయబోధ. భగవదంగీకారముకానిదే అనన్య ప్రయోజనుఁడు కాఁజాలఁడనుటను గుఱించినది.

పదునైదవ పర్యాయబోధ. అనన్య ప్రయోజనుఁడు కానిదే అనన్యార్హ శేషభూతుఁడు కాఁజాలడనుటను గురించినది.

పదునారవ పర్యాయబోధ. అనన్యార్హ శేషభూతుఁడు కానిదే అనన్య శరణ్యుఁడు కాఁజాలఁడనుటను గుఱించినది.

పదునేడవ పర్యాయబోధ. అనన్య శరణ్యుఁడు కానిదే

యనన్యభోగ్య రూపమగు భగవదనుభవమున కధికారి కాఁజాలఁ డనుటను గుఱించినది. ఈ విషయములను బోధించుటలో శ్రీ గోష్ఠిపూర్ణులు శ్రీ రామానుజులకు శ్రీ విష్ణుపురాణ శ్రీ భాగవత శ్రీమద్రామాయణ శ్రీ పాంచరాత్రాగమ శ్రీ ద్రావిడా మ్నాయాదుల నుండి యెన్నియో ప్రమాణముల ననుగ్రహించిరి. ఇవి మీరు బాగా మననము చేసికొని మరల నొక పర్యాయ మిందువచ్చిన మీకు తిరుమంత్రార్థ రహస్యముల తెల్పెదుననియు రహస్యముగ నొక్కరే రావలయుననియు పల్కిరి. అపుడు శ్రీ రామానుజులు త్రిదండ పవిత్రములతోనైన రావచ్చునుగదా యన నాచార్యులుస్మితాననులై అవి మీ యాశ్రమమున కవి నా భావములుగదా యనిరి. శ్రీ రామానుజులాచార్యాజ్ఞ వడసి శ్రీ నంబెరుమాళ్ళ సన్నిధికి వేంచేసి స్వమఠము చేరుకొనిరి. శ్రీ కూరత్తాళ్వాన్ మొదలి యాండాన్ తమ ఆచార్యులవారు తిరుమంత్రార్థ బోధకై శ్రీ తిరుకొట్టియూరు నంబిగారి సన్నిధికి పదునేడు పర్యాయములు పోయివచ్చుట గమనించి తాము గోష్ఠిపూర్ణదర్శన కుతూహలులై మరియొక పర్యాయ మచటికి వెళ్ళదలచినపుడు తమ్మును వెంటగొనిపోయి ఆ మహనీయుని దర్శనము లభింపఁ జేయఁ బ్రార్థించిరి. శ్రీ రామానుజు లించుక యోచించి తుద కటులే గానిమ్మనిరి. శ్రీ గోష్ఠిపూర్ణులును తాము నిర్ణయించి యుండిన కాలమునకు శ్రీ రామానుజుల కొఱకై నిరీక్షించుచుండ యతీంద్రులు తమ యిరువురు శిష్యులగు కూరేశదాశరధులతో వేంచేసి శ్రీ గోష్ఠిపూర్ణులకు ప్రదక్షిణ ప్రణామములర్పించి యం

జలి బద్ధులై నిలుచుండిరి. శ్రీ గోష్ఠిపూర్ణులు "యతీంద్రా! కుశలమా! ఓహో కూరేశదాశరథులును వెంటవచ్చినటు లున్నదే. వీరెప్పుడు మీ సన్నిధికివచ్చి చేరుకొనిరి. అహ్వానే! భాగవత తదీయారాధన కూరాగ్రహారమునన విచ్ఛిన్నముగ నిప్పటికిని నడఁచుచున్నదా? మీరీ యతీంద్రు నాశ్రయించిన పిదప తదీయారాధన యవిచ్ఛిన్నముగ నడచుటకై యెట్టి వ్యవస్థగావించితిరి? అని కూరేశుల నడిగిరి. అందుకు కూరేశుఁ దాసుఁని వశమున నుండిన గృహక్షేత్ర రామవిత్తాదులన్నియు శ్రీ వరదరాజ పెరుమాళ్ల కర్పించి తదీయారాధన శ్రీ వరదరాజ కైంకర్య పరులే నిర్వహింప నేర్పాటు గావించి శ్రియఃపతి నియమనమును పొందియే యతీంద్రుల నాశ్రయించితిని. ఒక తదీయాధనమే కాదు సమస్త కార్యములును సద్వారకముననో, నద్వారకముననో దాసుని యోగక్షేమమునకై యా వరదుఁడే నిర్వహించపకపోఁడు గదా? అనిరి. శ్రీ గోష్ఠిపూర్ణులు కూరేశుల యఖండ త్యాగసంపత్తి కలరి శ్రీ దాశరధివంకఁజూచి "మీకుందు పాండిత్యమునకు మీరీ యతీంద్రుల నాశ్రయించుట బంగారునకు పరిమళమబ్బినట్లైనది" యని యతీంద్రులతో యతీంద్రా! మీరు ముమ్ముందు నిర్వహింప కలిగిన ఈ పరమవైదిక సిద్ధాంత ప్రచారమునకు వీరిరువురును చేతోడు వాదోడుగా నుండఁగలరు. అన యతీంద్రులు మీ మంగళాశాసన బలముచేగదా సర్వకార్యములు నెఱవేరవలసి యుండును అనిరి. శ్రీ గోష్ఠిపూర్ణులు దానికేమిగాని మంత్ర త్రియ రహస్యార్థము లుపదేశముపొందు సమయమునగాక మరి

యొకమారు వీరిరువురిని వెంటఁ గొనివచ్చి యుండిన బాగుగ నుండును. నేను మీకు నియమించిన శాస్త్రపద్ధతిని మీరంతగా పాటించినట్లగపడదు. అన దాసునికి దాశరథి త్రిదండమువలెను, కూరేశులు పవిత్రము వలెను అవి నాభావ సంబంధులగుటచే వెంటఁగొనివచ్చితిని. యన శ్రీగోష్ఠీపూర్ణులు చిఱునవ్వుతో ఓహో అందుకొరకేనా ఆనాఁడు దండపవిత్రములతో రావచ్చునుగదా యని సాంకేతికముగ మీరడిగినది? మీ అభిప్రాయ మిప్పుడవగతమైనది. మీకు శిష్యులయెడఁగల వాత్సల్యమునకు సంతసింపవలసినదేగావి, శాస్త్రనియమము నుల్లంఘింపరాదుగదా? అభిమానత్యాగము పరీక్షింపనిదే ఇది ఉపదేశింపఁగూడదనియేగదా మిమ్ముల నిన్ని పర్యాయములు విధిలేక త్రిప్పవలసివచ్చినది. పోనిండు. ఏదిఎట్లైనను మీకుండు శిష్యవాత్సల్యము నిరుపమానము. మీ యభిమానంతర్భూతులగుటచే వీరును నుపదేశార్హులైరి యని శ్రీ కూరేశదాశరధులను, శ్రీ యుడయవరులను తమ తిరువారాధన మందిరములోనికిఁ గొనిపోయి శ్రియఃపతిని యధావిధి పూజించి రహస్యత్రయములకును ముఖ్యముగ తిరుమంత్రమునకును శిష్టాచారక్రమాగత రహస్యార్థములన్నియును తాము గ్రహించియుండు చొప్పున మువ్వురికి నుపదేశించి "ఇదంతేనా తపస్కాయనా భక్తాయకదాచననబా శుశ్రూషమేవాచ్యం నచమాంయోభ్య సూయతి" యనియు నార్తుఁడై సంవత్సరాను వర్తనశీలుఁడైన వాని కనధికారి చెవిని బడకుండ నిక్షేపంబువలె దీని బదిలంబుగ జేసుక బ్రతుకుడనుచు, నొక్కొకరి

కానతిత్తురు (రహస్యములను మన పూర్వాచార్యులనియు) మంత్రార్థ రక్షణమును గురించి చెప్పఁదగిన అంశములు చెప్పి. శ్రీ యుదయవరులతో ద్వయార్థ వివరణమునకు శ్రీ మద్రామాయణము ప్రబల ప్రమాణము. అందలి విశేషాంశము నిక్కముగ మీవంటివారు తెలిసికొనవలసినదే. మీకు మేనమామ గారును నాకు పరమమిత్రులును. సహశ్రోత్రియును, మహా భాగవత శిఖామణియునునగు శ్రీశైలపూర్ణాచార్యులీ భాగమున నారితేరినవారు. వారివలన మీ రావిషయము శీఘ్రముగ నెఱుంగుట మంచిది యని చెప్పిరి. పిమ్మట శ్రీ యతీంద్రులును, శ్రీ కూరేశదాశరధులును శ్రీ గోష్ఠిపూర్ణుల నుచితరీతి సత్కరించి కించిత్కారము సమర్పించుకొనిరి. శ్రీ గోష్ఠిపూర్ణులు శ్రీ యతీంద్రులను, శ్రీ కూరేశదాశరధులను యధావిధిగ సత్కరించి మంగళాశాసనమొనర్చి ముగ్వురను మఱి కొద్దికాలము తమ సన్నిధి నుంచుకొనిరి.

ఇరువది మూరవ గుచ్ఛము — సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఇరువదియేడవ గుచ్ఛము

---

ఉదయవరులును, వారికి పవిత్ర త్రిదండ సదృశులగు శ్రీ కూరేశదాశరథులును, శ్రీ గోష్ఠీపూర్ణ పరిపూర్ణానుగ్రహమున తిరుమంత్రార్థ రహస్యము వడసి, యాచార్య నియమనముచే శ్రీ తిరుక్కోట్యూరునందు కొన్నిదినములుండిరని వెనుకటి గుచ్ఛమునఁ దెలిసికొని యుంటిమిగదా ? ఒకనాడు శ్రీ యుదయవరులు స్వాచార్య సన్నిధిలో దండము సమర్పించి శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిలో తమకుగల కైంకర్య తీవ్రత వ్యక్తపఱుప వారౌచిత్యము గమనించి "అటులైన శ్రీ కూరేశదాశరథులను పంపి మీరు మఱినాల్గుపూట లుండుడనిరి." అందుకుదయవరులంగీకరింపకఁ దప్పినదిగాదు శ్రీ కూరేశదాశరథులకీవార్త దెల్ప వారు శ్రీ గోష్ఠీపూర్ణ సన్నిధానమున దండము సమర్పించి శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి కరుగ నియమనము వేడిరి. వారందు కంగీకరించి తిరుమంత్రార్థ రహస్యమును బదిలముగ హృదయపేటి

కలో భద్రపరచుకొని యానందించుచుండుడని మంగళాశాసన మొనర్చి పంపిరి. ఇక తిరుక్కోట్యూరున నుదయవరులు స్వాచార్యుల మూలమున శ్రీవైష్ణవసిద్ధాంతరహస్యము లెన్నియో వినుచుండి యొకనాడు మనంబునఁ యీ తిరుమంత్రములోని విశేషార్థము లభించుటకై శ్రీ మహాపూర్ణనియమనమును పొంది వీరి సన్నిధి కెన్నిమారులో నేను తిరుగవలసివచ్చెను. శ్రీరంగ నాధుని నియమనము పొందిగూడ శాస్త్రమర్యాదచెఱుపగూడదని నాకు నీ తిరుమంత్రార్థ రహస్యము ననుగ్రహించుట కెంతయో కాలవిలంబ మొనర్చిరి. నావంటి వానికే యిదిలభింప నింత దుస్సాధ్యమై యుండ నీ కలికాలమున శ్రద్ధాభక్తులు మితముగ గలవారి గతియేమి? యమనియమాద్యష్టాంగ యోగవిద్య లభించు శక్తియా, జనులకు లేదాయె. న్యాసవిద్యవలననైన తరింపజూతమన్న నిదియు సులభసాధ్యము గాకుండ నిన్ని నియమము లేర్పరచి నపుడు సంసార రజ్జువులఁ దగుల్కొనిన జీవులుజ్జీవించు మార్గమే గానరాదు. నరులు నరకయాత నాపరంపరల జన్మజన్మమున ననుభవింపవలసి యుండుటను మనంబున దలంచినపుడెల్లను గుండెనీరగుచున్నది. కరుణానిధియగు శ్రియఃపతి కారుణ్యరస ప్రవాహముపొరలి పారిణి సన్యమును ఫలవంతమొనర్ప నింతకన్నను సమయమిక చిక్కుట దుర్లభము. కారణాంతరములచే నుత్తమలోక ప్రాప్తికలుగుట కనేక నిబంధనలు, పురుషార్థ ప్రాశస్త్యమునుబట్టి శ్రియఃపతిచే నేర్పరుపబడి యుండవచ్చునుగాని, కాలమునుబట్టి నిబంధన లిం

చుక పడలిన నెండతో యుజ్జీవింతురుగదా" యని తలంచి, యుదయమున నిత్యకర్మానుష్ఠానములు దీర్చుకొని, స్వాచార్య తిరుమాళిఘనుండి నెచ్చటికో శీఘ్రముగ నరుగుచుండిరి. వారరి గిన దొక భగవత్సన్నిధియని దాని నాయూరివారు శ్రీ తేర్కాళ్వార్ సన్నిధియందురని తుదకుఁ దెలియవచ్చుచున్నది. కొందరు భాగవ తుల భగవంతుని సేవించుకొని, కోవెలమహద్వారము సమీపించు చుండుటగని శ్రీ యుదయవరులును వారిని తాము పెరుమాళ్లను సేవించుకొని వచ్చువఱకు కోవెలకడనే యుండ నియమించి బలిపీఠ, ధ్వజస్తంభములకడ మ్రొక్కి విమానమునకు ప్రదక్షిణ మొనర్చి, కోవిలగర్భాలయమువఱ కరిగి, శ్రియఃపతిని పూజించి నుతించి యర్చకులొసంగు తిరువరివట్ట తీర్థ, శఠగోప ప్రసాద ములు లభించి భగవన్నియమనమును బొంది శీఘ్రముగ, కోవి లలో నొక పార్శ్వమున వెలయుచుండు నున్నత గోపురమండప సోపానములెక్కి లోని కరుగుచుండిరి. వీరి కొఱకై కాచియున్న భాగవతులందఱు వారి వైఖరిగని యాశ్చర్యమున, తామును నా మండపములో లోనికే యరిగి శ్రీ యుదయవరుచుట్టు చేరిరి. అప్పుడు శ్రీ యుదయవరులు మందహాసము ఖారవిందులై వారి నందఱను కలయజూచి యంజలి ఘటించి, నిమాలిత నయనులై శ్రియఃపతిని, గురుపంక్తిని వించుకసేపు ధ్యానించి, కన్నులు తెరచి భాగవతోత్తములతో భాగవతోత్తములారా! శ్రియఃపతి విశేషకాటాక్ష ప్రసరణమును గురించి "ఏవంసంసృతి చక్రస్థే భ్రామ్యమాణేస్వకర్మభిః జీవేదుఃఖాకులే విష్ణోః కృపాకాప్యుప

జాయతే" యను శ్రీసూక్తి మనమందఱ మనుదినము వినుచున్నదేగదా ? పంచసంస్కార భాగ్యము సదాచార్యమూలమున లభించిన భాగ్యశాలుర కందఱకు తిరుమంత్ర మర్థసహితము లభించి యను సంధించుచుండవలసినదివిధి. అటులనే శ్రీద్వయ మంత్ర, చరమ శ్లోకముల కర్థమున్ను తెలిసి యనుసంధించి యుజ్జీవించ వలసియుండును. శ్రియఃపతి కటాక్షమును, గురుపంక్తి కటాక్షమును నెటులనో మావంటి వారిపైగూడ ప్రసరించుటచే నా మంత్రిత్రయార్థమున తిరుమంత్రార్థ మిప్పటికి లభించి ఇది మీకందఱకు లభింపజేయ శ్రియఃపతి నన్ను తీవ్రపఱచుచున్నటులున్నది. "జానామిధర్మం నచమేప్రవృత్తిః జానామ్యధర్మం నచమే నివృత్తిః శ్రీవాసుదేవేనహృదిస్థితేన యథానియుక్తోస్మి తథాకరోమి" యను ప్రపన్న ధర్మమును పాటించి, తిరుమంత్రార్థ రహస్యము తెలిసి యుజ్జీవింప నిచ్ఛగల పంచసంస్కార సిద్ధిగల భాగవతులందఱకు వినిపింప భగవత్ప్రేరణచే సంసిద్ధుడనైతిని. మీరును విని కృతార్థులు గండు. అని పలుకగనే అనాదు కాల కర్మ సంయోగముచే నచ్చటఁజేరి యుండిన భాగవతు లందఱు భగవత్ప్రేరణచే "యతిచంద్ర మీముఖముగ తిరుమంత్రార్థము వినగల్గు భాగ్యమే భాగ్యము. ఇంతకన్న మాకు గావలసినదేది. యని వారికి ప్రణామాభివాదనము లర్పించి యంజలి బద్ధులై వారి యమృతోపమాన శ్రీసూక్తులు సావధాన చిత్తులై విననుద్యుక్తులైరి. ఒక ఘడియకాలమయ్యెనో లేదో నావిశాలభవ్య మండపముచుట్టు బహుదూరము భాగవతులందఱు తండోప

తండముగవచ్చి క్రిక్కిరసిరి. అపుడు శ్రీ యుడయవరులు మంత్రిప్రాశస్త్యము, తన్మూలమున లభింపనున్న పరమ పురుషార్థప్రాశస్త్యము, ఉపాయ. పురుషకార ప్రాశస్త్యము, కైంకర్య వైలక్షణ్యము, ఇత్యాదులన్నియు, వారికెల్లరకు కరతలామలక మగు నటుల నొనర్చి, భాగవతులనందరిని వారివారి నివాసముల కని పితామును తమ యాచార్య తిరుమాళిఘ చేరుకొని స్వాచార్యులగు శ్రీ తిరుకొట్టియూరు నంబిగారి సన్నిధిలో దండము సమర్పించి యంజలి బద్ధులై నిలచిరి. ఇంచుమించు ఘడియకాలమైన వెనుక భాగవతులలో కొందఱందుచేరి యుండ వారితో శ్రీ గోష్ఠిపూర్ణులు" భాగవతోత్తములారా! లోకమున విత్తనములు భూమిలో జల్లియవిఫలించుకాలమున దానికి దుష్టమనుజ పశ్వాద్యుపద్రవములు వాటిల్లకుండ చుట్టు భద్రమగు కంచెవేయుట కలదుగదా. అట్టి కంచెకేకాళ్లువచ్చి పైరుమేయదలచు కాలమొచ్చునని యెవరైన ననుకొనుట కవకాశముండదుగదా. అట్టి కాలమే తటస్థమైన నిక కర్షకుని వ్యాకులత యెవ్విధముగ నుండునో యోచింపుడు. జేనెడు పొట్టనించు ధాన్యవిషయముననే కర్షకుడెంతయో సంతాపపడుచుండ, ప్రాణిసస్యము ఫలవంతమగు వఱకు కాపాడి సంతసమున తనసాన్నిధ్యమునఁ జేర్చుకొని యనుభవింపనున్న శ్రియఃపతి రూపకర్షకుని యత్నము విఫలమైనపుడతడు హర్షింపక పోవుటేగాక, ప్రేమపాత్రమగు ప్రాణిసస్యమును భగవన్నియమములు త్రోసిపుచ్చి, చెఱుపబూనిన వారిని తీవ్రముగ శిక్షింపబూనునుగదా యనుచు వికల భావమున శ్రీమద్రామానుజ

యతీంద్రులవంక జూచిరి. భాగవతులందఱుఁ నాచార్యోత్తముని చిత్తమునగల తత్తరమును, వైకల్యమును గమనించి వారును శ్రీయతీంద్రులవంకనే చూచిరి అపుడు శ్రీయతీంద్రులు స్వాచార్యోత్తములగు శ్రీ గోష్ఠీపూర్ణులతో వినయవినమితోత్తమాంగులై "ఆచార్యోత్తమా దేవరవారి యాజ్ఞనతిక్రమించుట భగవదాజ్ఞనతిక్రమించుటకన్న నతి తీవ్రమగు నపరాధమని దాసునికి తెలియకపోలేదు. పరసమృద్ధికై పలువిధముల కృషిసలుపుచు నైజస్వభావముగల శ్రియఃపతి యాపకర్షకుడు కాలదేశపరిస్థితులను గమనించి తన సత్యసంకల్పమును సత్వరముగ నెఱవేర్ప నీదాసుని మనోభావనను తీవ్రపఱచుటచే నిట్టి యపరాధము తటస్థమైనది. శాస్త్రమర్యాదనుబట్టిచూడ నిట్టి యపచారమొనర్చిన వారికి ఘోరనరక ప్రాప్తితప్పదు. గాని నిరంతర నానావిధాపచారములకు గుఱియై సంతత నరకభాధననుభవించుచు, తరుణోపాయము తెలియక తపించుచుండుజీవుల సంతత సంసారచక్ర పరిభ్రమణతాపముజూచి సహింపజాలక దాసుడిటులపచారమునకు గుఱిగావలసి వొచ్చినది. ఈ దాసుడొకడు భగవద్భాగవతాచార్య తీవ్రనిగ్రహపాశములఁ గట్టుబడి ఘోరయమ యాతనల ననుభవించిన మాని. ఆనందమున తిరుమంత్రార్థ ప్రభావమను సంధించుచు సంతతానంద లోకమునుఁ శీఘ్రముగఁ జూఱఁగొను వారు పలువురుందురుగదా? యనిబల్కి దండము సమర్పించి యంజలి బద్ధులై నిలచిరి. అపుడచటనుండిన భాగవగోష్ఠిలోనే గాక శ్రీ గోష్ఠీపూర్ణాచార్యుల వారిలో సహితమొక యపూర్వ

పరివర్తన కలిగినది. దాని నాచార్యులవారు మనంబున నిమం
డించు కొనజాలక, నుభయవరుల చెంతకు లేచివచ్చి, బాష్ప
సన్నిరుద్ధగద్గదకంఠులై" యెంబెరుమానారే, యెంబెరుమానారే,
యెంబెరుమానారే యని గాఢముగ కౌగలించుకొని శ్రీ పరవాసు
దేవ నిత్యసేవాధురంధరుండగు ఫణీంద్రునెడ నిట్టి యపూర్వోదా
ర్యము గలదని పెద్దలు సాయించగా వినియుంటివిగాని నేడు
మీయెడ నది ప్రత్యక్ష సిద్ధముగ గానవచ్చుటచే నన్నాశ్చర్యా
నంద ప్రవాహమున నోలలాడ జేయుచున్నది. ఇక| నీమధ్యమ
లోకమే మాధవలోకమువలె సంతతానంద సంధాయకమున నుండు
కాలమువచ్చినది. ఇక నెందఱో జీవులు ధన్యులుగావలసియే,
శ్రీరంగనాథుడు మీరూపమున తన సత్యసంకల్పము శీఘ్రముగ
నెఱవేర్చుకొనుచున్నాడు. ఈ సిద్ధాంత మిక నెంబెరుమానారు
సిద్ధాంతమని వెలయుగాక, మీ మూలమున సకల కలిదోషము
లడంగుగాక! యని మంగళాశాసన మొనర్చిరి. భాగవతోత్తము
లందఱు శ్రీ యుదయవరుల విమలాశయమున కచ్చెరువంది,
శ్రీ గోష్ఠీపూర్ణ, శ్రీ యతీంద్రుల నిరువురను పలువిధముల కొని
యాడి వారి యనుజ్ఞవడసి తమ తమ నివాసముల కరిగి యానాటి
విచిత్ర సన్నివేశ మొకరికొకరు చెప్పుకొని యానందించుచుండిరి.
ఇవ్విధముగ శ్రీ యెంబెరుమానారు ఖ్యాతిలత సర్వతోముఖమున
వృద్ధినొంది, పుష్పించి దివ్యజ్ఞాన సౌరభము వెదజల్ల నారం
భించెను. ఇరువదియేడవ గుచ్ఛము—సంపూర్ణము.

---

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ఇరువదియెనిమిదవ గుచ్ఛము

శ్రీమద్రామానుజ యతీంద్రులకు, శ్రీ గోష్ఠిపూర్ణులు తిరుమంత్రార్థము కృపఁజేయుచేగాక "ఎంబెరుమానార్" అను బిరుదనామము సయితము కృపజేసి కొన్నిదినములు సన్నిధి యందుంచుకొని మంగళాశాసనమొనర్చి మీరు మఱొక పర్యాయము శిష్యసహితముగ నొక్కరే వచ్చిన యెడల అపూర్వమగు చరమ శ్లోకార్థరహస్యము సయిత ముపదేశించి పంపెదననిరి. శ్రీ యతీంద్రులు, భాగ్యము, భాగ్యమని శ్రీ గోష్ఠిపూర్ణాచార్యుల వారికి ప్రక్రమ ప్రణామము లర్పించి నియమనమును బొంది శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి వేంచేసిరి. కొంతకాలము శ్రీ కూరేశులు, శ్రీ దాశరధి, శ్రీ నెడాదూరు అమ్మాళ్, శ్రీ కిడాంబియాళ్వాన్ మున్నగు శిష్యబృందమునకు సిద్ధాంత రహస్య ములుపదేశించుచు గడపి, శ్రీ యతీంద్రులు భగవత్ప్రేరితులై మరల నొక పర్యాయము శ్రీ గోష్ఠిపూర్ణుల వారిని దర్శించి చరమ

రహస్యార్థము లభింప శ్రీ తిరుకొట్యూరునకు వేంచేసి స్వాచార్యులకు దండవత్ప్రణామము లాచరించి యంజలి బద్ధులై నిలుచుండిరి. శ్రీ నంబిగారును (శ్రీ గోష్ఠీపూర్ణులు) సాదర సాంద్ర కటాక్షణములచే శ్రీ యతీంద్రుల నీక్షించి శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిగల భగవద్భాగవతుల వైభవముల నఱసి సంతసించి వారినుచితరీతి సత్కరించిరి. మఱుదినముదయమున శిష్యాచార్యులిరువురు నిత్యకర్మానుష్ఠానములు నిర్వర్తించిన పిదప శ్రీ గోష్ఠీపూర్ణులవారు శ్రీ యతీంద్రులను తమ తిరువారాధన మందిరలోనికి గొనిపోయి శ్రీ వాసుదేవాద్యర్చామూర్తులను సేవింపజేసి తిరువారాధన సమర్పించి, గురుపరంపర యను సంధించి శ్రియఃపతి భగవద్గీతలలో సాయించిన చరమ శ్లోకములోని యంశములు కొన్ని వ్యాఖ్యాన సహితముగను విశేషార్థయుతముగను ననుగ్రహించుచు తుదకు "సర్వగుహ్యతమం భూయశ్శృణుమే పరమంవచః। ఇష్టోసిమే దృఢఇతితతో వక్ష్యామితే హితమ్"అని శ్రీ యర్జునునకు సాయించి చరమ శ్లోకమనుగ్రహించి మఱుక్షణమే "ఇదంతే నాతపస్కాయ నాభక్తాయకదాచననచా శుశ్రూషమే వాచ్యం నచమాంయోభ్యసూయతి" యని అనధికారులకీ పరమరహస్యముఁ జెప్పగూడదను నిబంధన నైతమొనర్చి నటుల, వీరును, శ్రీ యతీందుృలకు చరమ శ్లోకరహస్యార్థములన్నియు సత్సంప్రదాయ పద్ధతి ననుసరించి యనుగ్రహించి, అధికారి, అనధికారి వ్యవస్థను పాటించి వ్యాపింపచేయదగునవి పలికిరి. అపుడు యతీందుృలు శాస్త్రవిధిప్రకారము, శ్రీ గోష్ఠీపూర్ణులను

సత్కరించి "ఈ యపూర్వ రహస్యార్థములు యోగ్యులగు వారి కుపదేశించినపుడు లభింపగల ఫలమును" యయిదం పరమంగు హ్యం. యిత్యాది శ్రీ సూక్తిచే నందే యనుగ్రహింపబడినది గదా ? దాసునకు పవిత్ర సదృశుడును, పరమసాత్వికుడును, సకలైశ్వర్యము త్యజించి యాశ్రయించిన మహాత్యాగియునగు శ్రీ కూరేశునకైన నుపదేశింప వచ్చునుగదా ? యనిరి. అపుడు శ్రీ గోష్ఠిపూర్ణు లించుక యోచించి మీరు పలికినది సత్యమేగాని "సంవత్సరంతదర్థం వామాసత్రయ మథాపివా। పరిక్ష్య వివిధో పాయైః కృపయా నిస్పృహోవదేత్" అను ప్రమాణానుసారము వర్తింపదగును. వీరి విషయమున నౌచిత్యము గమనించి యుప దేశింపుడని పలికి మఱుదినమొక శుభముహూర్తమున తమ పుత్రిదగు శ్రీ సౌమ్యనారాయణాచార్యులను వారిని శ్రీ యతీంద్రుల పదాంబుజము లాశ్రయింపజేసిరి. శ్రీ యతీంద్రులును స్వాచార్యుల ఔదార్యాది గుణముల వేమారు గొనియాడి వారి నియమనము బొంది శ్రీ నంబెరుమాళ్ల సన్నిధి కరిగిరి. శ్రీ సౌమ్యనారాయణాచార్యులును గోవువెంట గోవుత్సవము పగిది శ్రీ యతీంద్రుల వెంటనే తలిదండ్రుల యనుజ్ఞవడసి పయన మైరి. ఇటుల శిష్యాచార్యులిరువురు శ్రీరంగముజేరి శ్రీరంగ నాథుని సేవించుకొనిన పిదప శ్రీ యుడయవరులు నూతన శిష్య రత్నముతోగూడ స్వమఠముఁజేరి శ్రీ గోష్ఠిపూర్ణులవారి యనుగ్ర హమును తమ శిష్యబృందమునకు వెల్లడిపరచి వారికి వేదాంత రహస్యములుగ్గడించుచుండిరి. ఇటుల కొద్దికాలము గడవ నొక

నాడు శ్రీ కూరేశులు శ్రీ యతీంద్రుల సన్నిధియందు దండము సమర్పించి, దాసునికి, దేవరవారు శ్రీ గోష్ఠీపూర్ణుల వారి సన్నిధిలో లభించిన చరమ శ్లోకార్థము కృపజేసి ధన్యుని గావింపుమని దైన్యమున మిక్కిలి యార్తితోఁ బలికిరి. అపుడా యతీంద్రులు శ్రీ కూరేశులతో ఆర్తుడై సంవత్సరాను వర్తనుడైన వానికి ననధికారి చెవిని బడకుండ నిక్షేపంబువలె దీని బదిలంబుఁ జేసుక బ్రదుకుడనుచు యెవ్వరో నొకరికిగదా మన పూర్వాచార్యులీ రహస్యము నానతిచ్చు చుండిరి. శ్రీ గోష్ఠీపూర్ణులును, మాకును, నీ నియమమును ముఖ్యముగ పాటింపదగునని నొక్కి జెప్పి యుండిరి. అయినను సంవత్సర శశ్రూషాసమము, స్వాచార్య సన్నిధియందే మాసోపవాసముచే నడుపుటయని పెద్దలు జెప్పగా వినియున్నాను గనుక నీవాప్రకార మొనర్ప దగునని బలుక శ్రీ కూరేశులందు కొడంబడి, మాసోపవాస వ్రతానంతరం శ్రీ యతీంద్రుల పరమకృపచే శ్రీ చరమ శ్లోకార్థ రహస్యము లభించిరి. శ్రీ ముదలియాండాన్‌గారును శ్రీ యతీంద్రుల సన్నిధిలో శ్రీ కూరేశులకువలె శ్రీ చరమ శ్లోకార్థము కృపజేయమని ప్రార్థింప, నీవు శ్రీ గోష్ఠీపూర్ణుల సన్నిధిలోనే యుపదేశము నొంది రమ్మని బలికిరి. అపుడు వారటులనే శ్రీ తిరుక్కొట్టి యూరున కరిగి శ్రీ గోష్ఠీపూర్ణులను దర్శించి, శ్రీ చరమ శ్లోకార్థము కృపజేయ బ్రార్థింప, వారు చిరునవ్వుతో "దాశరథీ ఈ శ్లోకార్థమునకు నియమ మెక్కువగ శ్రీ గీతాచార్యు లేర్పఱచి యుండుట నీవును విని యేయుందువు. "విద్యామదో, దనమదస్తృ

తీ యో ఽభిజనా న్మదః। ఏతేమదావలిప్తానా మేత ఏవసతాందమాః॥"
అను శ్రీసూక్తులనుబట్టి యివి మీకడ రుచివాసనలతోగూడ తొలి
గివనని తోచిన మీ యాచార్యుడే మీకుపదేశించును పొండు" అని
పల్కి పంపిరి. శ్రీ దాశరథసూరియు, శ్రీ గోష్ఠిపూర్ణులకు దం
డము సమర్పించి యాజ్ఞగొని శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి విచ్చేసి,
శ్రీ యుడయవరుల సన్నిధిలో వారు దెల్పిన విషయము విజ్ఞాపనం
బొనర్చిరి. అందుకు శ్రీ యతీంద్రులు తప్పక నీ కోర్కె నెఱవేరును.
సమయముజూచి యథోచితముగ పరీక్షించిగదా యుపదేశింపవలసి
యుండును. ఆతురపడక కొన్నిదినములాగుమనిరి. శ్రీ దాశరథ
సూరియు నాచార్యాజ్ఞ ననుసరించి సమయమునకై నిరీక్షించు
చుండిరి. ఇటుల కొన్నిదినములు గడువ, శ్రీ యతీందులకు
పంచసంస్కార మనుగ్రహించిన శ్రీ పెరియనంబి (మహాపూ
ర్ణులు లేక శ్రీ పరాంకుశదాసులు) గారి కూతురు అత్తింటకాపు
రముఁ జేయుతరి, గృహకృత్య నిర్వహణములలో నామె, వత్తిం
టివారు మాటి మాటికీ నవవసరముగ బాధఁబెట్టదొడగిరి. ఇట్లుండి
యు నామె యత్యంత సహనముఁన కాలము ద్రోసిపుచ్చుచుండినది
గాని యొకానొక దినమున కావేరీ స్నానమొనర్పవలసి వంటరిగ
నదికి పోజాలక అత్తగారిని తన వెంటరాఁ బ్రార్థించెను. అత్తగారి
చిత్తవృత్తి యతికఠినముగ నుండుటనుబట్టి కోడలివెంట బోనొల్ల
కుండుటే గాక విసుగుతో నీ పుట్టినింటి నుండి బోనగత్తెను
తెచ్చుకొని కోరిన పనులఁజేయించుకొమ్మని పలికెను. కోడలిక
చేయునదిలేక దైవికముగ పుట్టినిల్లును శ్రీరంగనగరమే యగు

టనుబట్టి ఆనాడాకార్య మిరుగుపొరుగు సహాయమున నెటులనో నెఱవేర్చుకొని మఱుక్షణమే తండ్రిగారివద్ద కరిగి, పరిస్థితులు విన్నవించుకొని దుఃఖించెను. దాసులవారపుడు "మన రామానుజులకడ నీవిషయముఁ దెల్పుము. ఆయన నీబాధలు తొలగించు" నని పలికిరి. అంత నా సాధ్వీమణి శ్రీ యతీంద్రులకడ కరిగి తన పరిస్థితులను, తండ్రిగారి నియమనమును దైన్యమున దెల్పుకొనెను. అపుడు శ్రీ యతీంద్రులు" అమ్మా దుఃఖింపకుము. నీ కత్తింటి పనులలోఁ దోడ్పడుటకు తగు నేర్పాటు గావించెదను అని పలికి తన సన్నిధిని యంజలి బద్ధుడై నిలచున్న శ్రీ ముధలియాండానునుగని "ఈమెకు గల్గిన యిబ్బంది గ్రహించితివిగదా? ఇక నీవీమె వెంటనే యరిగి, యీమె కత్తింటఁ నేలాటి యొత్తిడి లేకుండఁ దోడ్పడుచుండుమని నియమించిరి. శ్రీ దాశరధియు "ధన్యోస్మి" యని తమ పరమాచార్య పుత్రికామణి వెంటజని యామె యత్తింటఁ జేయవలసిన పనులలో నీచోచ్చ విమర్శలేక పనులన్నియు యామెకు మాఱుగ తామే తృప్తికరముగ నెఱవేర్చుచుండిరి. అత్తింటివారును, నా మహాత్ముని ప్రభావముఁ దెలియని కతన, భృత్యసామాన్యునిగఁ దలంచి నీచపరిచారకులు చేయుకార్యములు సైతము చేయించుకొనుచుండిరి. ఇటుల కొన్ని మాసములు గడచిన పిదప నొక నాటియుదయమున వీరింటివద్ద నిరువురు శ్రీవైష్ణవులొక పంచతిన్నె పైఁ గూర్చుండి యాధ్యాత్మిక విషయమున వాదించుకొనుచుండిరి. రానురాను నిరువురికి కొన్ని యంశములలో నభిప్రాయ భేదములు వొడమి వాదోప

వాదములు పెచ్చుపెరిగి, కృతిమించిపోజొచ్చెను. ఇది వినియు
సహించుచు మిక్కిలి యపచారమనితోచి కాబోలు, గృహోప
కరణములు శుద్ధిపరచుచుండు మన శ్రీ దాశరధసూరి, శీఘ్రముగ
తాము చేయుచుండు పని ముగింపుచేసుకొనివచ్చి వారిచెంతనిలిచి
"అయ్యా మీ యిరువురి వాదములు యెంతమాత్రమును శాస్త్ర
సమ్మతములు గానేరవు. ధర్మసూక్ష్మములలో నిరువురును పొర
బడుచున్నారు" అని యింకను నేమియో చెప్పఁబోవుచుండ
వారిరువురు కోపముతో నాయనవంకఁ జూచి పండిత వాదములో
నేమియో దెలిసిన వానిపలె సాహసమున నోరుమెదల్ప వచ్చుట
చూపరులకు హాస్యాస్పదమును, వాదించువారికి కోపాస్పదమును
నగునని యెఱుంగవైతివి కాబోలు. పోయి నీపని చూచుకొమ్ము.
పిలువని పేరంటమునకేల వచ్చితివని పలికి యెప్పటివలె తమ
వాదము సాగింప దొడగిరి. అపుడు శ్రీ దాశరధసూరి మరల
వారివాదముల కడ్డుఁదగిలి నేజేయు వృత్తివిడట్టి నన్నజ్ఞునిగ
దలంచుట సహజమేగాని యంతమాత్రమున మీయిరువురి వాదము
లందును బలాబలములు దెలియని వాడమగాను. మీవాద ప్రతి
వాదములలో నుండు సామరస్యము సామాన్యపండితుల కవగ
తంబుగానిది. యని వారివాదములలోని క్లిష్టాంశము విశదపరచి
సామరస్యము గుదిర్చి దాసుని సాహసము క్షమింపుడని ప్రార్థించిరి.
వారు శ్రీ దాశరధిసూరి పాండిత్య పరిభావమున కచ్చెరువంది
నమ్రభావమున నంజలి ఘటించి నిలిచిరి. ఆండాన్‌గారి యనర్గ
ళవాక్ఝురి యా మార్గమున వచ్చుపోవువారి నందటిని, నాశ్చర్య

ప్రవాహ నిమగ్నులను గావించెను. పండిత పరస్పర క్రోధానల మును తమ సులలిత బోధామృతముచేనార్పి యిరువరకు తాపోప శాంతి గావించిన మహనీయులు శ్రీ యతీంద్రులకు పూర్వాశ్రమ భాగినేయులగు సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ దాశరథసూరియే యని గ్రహించి వివాదపడిన పండిత ద్వయమనుతాపపడుచు శ్రీ ఆండాన్ పాదాంబుజ ద్వయముపైవ్రాలి క్షమాపణవేడి వారిని తమయెడ సుప్రసన్నుల గావించుకొని వెడలిరి. ఈవార్తలోన నుండు శ్రీ అత్తుళాయమ్మగారి భర్తకును నత్తమామలకును దెలిసి శ్రీ దాశరథిని లోనికిఁ బిలుచుకొనిపోయి దండము సమర్పించి "మీరు శ్రీ యతీంద్రులకు పూర్వాశ్రమ దేహబాంధవ్యమునను, తదుపరి యాత్మబాంధవ్యమునను, ననన్యసామాన్య పాండిత్య ప్రభావమునను, నిరంతర పూజనీయులని యెఱుంగక నొనర్చిన యపచారములన్నియు క్షమించి మీ స్వస్థానమున కరుగుడు. మీవంటి మహనీయులనుభరించు యోగ్యత మాకులేదు, మీ పర మాచార్య పుత్రికామణియగు మా కోడలి నిక కేతకీ పుష్పము వలె నాదరించుచుందుమ"ని బలికిరి. అపుడు శ్రీ యాండాన్ మా పరమాచార్య పుత్రికకు గృహకృత్య భారముఁ దగుల నివ్వేకఁ దోడ్పడ మా యాచార్యాజ్ఞయైనది. వారియాజ్ఞ నుల్లం ఘించుటఁ దగదుగదా యనిరి. అపుడు వారు ముప్వురు శ్రీ పెరియనంబి, శ్రీ యతీంద్రుల సన్నిధులలో జటిఁగిన యంశము లన్నియు విజ్ఞాపనజేసి, శ్రీ అత్తుళాయమ్మ నిక నత్యాదరమున జూచుకొందుము శ్రీ దాశరధిసూరిని మీ సన్నిధికి బిలిపించుకొని

మా తప్పులన్నియు క్షమింపుడని ప్రార్థించిరి. శ్రీ నంబిగారును, శ్రీ యతీంద్రులును వారియెడ సుప్రసన్నహృదయులై శ్రీ ముధలియాండాన్‌గారిని తమ సన్నిధికిఁ బిలిపించుకొని వారు సలిపిన కార్యములకు సంతసించిరి. పిమ్మట శ్రీ యతీంద్రులు శ్రీ పెరియ నంబిగారిని శ్రీ చరమ శ్లోకార్థము శ్రీ ఆండాన్‌గారి కుపదేశించు విషయములో మందలించి నియమనము బొంది యొకదినమొక సుముహూర్తమున సకలార్థములు శ్రీ యాండానుకు కరతలామలకమగునటుల కృపజేసి మంగళాశాసన మొనర్చిరి. శ్రీ యాండానును తమ చరమార్థ రహస్యములను తమ హృదయపేటికలో విధివరె నత్యాదరమున బధిలముగ నుంచుకొని కలకాల మాచార్యులను సకల కైంకర్యములఁ దృప్తి పఱచుచుండిరి.

ఇరువదియెనిమిదవ గుచ్ఛము—సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజపరిభావ కల్పకము.

## ఇరువదితొమ్మిదవ గుచ్ఛము

శ్రీ గోష్ఠిపూర్ణులు, శ్రీ రంగనాధుని దివ్యోత్సవంబులు సేవించుకొనుచు కొన్నిదినంబులుండ దలంచి శ్రీ శ్రీ నంబెరుమాళ్ల సన్నిధికి విచ్చేసిరి. ఉభయవిభూతి నిర్వహణ భారము తమపై నుంపబడుటేగాక "ఉడయవర"ను బిరుదనామము సైతము శ్రియఃపతి యనుగ్రహమున నెవరు లభించిరో యట్టి బహుపరిభావ సంపన్నులగు శ్రీమద్రామానుజ యతీంద్రులకే యాచార్యులై తిరుమంత్రార్థ, చరమ శ్లోకార్థ రహస్యములన్నియు గృపజేసిన మన శ్రీ తిరుకొట్టియూరు గోష్ఠిపూర్ణుల శ్రీరంగనగర మునగల భాగవతోత్తములందఱు పలువిధముల సత్కరించు చుండిరన నాశ్చర్యమేమున్నది. వారు త్రికాలములందు శ్రీరంగ నాధుని సేవించుకొని మంగళాశాసనం బొనర్చుచు, భాగవతోత్తములగు శ్రీ పెరియనంబిగారిని, శ్రీ తిరుమల యాండాన్‌గారిని, శ్రీ తిరువరంగప్పెరుమాళరయరును దర్శించి భగవద్భాగవతా

చార్యగుణానుభవం బొనర్చుచు నప్పుడప్పుడు శ్రీమద్రామానుజ యతీంద్రుల మఠమున కరిగి వారి కాలక్షేపగోష్ఠిని శిష్యసమృద్ధిని గని యానందించుచు కొంతకాలము గడపి యిక స్వగ్రామమున కరుగ నుద్యుక్తులై శ్రీ రామానుజులవారితో మీరు కొన్నిదినములు శ్రీ నమ్మాళ్వారను గ్రహించిన తిరువాయిమొళిలోని యమూల్యాంశములు శ్రీ తిరుమల యాండాన్ సన్నిధిలో వినదగి యుండునని బలికి శ్రీ యతీంద్రులను తమ వెనువెంటనే శ్రీ తిరుమల యాండాన్ సన్నిధికి గొనిపోయి వారిని సేవింపఁజేసి, పరస్పర వందన ప్రతివందన యోగక్షేమాది విషయములన్నియు యథావిధి జరిగిన వెనుక శ్రీ తిరుమల యాండాన్‌గారితో "శ్రీ శఠగోప దివ్యప్రబంధ వ్యాఖ్యానము లన్నియు దేవరవారికి కరతలామలకములు మన రామానుజ యతీంద్రుల కవిసాంతముగఁ దెల్పిన వీరి మూలమున నెందఱో యుజ్జీవింతురు. మన యాచార్యముఖోల్లాసమునకును నిది మిక్కిలి యనుకూలముగ నుండును గదా ? యనిరి. అపుడు శ్రీ తిరుమల యాండాన్" భాగ్యము దాసున కపూర్వ విషయము స్ఫురింపజేసితిరి. ఇంతకన్నను దాసుని కుత్తమ కైంకర్యము వేఱొండెయ్యది. అటులనే గానిం డని, శ్రీరామానుజ యతీంద్రులతో "రేపటినుండియే మీరు కాలక్షేపమున కుపక్రమింపవచ్చున"ని బలికిరి. శ్రీ గోష్ఠిపూర్ణులు మఱుదినమే తమ స్వస్థానమున కరుగ తలచినట్లు విజ్ఞాపనం బొనర్చి నియమనముఁబొంది శ్రీ యతీంద్రులతోగూడా తాము వేంచేసి యుండిన స్థలమునకువచ్చి శ్రీ రామానుజులవారిని మం

గళాశాసన మొనర్చి. వారి మతమున కనిపి తాము మఱుదినమే శ్రీ కస్తూరిరంగని నియమనముబొంది స్వస్థలమునకు వేంచేసిరి. శ్రీమద్రామానుజ యతీంద్రులనుదినంబును శ్రద్ధాభక్తులతో తిరువాయిమొళిలోని విశేషార్థములు శ్రీ తిరుమలయాండాన్ గారి సన్నిధిలో కాలక్షేపమొనర్చుచు యానందాబుధి మగ్నులగుచుండిరి. ఒకానొక దినము కాలక్షేపమొనర్చుచుండ శ్రీ శఠవైరి శ్రీసూక్తులలో మూడవ తిరువాయిమొళిలోని రెండవ పదిలో మూడవ పాశురమగు "అరియక్కాలత్తుళ్లే" యను శ్రీసూక్తికి శ్రీ యాళవందారునుండి తాము వినిన యర్థము నను గ్రహింప, శ్రీ యతీంద్రులు యీ యర్థము పరమవిలక్షణముగ నున్నది గాని యీ పాశురమునకు మఱొక విధముగగూడ యర్థవిమర్శ జేయదగును గదా యనిరి. పాఠకమహాశయులారా! ఈ పాశురమును, పాశురార్థమును గ్రంధవిస్తర భీతిచే దెల్పిన వాడను గాను, విమర్శన తెలియగోరువారు భాగవతోత్తములనుగ్రహించిన శ్రీ ఆరాయిరప్పడి యిత్యాదిగురుపరంపరా ప్రభావములుగల శ్రీ కోశములద్వారా తెలిసికొన బ్రార్థించువాడ. ఇటుల శ్రీ యతీంద్రులా పాశురమునకు తమకు స్ఫురించిన యర్థముగూడ వాకుర్వ శ్రీ తిరుమలయాండాన్ ముఖంబున విన్నదనంబుదోప మీరు శ్రీ యాళవందారు పరిగృహీత శ్రీసూక్తులంతగ పాటింపక విశ్వామిత్ర సృష్టివలె మీకు తోచినరీతి బలుకుచున్నారు. ఇట్టి యసాధారణశక్తిగలవారు మావంటివారికడ నేర్చుకొనదగిన దేదియు నుండదు. రేపటినుండిచ్చటికి కాలక్షేప మొనర్పరాబని

లేదని శ్రీ కోశము ముడిచివైచి, దిగ్గునలేచి లోనికరిగిరి. శ్రీ యతీంద్రులు సాయంకాలము వఱకు వేచినను శ్రీ యాండాన్ గారి దర్శనమభావ మయ్యెను. కాలాతీతమగు చుండుటచే కాల గతికి వగచుచు, శ్రీ యతీంద్రులు స్వమఠమునకొచ్చి చేఱుకొని యనుతాపపడుచుండిరి. శ్రీ యతీంద్రులు తిరుమల యాండాన్ (నామాంతరము మాలాధరాచార్యులు) సన్నిధిని కాలక్షేపము మానుకొనవలసి వచ్చినదను సంగతి శ్రీ గోష్ఠిపూర్ణులకు దెలిసిన తోడనే వారు శ్రీరంగనగరమునకు విచ్చేసి శ్రీరంగనాధుని సేవించుకొని తిరుమలయాండాన్ తిరుమాళిఘకు వేంచేసిరి. వారును శ్రీ గోష్ఠిపూర్ణుల క్షేమలాభములరసి సత్కరించుచుండ శ్రీరామానుజులు మీ సన్నిధిలో కాలక్షేపము మానినట్లు వినియు న్నాను విమర్శగా కారణము తెలుపమని "పలుక కొన్నిదినములు కాలక్షేపముకాగా నొకనాడు శ్రీ శఠవైరి శ్రీ సూక్తులలో "అరియక్కాలత్తుళ్లై" యను పాశురమునకు మన యాచార్యులగు శ్రీ యాళవందారులానతిచ్చిన యర్థము నేను జెప్పగా రామాను జులు దీనికి వేరొక విధముగగూడ నర్థముజెప్ప నొప్పునని తమకు తోచిన యర్థముజెప్ప నాకు వారియెడ కాలగతిచే మిక్కిలి యతుష్టిగలిగి కాలక్షేపము మానుకొనమని బల్కితిని. నాటి నుండి వారిచటికి రామానుకొనిరని బలికిరి. అపుడు శ్రీ గోష్ఠిపూర్ణులు ఆపాశురమునకు యిరువురు సాయించిన యర్థములున్ను వారిమూలముననే గ్రహించి, ఆండానే! మనమిరువురము నీ పాశుర మాచార్య సన్నిధిలో కాలక్షేప

మొనర్చుచుండ నొక యర్థము సూత్రమువిని రెండవ యర్థము సాయించు నంతలో మీరు తీవ్రకార్యాంతరమున నరిగితిరి. ఆ సమయములో మన యాచార్యులు సాయించిన యర్థమే శ్రీ రామానుజులను దెల్పియుండిరి. గాన నిక శ్రీ రామానుజ యతీంద్రులయెడ మీరెప్పటివలె సుప్రసన్నులై వారిని మీ సన్నిధికి రప్పించుకొని సాంతముగ కాలక్షేపమనుగ్రహింపుడు. ఇది గాక యొక రహస్యవిషయము మీకడ విజ్ఞాపనం బొనర్చుచున్నాడ. అన్యథా భావింపకుడు. శ్రీ రామానుజ ప్రభావసౌరభము మీరనుదినంబును నాఘ్రాణించుచుండియు నిట్టి ప్రమాదమున కెటుల గుఱియైతిరో నాకు బోధపడలేదు. వారియెడ మీరిటులపచారపడుట కనుతాపము నాకును గలుగుచున్నది. శ్రీకృష్ణభగవానునకు శ్రీ సాందీపమహర్షి యాచార్యత్వమును, శ్రీ చక్రవర్తి తిరుమహనార్లకు (శ్రీరాములు) శ్రీ వసిష్ఠమహర్షి యాచార్యత్వమును నెట్టిదో సాక్షాత్ తిరువనందాళ్వాన్ యంశజులగు శ్రీ రామానుజ యతీంద్రునకును మనవంటివారి యాచార్యత్వమును నట్టిదేయని తెలియదగునని బలుక, శ్రీ తిరుమలయాండాన్ నేనే ప్రమాదపడి యుండుట మీ యనుగ్రహమున నాకిపుడు సుస్పష్టముగా బోధపడినది. ఇదే మీ వెనువెంటనే శ్రీ రామానుజ మఠంబునకు రానుద్యుక్తుడనై తిననిరి. అపుడు శ్రీ గోష్ఠీపూర్ణులు, శ్రీ మాలాధరార్యులను వెంటగొని శ్రీ రామానుజ మఠమున కరిగిరి. శ్రీ రామానుజులును నాచార్యద్వయమునుగని యాశ్చర్యానందనిమగ్నులై "మీరిఱువురిటుల దాసునియెడ నవ్యాజకృపచే

దరుదెంచుటచే ధన్యుడనైతినని సేవించి సత్కరించిరి. స్వగ్రామము నుండి విచ్చేసిన శ్రీ గోష్ఠీపూర్ణుల కుటుంబక్షేమలాభము లడిగి సంతసించిన వెనుక శ్రీ గోష్ఠీపూర్ణులు శ్రీ తిరుమల యాండాను వంకజూడ వారు శ్రీ రామానుజ యతీంద్రులతో యతీంద్రా మీరు మా యాచార్యరుచి పరిగ్రహమగు పాశురార్థమునకు భిన్నార్థము కల్పించితిరని పొరపడి మీయెడ మిక్కిలి యపచారపడితిని. పరమాప్తులును, పరమ భాగవతులును నగు నీ గోష్ఠీపూర్ణుల వలన సంశయనివృత్తి గలిగి యపచార క్షమాపణవేడ నరుదెంచితినని యంజలి ఘటించిరి. అపుడు దేవరవారు సర్వజ్ఞులు. దాసుని వింతగా ప్రార్థింప నవసరముండదు. సదా దేవరవారి చిత్తానువర్తినై యుందుననిరి. శ్రీ తిరుమలయాండాన్ అపుడు" మీకు శ్రీ యాళవందారు దివ్యహృదయపేటికలోని యమూల్యరహస్య రత్నము లెట్లు కరతలామలకములుగ నున్నవో దాసుని కింకను బోధపడలేదనిరి. అపుడు శ్రీ యతీంద్రులు పరమాచార్యులను దర్శించు భాగ్యము లేకున్నను, దాసునికి వారియెడనేకలవ్యభక్తి యుండుటచే వారిహృదయములో నిమిడియుండిన విశేషార్థములు గోచరమగుచుండుననిరి. అపుడు శ్రీతిరుమల యాండాను శ్రీ రామానుజులవారి పరమాచార్య పదాంబుజభక్తి కలరి యెప్పటివలె కాలక్షేపమునకు రమ్మనిచెప్పి స్వగృహమున కరిగిరి. శ్రీ గోష్ఠీపూర్ణులును, శ్రీ యతీంద్రసత్కారమువడసి, శ్రియఃపతిని సేవించుకొని మరుదినము స్వగ్రామమునకు వేంచేసిరి. శ్రీ తిరువాయిమొళి వ్యాఖ్యావసహితముగను సాంతముగను శ్రీ తిరుమల

యాండాన్‌గారి సన్నిధిలో కాలక్షేపమొనర్చి యుచిత సత్కార ముల యతీంద్రులు శ్రీ ఆండానును తృప్తిపరుప వారపుడు యతీంద్రా శ్రీ తిరువరంగపెరుమాళరయరు సన్నిధిలో మీరు వారికి శ్రద్ధాభక్తులతో సేవయొనర్ప చరమపర్వ రహస్యముల న్నియు ననుగ్రహింతురు. నేనును మీ విషయమై వారిని ప్రార్థించెదననిరి. భాగ్యమటులనే గానిందవి శ్రీ తిరుమలయాం డాన్ మంగళాశాసనము వడసి శ్రీ యతీంద్రులు తమ మఠము నకు వేంచేసిరి. శ్రీ శఠవైరి శ్రీసూక్తుల సత్సంప్రదాయార్థము లతో కాలక్షేపము సాంతముగ శ్రీ యతీంద్రులకు శ్రీ మాలాధ రార్యులనుగ్రహించి తమ పుత్రుని శ్రీ యతీంద్ర పదాబ్జము లాశ్ర యింపజేసిరి. శ్రీ యతీంద్రులు కొన్నిదినములు గడచిన వెనుక శ్రీ తిరువరంగప్పెరుమాళ్ అరయర్ సన్నిధికి వేంచేసి దండ వత్ప్రణామము లాచరించి యంజలి బద్ధులై నిలువ వారు శ్రీ యతీంద్రుల యోగక్షేమములరసి సంతసించి మీకు పంచమో పాయనిష్ఠ నభ్యసింపజేయ శ్రీ తిరుమల యాండాను నాతో ప్రశంసించి యుండిరి. ఆ విషయమై మీ యభిప్రాయమేమని యడుగ శ్రీ యతీంద్రులు "దాసుడీవిషయమై దేవరవారి సన్నిధి నాశ్రయింప నుద్దేశించియే విజ్ఞాపనం బొనర్ప నొచ్చియుండుట యనిరి. అపుడు వారు" పరమ సంతోషము ఆకార్యము రేపటి నుండియే కావొచ్చునని బలికిరి. యతీంద్రులు వారినియమనము బొంది స్వమఠమునకు విచ్చేసి కొన్నిదినములు నేను శ్రీ తిరువ రంగప్పెరుమాళరయరు సన్నిధిలో నుండదలచితిని, మఠమునకు

సంబంధించిన కైంకర్యములందును. కోవెల కైంకర్యములందును నపరిమత్తులై భగవద్భాగవత ముఖోల్లాసముగ వర్తింపుడని, శ్రీ కూరేశాది శిష్యులతో బలికి మరుదినము నుండియే వరరంగార్య లను నామాంతరమున వెలయు, శ్రీ తిరువరంగప్పెరుమాళ్ అరయరును నాశ్రయించిరి. ఉదయవరులరయరు తిరుమేనునకు తిరువంజనాది కైంకర్యము లొనర్చుచు వారి ముఖోల్లాసమున కనుగుణమగు సకల కైంకర్యములను స్వాశ్రమాభిమాన మించు కైన పాటింపక సలుపుచు శ్రీ దండకారణ్యవాసులగు మహర్షులు శ్రీరామసౌందర్యముగని "పుంసాం మోహన రూపాయ పుణ్య శ్లోకాయ మంగళం" అని నిరంతర మంగళాశాసనం బొనర్చి నటుల నాచార్య దివ్యమంగళ విగ్రహమనుక్షణ మాపాద మస్తకము ధ్యానించి మంగళాశాసనం బొనర్చుచు, నాఱుమాస ములు శశ్రూష నొనర్చిరి. అపుడొకనాడు తిరువరంగప్పెరు మాళ్ యరయరు శ్రీ యతీంద్రులకుండు యాచార్యభక్తి శ్రీ నమ్మాళ్వారియెడ శ్రీ మధురకవియాళ్వార్ల కుండిన ప్రతిపత్తి వంటిదని దెలిసి, యతీంద్రా మీకుండు యాచార్యనిష్ఠ యనన్య సామాన్యము. నాసర్వస్వమును మీరు వశపరచుకొంటిరి. "గురు రేవ పరంబ్రహ్మ. గురురేవ పరందనం.।గురుదేవపరః కామోగురు రేవ పరాయణం గురురేవ పరావిద్యాగురురేవ పరాగతిః। యస్మా త్తదుపదేష్టాసౌతస్మాద్గురుతరోగురుః" అను శ్రీసూక్తి మీ నడవడికచే చూపించి లోకమున కాదర్శప్రాయులైతిరి. అని పంచమోపాయనిష్ఠా రహస్యములన్నియు బోధించి, తమ యను

జుని శ్రీ యతీంద్రుల సన్నిధిలో నాశ్రయింపజేసిరి. ఇక శ్రీ పెరియతిరుమలనంబి సన్నిధిలో శ్రీ ద్వయమంత్ర రహస్యము నకు ప్రబల వ్యాఖ్యానమననొప్పు శ్రీమద్రామాయణము నం దలి యర్థవిశేషము శ్రీ యతీంద్రు లెటులభింపగలిగిరో ముమ్ముందు విజ్ఞాపనం బొనర్పబడును. ఒకానొక రాజు తన చరమదశలో తన కుమారుడింకను రాజ్యపాలనకు తగిన వయస్సుగలవాడు గానపుడు తాత్కాలికముగ రాజ్య, కోశాదులు మంత్రుల వశ మొనర్చి, యవియన్నియు నాపుత్రుడు రాజ్యముజేయనర్హ వయస్సుగలవాడై నపుడు యతని స్వాధీనము జేయుడని నియ మించినరీతి, శ్రీ యాశవందార్లు పరమపదించు కాలమున, తమ జ్ఞానధనమంతయు, తనసన్నిధి నాశ్రయించి యుండు వెనుక బేర్కొనబడిన శ్రీ గోష్ఠిపూర్ణాది పంచాచార్యుల వశంబొనర్చి మీరీ జ్ఞానధనంబు క్రమంబుగ శ్రీ రామానుజాధీనం బొనర్పుడని నియమించి యుండుటచే, యీ యాచార్య పంచకమును తమ వశముననున్న జ్ఞానధనమంతయు శ్రీ రామానుజ యతీంద్రుల వశం బొనర్చి, శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణ సార్వభౌము లనుగా నొనర్చి మంగళాశాసనం బొనర్చిరి. గాన మన యతీం ద్రులు తమకు పూర్వులగు యాచార్యులను తిరుముడి సంబంధు లుగను, తమ్మాశ్రయించిన యాచార్యపరంపరను తిరువడి సంబంధు లుగను భావించి యాదరించుచుండిరి. మణిహారమున నాయక మణివలె వీరు పూర్వోత్తర గురుపంక్తికి మధ్య విలసిల్ల హృద యంగమముగ బ్రకాశించుచున్నారు. ఈ భావమునే దెల్పు,

శ్లో॥ అమునాతపనాతిశాయి భూమ్నా, యతిరాజేనని బద్ధనాయక
శ్రీః। మహతీ గురుపంక్తిహారయష్టిర్వి బుధానాం హృదయంగ
మావిభాతి॥ అను శ్రీమద్వేదాంత దేశికులవారి శ్రీసూక్తి యిం
దుకు ప్రబల ప్రమాణముగదా.

ఇరువదితొమ్మిదవ గుచ్ఛము—సంపూర్ణము.

—o—

శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావ కల్పకము.

## ముప్పదవ గుచ్ఛము

---

శ్రీ నంబెరుమాళ్ల సన్నిధిలో శ్రీమద్రామానుజ యతీంద్రులు కోవిలలోని సకల కైంకర్య నిర్వహణ భారము వహించినది మొదలు స్వరూపజ్ఞులగు యర్చక స్వాముల కానందదాయకముగ నుండినదిగాని మలిన మనస్కులకు చౌర్యాద్యసత్కార్యములకు నెడములేమి శ్రీ యతీంద్రులయెడ నత్యంతాసూయావిష్టులై చెరుపుఁదలపెట్టి కొందఱు మాటలాడుకొని సమయమున కెదురుచూచుచుండిరి. సన్యాసాశ్రమ పద్ధతి ననుసరించి యతి మాధుకర భిక్షపైననే నాధారపడి యుండవలెనను నియమము ననుసరించి శ్రీమద్రామానుజ యతీంద్రులును శ్రీవైష్ణవస్వాముల గృహములలో మధూకర భిక్షలభించుచుండిరి. నిత్యతిరువారాధన క్రమము శ్రీ భగవద్గీతాభాష్యము, వాఖ్యానసహితగద్యత్రయము తమ పదారవిందము లాశ్రయించినవారి కందఱకు కృపజేసి యుజ్జీంపజేయుచు, కైంకర్యములందు నందును శ్రీ

రంగనాధుని కైంకర్యములందు వినీతిదప్పి వర్తించువారిని తీవ్ర ముగ నిగ్రహించుచుండిరి. ఇవి తమ మేలుకొరకేగదా యని భావించక వెనుక బేర్కొనినరీతి వీరికి చెఱుపుఁజేయనదనుఁ జూచుచుండు వారిలో నొకడు నొకనాటి మధ్యాహ్నవేళ భార్య చెవిలో కొన్నిరహస్యములు యామె వెంటనే పలికెను. కటకటఁ బడి కన్నీరుగార్చి శ్రీహరీ యని చెవులు మూసుకొనెను నీవు భర్తనగునా యాజ్ఞ నుల్లంఘిచిన నధోగతి పాలయ్యెదవుసుమా! యని భర్తపాపము పాపభీతిగలనాయమాయకురాలిని బెదరించెను. ఇటుల భార్యాభర్తలు సంభాషించుచుండగనే శ్రీ యతీంద్రులవారా శ్రీవైష్ణవుని యింటి ముంగిట మాధుకరభిక్షకైవచ్చి నిలిచిరి. భార్య. భర్తయాజ్ఞమీఱ వెఱచి లోనికిబోయి భిక్షాన్నము గొనివచ్చి మెఱపుమెఱసినటుల నెద్దియో మనంబున స్ఫురింప మన యతీం ద్రులకు భిక్షనొసంగి వందనంబాచరించి లోని కరిగెను. వా రామె ముఖవైఖరి గమనించి యతికి వందనఁబిడి భిక్షయొసంగిన యా భిక్షాన్నము పరిత్యజింపదగినదను నియమమును పాటించి కావేరీ ప్రవాహములో భిక్షాన్నము పరిహరించి యానాడు శుద్ధో పవాస మొనర్చిరి. భిక్షయొసంగు సమయమున భీతిచే నా యిల్లాలు చేతులు వనుకుటచే క్రిందపడిన యన్నమున స్వల్ప భాగమొక శునకము భక్షించి యసువులంబాసినది బహుజనము గమనించి గృహస్థు స్వభావమునుబట్టి గూడనిది విషమిశ్రిన్న మని నిర్ధారణ చేసుకొని మన యతీంద్రులకీ ఘాతకునిచే నేమి యుపద్రవము వాటిల్లునో యని భయభ్రాంతు లయ్యునది కావేరి

ప్రవాహమున పరిహరింపబడెననివిని స్వస్థచిత్తులైరి. ఈ దారుణ కృత్య మానగరవాసుల కందఱకు తెలిసి బహుమందిని విషాద చిత్తులంజేయుటేగాక గోష్ఠీపూర్ణులకును, వారిని సేవింపబోయి యుండిన శ్రీ పెరియనంబిగారికిని తెలియవొచ్చెను. మఱుదినము మధ్యాహ్న వేళకా యాచార్యాద్వయము కటకటంబడుచు కావేరి దాటి శిష్యునిచూడవచ్చిరి. శ్రీ మహాపూర్ణ గోష్ఠీపూర్ణులు శ్రీ గోష్ఠీపురి నుండి వచ్చుచున్నారను వార్త తెలిసిన తోడనే బహుశిష్యసమేతులై శ్రీ యతిరాజుల వారాచార్యద్వయమును నెదుర్కొన నరిగిరి. మండువేసవి మధ్యాహ్న వేళ నొకరికే చాలిచాలని నొకవృక్షఛాయ నిరువురాచార్యు లెటులనో సర్దుకొని నిలుచుండిరి. శిష్యసహితులై శ్రీ యతీంద్రులు విచ్చేసి యాచార్యద్వయమున కంజలి ఘటించి శ్రీ పెరియనంబిగారి సంజ్ఞ గ్రహించి శ్రీ తిరుకొట్టియూరునంబి (శ్రీ గోష్ఠీపూర్ణులు) గారి తిరువడివత్తా మరలపైవ్రాలిరి. వ్రాలి ఘడియయయ్యెను. లేవమని యాచార్య నియమనముగాలేదు. మఱియొక ఘడియ కాజొచ్చెను. లేచుట కాచార్య నియమనమింకనులేదు. ఆచార్య నియమనము లేనిదే శ్రీ యతీంద్రులులే వదలచుకొనలేదు. యా మండువేసవిని ప్రచండ మార్తాండాతపతప్తసి కతాతలమున స్వాచార్య పదాబ్జములపై వ్రాలి లేవకుండు సన్నివేశమునుగను చుండిన శిష్యుల హృదయము తపింపజొచ్చెను. కొందరి మోములు వెలవెల బోయెను, కొందరిగ్రుడ్లు నీఱుగ్రమ్మెను, మఱికొందరి నేత్రములనుండి కన్నీరు ధారధారగా గారజొచ్చెను.

శ్రీ పెరియనంబిగారు సైతము కన్నీటి ధారచే పెదవులు దడవుచు చేలాంచలమున కన్నీరొత్తుకొనుచు కర్తవ్యమూహింపజాల కుండిరి. ఆ శిష్యబృందములో నొక భాగవతోత్తముడు దుఃఖమాప జాలక గద్గద కంఠుడై శ్రీ గోష్ఠిపూర్ణులవంకజూచి మహాత్మా! యెన్నడును కనివిని యెఱుగని, నీ కఠిన శిలలవంటి మనంబులం గరగించు పద్ధతియు శిష్టాచారములో నొకటిగా నున్నదను విషయము యత్యంత సందేహసంతాపముల కాస్పదమయ్యె. కోమలముగ వికసించిన పుష్పహారము కమలిపోవులాగు దారుణాగ్నిని పొరలింపజేయుట హృదయ విదారకము. శిష్యసాహస మన్నింప వేడెదనని స్వాచార్యులగు శ్రీ యతీంద్రులను బలవంతముగ లేవనెత్తి వారికి మాఱుతాము శ్రీ గోష్ఠిపూర్ణ పదాంబుజలపై వ్రాలిరి. మఱుక్షణమే శ్రీ గోష్ఠిపూర్ణులు యా శిష్యరత్నమును కరాంబుజముల లేవనెత్తి మేజనునిమిరి, వీపుపైతట్టి, యందఱిని చేరువనున్న నొక భవ్యావిశాలారామమునొద్దకు శీఘ్రముగ దోడ్కొని చని, శ్రీ యతీంద్రుల తిరుమేనుని మరుచునా శిష్యబృందముతో "యన్నలారా సకలచేతన సంజీవనకరమగు మృతసంజీవనివంటి యీ యతీంద్రుని తిరుమేనుగాసి వొందు ఘాతుక కార్యమునకు విధిలేకనే నొడిగట్టవలసి యుండినందుకు మిమ్ములను, నా యంతర్యామయగు శ్రీరంగనాధుని నన్ను మన్నింపవేడుచున్నాను. ఆచార్యుడని పేరుబెట్టుకొనిన నీ భూసురుని యందింత విపరీత చర్య యర్థమాయని మీ రనుమానించుట నైజమేగాని ప్రచండాపతప్తవాలు కాపటలిచే తపించుచుండు శిరీష కుసుమమునుం

బోలి స్వాచార్య తిరుమేనుగని యెట్టి ప్రాణాంతమైన సాహస కార్యమునకుగాని, పరిణామ పాపఫలమునకుగాని, వెనుదీయక స్వాచార్య తిరుమేనుపై నీగను సైతము వ్రాలనీయక కలకాలము కాపాడ బూనువాడే నిజమైన శిష్యుడనిపించుకొని యనన్య సామాన్య సాయుజ్యఫలము చూఱగొనును. ఇట్టిత్యాగశీలురు మీయం దెవ్వరైన గలిగిననాడే మన యతీంద్రులు నిరుపద్రవ ముగ తాము నిర్వహింపదగిన కైంకర్యము నిర్వహింపగలరు గాన నట్టివారు మీలో నెవ్వరందురాయని వెదకుటకే నిట్టివిధిలేని విషమపరీక్ష నొనర్పవలసె. ఇక మీరు నాయెడ నన్యదాభావింప నవకాశముండదని దలంతునని యంజలి ఘటించి వారినందఱ సంతోష స్వాంతులం గావించుటేగాక వారితో" మీరీ శిష్యరత్నము నడవడియే యాదర్శ ప్రాయముగ భావించి యాచార్య శుశ్రూష యొనర్చి ధన్యతం(గాంచగల శక్తిసంపన్నులనుటకావంతయు సందియము లేదని నాదృఢాశయము. దీనినె నా మంగళాశాసన ముగ భావింపుడని దైర్యోత్సాహములు వారికి పురికొల్పిరి. శ్రీ యతీంద్రులతో "మీరు నేడుమొదలు యీసాధు సత్తముడగు శ్రీ కిడాంబి యాచ్చానొసంగు భిక్షయే గైకొను నియమము బూను డని బల్కి" శ్రీ యతీంద్రులను తచ్ఛిష్య బృందమును శ్రీ రామానుజ మఠమున కనిపితాము శ్రీ పెరియనంబిగారి ప్రార్థ నచే వారి తిరుమాళిఘకు వేంచేసిరి. శ్రీమద్రామానుజ యతీం ద్రుల తిరుమేనుపై నివ్విధమగు నాదరముచూపి పరమాచార్య మంగళాశాసనము వడసి సానదేరిన రత్నమువలె శిష్యరత్నము

లలో నాటినుండి సుప్రసిద్ధులై వెలయు శ్రీ కిడాంబి యాచ్చాను గారు. శ్రీయుడయవరుచే మున్ముందు దర్శనప్రవర్తకులుగ నియమింపబడబోవు చతుస్సప్తతి సింహాసనాధి పతులలో కిడాంబి వారి వంశమునకు మూలపురుషుఁడు. వీరికే ప్రణతార్తిహరాచార్యులను నామాంతరముగూడ గలదు. ఆరశాణి పాలమను నగ్రహారము వీరి జన్మభూమి. శ్రీలక్ష్మీసహస్రము, విశ్వ గుణాదర్శము, యిత్యాది గ్రంధములనుగ్రహించి సుప్రసిద్ధి వహించిన శ్రీ వెంకటాధ్వరియను నాచార్యులవారు వీరి వశంబు నకు జేరినవారే. వీరు వడమాచార్య సంప్రదాయమునకుఁ జేరిన వారగుటచే వీరి వంశమునకు మూలపురుషులగు శ్రీ కిడాంబి యాచ్చానును వడమాచార్య సంప్రదాయమునకుఁజేరిన వారేయని సంప్రదాయజ్ఞులుఁ జెప్పుచుందురు. ఏ సంప్రదాయమునకు జేరిన ప్రపన్నులైన నేమి? అఖండ గురుభక్తికాదర్శ ప్రాయులు సదాపూజనీయులే. శ్రీ గోష్ఠీపూర్ణుఁడు స్వగ్రామమునకు వేంచేసిన వెనుక మఱొక దినంబున మలినమానసులగు కొందరు కోవెల పరిచారకులు తామిదివఱకుఁ బూనిన ప్రయత్నము విఫలమగు టకు చింతించి యెటులనైన యతిరాజులను తుదముట్టింప నెంచి తమవంటి స్వభావమేగల యర్చకుని చెవిలో గుసగుస లాడిరి. ఆయన యందుకు సమ్మతించెను. ఉదయమున సేవాకాలమునకు శ్రీమద్రామానుజ యతీంద్రులు కోవెలకు వేంచేసిరి. అభిగమ నారాధనాదులు యధావిధి జరిగిన వెనుక శ్రీ యతీంద్రులకు తిరువరివట్టము సమర్పించి తీర్థము శఠారియనుగ్రహించుతఱి,

తీర్థమివ్వబోవు యర్చకుని హస్తములు వణకజొచ్చెను. శ్రీ రామానుజ దివాకర తేజమతడు జూడలేక యతిరాజా! దుర్మార్గుల మాటలకు లోబడి జగదేక గురువులగు దేవరవారి నంతమొందింప నీ తీర్థమున విషము ప్రయోగించిన మహా పాపాత్ముడనని శ్రీవారి తిరువడివత్తామరలపై నా యర్చకుడు వ్రాలెను. అచ్చటఁ జేరిన భాగవతోత్తములముఖారవిందములు వాడెను. అపుడు శ్రీ యతిరాజులవారు యర్చకుని కభయ మొసంగి నతనితో పెరుమాళ్లకు సమర్పింపబడిన తీర్థమును పరిహరింపగూడదు. ఆ తీర్థము యనుమాన ముడిగి దాసున కనుగ్రహింపుడనిరి. భాగవతులు వారింప జూచులోపులనే శ్రీ యతిరాజులవారి నియమన మివ్విధముగనై యుండుట చేత వారందరు నోటమాటలేక నివ్వెరపడి చూచుచుండిరి. శ్రీ యతీంద్రులు శ్రీరంగనాధుని స్మరించుచు మున్మారా విషతీర్థము గ్రోలిరి. అవ్వల శఠారి ప్రసాదాదులచే వారు సత్కరింపబడిరి. భాగవతగోష్ఠికి మాత్రము శ్రీ యతీంద్రునియ మనముచే భగవన్నివేదితమగు మఱియొక పాత్రలోని తీర్థమొసంగబడెను. తీర్థస్వీకరణానంతరము శ్రీ యతీంద్రుల తిరుముఖ మండలము నుండి గడచిన దినములకంటె నత్యధికసము జ్వలదీధితులు వెలువడి భాగవత బృందమున కాశ్చర్యము గలిగించెను. విషమునకన్న నెంతయో భయంకరమగు సంసార విషమును హరించి జీవులనెల్ల సముద్ధరణ మొనర్ప నమృత పదవినుండవతరించిన యాదిశేషాంశజులగు శ్రీ యతిరాజులవారి

లోన బ్రవేశించిన విషమమృతముగ మారినదని వారి తిరుముఖ మండలమే చెప్పక జెప్పుచుండలేదా? ఇటుల ప్రపీత విషతీర్థంబు సర్వతోముఖ ప్రకటిత వైభవులై శ్రీరామానుజ దివాకరులానాడు మొదలు మఱింత సముజ్వల దీధితులచే వెలసిరి.

ముప్పదవ గుచ్ఛము—సంపూర్ణము



విజ్ఞాపన:- ఈ శుద్ధాశుద్ధ పత్రికద్వారా గ్రంథమున, నక్షరములు సవరించుకొని పఠింపుడు.

# శుద్ధాశుద్ధపత్రికా.

| పుట. | పంక్తి. | అశుద్ధం. | శుద్ధం. | పుట. | పంక్తి. | అశుద్ధం. | శుద్ధం. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 14 | తిరుమంజన | తిరువంజన | 24 | 11 | కొందరు | కొందఱు |
| | 20 | | | 28 | 22 | ఇంకమ | ఇంకను |
| ,, | 17 | నచ్చిలా | నశ్చిలా | 29 | 5 | నవరింప | నవతరింప |
| 2 | 2 | నిగ్రహ | విగ్రహ | ,, | 8 | ముఖోలా | ముఖోల్లా |
| ,, | 4 | కృతార్గ | కృతార్ధు | 31 | 4 | బట్టి | భట్ట |
| 3 | 13 | నారాయణ | నారాయణా | 32 | 8 | వైంఠ | వైకుంఠ |
| 4 | 7 | పరత్త్వ | పరత్వ | ,, | 12,12 | మశ్రు | మిశ్రు |
| 5,7 | 19,7,9 | తిరుమంజ | తిరువంజ | 33 | 6 | కరక | కరణ |
| 6 | 4 | మనుష్య | మనుష్యః | 35 | 23 | యోగము | వియోగము |
| ,, | ,, | వైష్ణివ | వైష్ణవ | 37 | 7 | మంత్రు | మంత్ర |
| ,, | ,, | యాత్ | యాః | 39 | 15 | అందను | అంపఱు |
| 8,9 | 10,16 | సీతాచల | శీతాచల | 40 | 11 | దాసి | రాక్షసి |
| 10 | 1 | అందరి | అందఱి | 51 | 11 | ఉదా | అన్నోదా |
| ,, | 3 | నో | యో | 52 | 20 | భగ | భంగ |
| ,, | 4 | నుగల | మగల | 53 | 13 | యని | వని |
| ,, | 7 | చుచు | చు | 64 | 8 | వివరించి | విరించి |
| 11 | 2 | హిమాంశే | హిమాంశా | 66 | 18 | వీప్ర | వీరప్ర |
| 13 | 15 | అపుడ | అపుడు | 67 | 9 | తోడ్చ | తోడ్వ |
| 14 | 17 | హించిను మడింప | హంబిను మడింప | 71 | 10 | ఒక | వెన్నెలగా |
| 15 | 14 | ణానర | ణార | 73 | 4 | యోఘుకుని | యోధుకతి |
| ,. | 21 | శాకిరిక | శారీరక | 78 | 12 | పదార్గ | పదార్ధము |
| 16 | 1 | ష్యతి | ష్యాతి | ,, | 18 | నిడచి | నడిచి |
| 16 | 5 | లేకనే | లేకయే | 82 | 13 | నిఅ | నిక |
| ,, | 6 | గలదు | గలరు | ,, | 20 | గాన | దాన |
| ,, | 19 | హీను | హీన | 88 | 2 | బీగ | తాళ |
| 17 | 22 | బూతిము | భూతము | 89 | 13 | స్వభావ | స్వభావము |

| | | | |
|---|---|---|---|
| 90 | 2 | చెప్పిన | చెప్పినరీతి |
| 91 | 1 | మంట | మండ |

| పుట. | పంక్తి. | అశుద్ధం. | శుద్ధం. |
|---|---|---|---|
| 92 | 3 | నీవే | మీరే |
| 95 | 20 | ప్రపూర్ణ | పూర్ణ |
| 99 | 9 | యంజల | యంజలి |
| ,, | 14 | సము | శము |
| 103 | 21 | భార | ఖార |
| 108 | 7 | ర్యామ | ర్యామి |
| ,, | 9 | శేషత్ర | శేషత్వ |
| 114 | 11 | లాక | లోక |
| 115 | 13 | సంసార | సంస్కార |
| 116 | 8 | వాయమొన | వాయిమొలి |
| ,, | 12 | సుమింత్రులు | సుమంత్రులు |
| ,, | 13 | మాజుల | మానుజుల |
| 118 | 2 | రాసి | వాసి |
| ,, | 5 | గాని | గొని |
| 119 | 1 | లోలోకా | లోకా |
| ,, | 22 | మందారు | వందారు |
| 120 | 6 | దన్నుడ | ధన్యుడ |
| 125 | 16 | మొక | నొక |
| ,, | 20,21 | శారీరక | శారీరక |
| 127 | 7 | దురఖ | దురభి |
| 130 | 19 | కాటి | కానాటి |
| 131 | 8 | నిముభా | నీముఖా |
| 132 | 7 | న్నవి | న్నవి |
| ,, | 8 | మెను | మేను |
| ,, | ,, | స్పష్టత | స్వస్థత |
| ,, | 9 | లాత్రి | రాత్రి |
| 133 | 20 | కరస | కరస |

| పుట. | పంక్తి. | అశుద్ధం. | శుద్ధం. |
|---|---|---|---|
| 134 | 14 | లగు | డగు |
| 135 | 18 | మొన | రొమొన |
| ,, | 20 | మాచి | మాలి |
| ,, | 21 | వారి | వారివారి |
| 135 | 22 | దలళి | దలచి |
| 136 | 5 | శ్రీ | త్రి |
| ,, | 7 | బూది | బూని |
| 153 | 6 | గడ్డ | గట్టు |
| 159 | 5,12 | శ్య | శ |
| ,, | 13 | యామె | నామె |
| 169 | 2 | ముంకుము | ముండును |
| 170 | 15 | రాజిస | రాజస |
| 176 | 8 | లఖించి | లభించి |
| 177 | 6 | పత్ర | పత్రము |
| 187 | 3 | గీతాశాస్త్రము | గీతాభినయము |
| 191 | 4 | మారు | మాఱు |
| 215 | 10 | తగ | తగము |
| ,, | ,, | వారికి | సేవించువారికి |
| ,, | 11 | విమీద | వికమీద |
| 218 | 18 | కల్పి | కల్ప |
| 250 | 9 | తన | తమ |
| 259 | 5 | గృవా | గృహీత |
| 265 | 5 | రహస్యములు | రహస్యములు పలికెను |
| | | యామె | యామె |
| | | కటకట | వెంటనే |
| | | వెంటనే | కటకట |

# వైరాగ్యపద్యరత్నావళి

---

భక్తిప్రవాహము నుప్పొంగజేయు మహాపురుషరచిత గ్రంధములనుండి సేకరించబడిన పద్యరత్నము లిందుగలవు. కొద్ది ప్రతులే మిగిలియున్నవి గాన త్వరపడి తెప్పించుకొనుడు.

| | |
|---|---|
| ధ్యానప్రకరణము | 0—1—0 |
| స్తుతిప్రకరణము | 0—4—0 |
| ధ్యానముస్తుతి ఒకేసంపుటమున | 0—4—6 |

చిరునామా:—

బుక్కపట్టణం నరసింహాచార్యులు,
తాడిపత్రి.